శ్రీః

శ్రీమత్స్యాద్రి లక్ష్మీనృసింహస్వామినే నమః.

# శ్రీమత్స్యాద్రిక్షేత్ర మాహాత్మ్యము.

(బ్రహ్మాండపురాణాంతర్గతము—ఆంధ్ర తాత్పర్య సహితము)

పండితపరిష్కృతము

శ్రీమత్స్యాద్రినివాసులు

## శ్రీ కరే శిద్ధప్పశెట్టి అండ్ సన్సు

వారి ద్రవ్యసహాయముచే ముద్రింపబడి

ఖాద్రిశ్రీనృసింహస్వామివార్ల దేవస్థానపరిపాలకవర్గము (బోర్డుఆఫ్‌ట్రస్టీస్)

వారితరపున

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

శ్రీ పి. సీతారామయ్య గారిచే

ప్రచురింపబడినది.



1953.

వెల: 1-4-0

# మంగళాశాసనము

దంష్ట్రాకరాలవదనమురాలభ్రు జ్వలచ్ఛిఖమ్
శాద్రిస్థలగతం జీయాన్నారసింహం పరం మహః.

ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలన్తం సర్వతో ముఖమ్
నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్.

(శ్రీనృసింహానుష్టుభమన్త్రః).

క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా

(గోపాలఅష్టాదశాక్షరీమన్త్రః)

శ్రీః

---

అస్త్యాంధ్రమండలే కాచిత్సవ్త్తినా ఘాటికీ పురీ
అర్చారూపీ నరహరిః యామధ్యాస్తే స్వలీలయా. 1

తత్రార్యవైశ్యాన్వవాయ పయోనిధి సుధాకరః
మల్లయ్యశ్రేష్ఠినామాఽఽసీత్ శ్రీసానకుఃగోత్రజః. 2

తస్యాఽఽసీద్వేంకటాంబాఖ్యా సహధర్మచరీ సతీ
సాఽసూత తనయం శ్రేష్ఠం శిద్ధప్పశ్రేష్ఠినం ప్రభుమ్. 3

తస్య చాసీత్ సుబ్బమాంబా భార్యా భర్తృదృఢవ్రతా
పుమర్థా ఇవ చత్వారో జజ్ఞిరే తనయాస్తయోః. 4

తేష్వగ్రజః పృథుశ్రీః లక్ష్మీనారాయణాభిధః శ్రేష్ఠీ
తదనన్తరజః శ్రీమాన్ అచ్చన్నశ్రేష్ఠ్యభిఖ్యయా ఖ్యాతః. 5

వేంకటరమణయ్యాఖ్యః వదాన్యమాన్యః తృతీయజః శ్రేష్ఠీ
వేంకటసుబ్బయ్యాఖ్యః శ్రేష్ఠీ తేష్వవరజో వరజః. 6

సపుత్రదారాః సామాత్యాః చత్వారో భ్రాతరస్త్విమే
భాద్రిప్రభుప్రసాదేన లోకక్షేమవిధాయినా. 7

వేదోక్తమానుషానన్దపరకాష్ఠానుభావినః
వర్ధన్తాం సుచిరం కాలం ప్రజాతన్తుశ్చ వర్ధతామ్. 8

గ్రన్థోపస్కర్తా.



కీ. శే. శ్రీ కరే సిద్ధప్పశ్రేష్ఠిగారు, కదిరి.

(గ్రంథ ముద్రాపకుల జనకులు)

# ఆశీస్సు

ఆంధ్రదేశమున రాయలసీమయందు 'కదిరి' యను పేరుగల సుప్రసిద్ధపుణ్యక్షేత్రముకలదు. అందు శ్రీనారసింహమూర్తి అర్చారూపియై సాన్నిధ్యము జెందియున్నాడు. ఈపుణ్యక్షేత్రమందు ఆర్యవైశ్యకుల మను పాలసముద్రమున చందమామవలె మల్లయ్యశ్రేష్ఠి నాబరగు మహనీయుడు వెలసెను. వీరిది సానుకులగోత్రము. వీరికి వేంకటసుబ్బమ్మ యను పతివ్రతాలలామము సహధర్మచారిణియై యుండెను. ఆయమకు సకలగుణసంపన్నుడగు శిద్దప్పశ్రేష్ఠియను కుమారుడుదయించెను. శిద్దప్పశ్రేష్ఠిగారు సుబ్బమ్మయను సతీమణిని పరిణయమాడిరి. ఈపుణ్యదంపతులకు నాలుగు పురుషార్థములవలె నలువురు పుత్రులు జన్మించిరి. వారలు జ్యేష్ఠానుక్రమముగ లక్ష్మీనారాయణశ్రేష్ఠి అచ్చన్నశ్రేష్ఠి వేంకటరమణయ్యశ్రేష్ఠి వేంకటసుబ్బయ్యశ్రేష్ఠి యనుపేరుల( బ్రసిద్ధులై యున్నారు. వీరలు సకల సుగుణ సంపూర్ణులును ధర్మకార్యనిరతులును దేవబ్రాహ్మణ సేవాతత్పరులును దీనానాథపోషకులునై వెలయుచున్నారు. సకలలోక క్షేమంకరమగు శ్రీఖాద్రి ప్రభుని కరుణచే వీరలు పుత్ర మిత్ర కళత్ర బాంధవాశ్రితజన సమేతముగ 'ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః, తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణాస్యాత్, స ఏకో మానుష ఆనందః' అని వేదమందు నిర్వచింపబడినరీతిని అపరిమితములగు నైహికసౌఖ్యముల నన్నిటిని అనివారితముగ ననుభవించుచు చిరకాలము వర్ధిల్లుదురుగాక. వీరల సంతతియు నిట్లే ఆచంద్రతారార్కముగ వృద్ధిచెందుగాక.

సర్వే జనాః సుఖినో భవన్తు.

గ్రన్థోపకర్తా.

శ్రీ లక్ష్మీ నారసింహాయ నమః

శ్రీ విఖనసే నమః

# గ్రంథ పరిచయము.

భారతభూమియందు నాగరికత మతముతో నారంభించి మతముతో నభివృద్ధియై మతముతో అవినాభావసంబంధము గలిగియున్నది. మతము లేని నాగరికత లేదు. మతము దైవభక్తితోను అట్లే భక్తి దేవాలయము లతోను నిత్యసంబంధము గల్గియున్నది. వారివారి అలవాటుచొప్పున మతములు వేరువేరైనను, దైవము వేరువేరైనను, ఆయామతము లందును దైవములందును లోలోపల ఏకాకారముతో అనువృత్తమగు చుండెడి ఒక్క విలక్షణశక్తిని వారువారు ఐకమత్యములో అనుభవించుచు అసూయాద్వేషములులేక పరస్పరము స్నేహమోహములతో మెలగు చున్నారు. ఐతే ఖండాంతరములందలి నాగరికత పరిపూర్ణము కాకుండు టచే వారలకు తత్త్వము తెలియక మతాంతరములను ద్వేషించి స్వమతస్థాపనకు వారు వ్యర్థప్రయత్నములను చేయుచుందురు.

ఆలయములేని గ్రామము దేవునిపూజ లేని గృహము శ్మశాన ముతో తుల్యమని శ్రీమద్భాగవతమందు చెప్పబడినది. అనగా శ్మశానము ప్రేతలకు ఆవాసస్థానము గనుక, పైనిపేర్కొనబడిన ఆయూరను ఆగృహమునను నివసించు ప్రజలను ప్రేతములవలె చైతన్యములేని వారని అర్థము తేలినది.

దేవాలయము ప్రజలందరకును సమానస్వామ్యముగల సొత్తు. "దేవుని పెండ్లికి అందరు పెద్దలే" అను సామెతకూడ ఇందుకే పుట్టినది. దేవాలయము శాంతిని చేకూర్చు నిలయము; భక్తిని పెంపొందించు దోహదము; విద్వాంసుల నాకర్షించు రాజాస్థానము; ఆర్తులనాశ్వాస పరచెడి కల్పపాదపము; కర్మకారకుల శిల్పనైపుణికి ప్రదర్శనశాల;

వాణిజుల కృషికర్మకు పంటచేను; శిశువులకు ఆటపట్టు; వృద్ధులకు శర ణాలయము; కౌటుంబికులకు ఆశాసర్వస్వము; జ్ఞానులకు పరమాకాశము; వైదికులకు అగ్న్యాయతనము; తటస్థులకు వినోదభూమి.

ఆలయములను నిర్మించుట వానిని పోషించుట తమజీవితమునకు పరమలక్ష్యముగనెంచి ప్రాచీనకాలమునుండియు చక్రవర్తులుమొదలు నిరుపేదలవరకు ఈపుణ్యకార్యములందు ప్రవర్తించుచుండుటచే భారత భూమి భక్తిభాగ్యముతోఁ దులతూగుచున్నది. కాలవైషమ్యముచేఁ దరు చుగ ఒడుదుడుకులు కలుగుట సహజము. అంతమాత్రమున ఆలయముల ప్రాభవము మున్ముందు శిథిలమై పోవచ్చునని దిగులుచెందనక్కరలేదు.

భక్తి అనగా పెద్దలయెడ పిన్నలకుగలుగు నిరవధికమగు ప్రీతి విశేషము. భక్తినిఅలవరచుకొనవలెనన్న భక్తిచేయదగినట్టి వ్యక్తిని ముందుగా మనము తెలిసికొనవలయును. ఆవ్యక్తియందలి గొప్పదనము నందలి ప్రకారభేదములను మనము అనుసంధించుకొనవలయును. మనో వాక్కాయములచే ఆవ్యక్తికి పరిచర్య చేయుచుండుటచే ఆతనియందు లక్ష్యము నిలిచి ఏమరుపాటునగూడ మనచిత్తమాతని విడచిపోక ఆతని యందే లగ్నమై యుండగలదు. ఇదియే ఆలయములందలి విగ్రహముల ఉపయోగము. భక్తిమార్గము నలవరచుకొనువారలకు సాధనముగను. భక్తియలవడినవారలకు ప్రొద్దుపుచ్చుకొనుటకు సాధనముగను విగ్రహ ములు, వానితోఁ దేజరిల్లు ఆలయములు ఆవశ్యకములై యున్నవి.

ప్రస్తుతమగు ఖాద్రిస్థలపురాణము బ్రహ్మాండపురాణమున రుద్ర నారద సంవాదరూపమున చెప్పబడియున్నది. ఇప్పుడు 'కదిరి' అని వ్యవహరింపబడుచున్న గ్రామమే పురాణమందు ఖాద్రి, ఖాద్రీ, ఖాదిరీ యనుపేరులతో వాడబడియున్నది. ఈశబ్దములనిష్పత్తిని సాధించుటకు ప్రయత్నించుటకంటె, అష్టములుగా నీరూపములకు సాధుత్వము నంగీ

కరించుట యుక్తమని తలచి ఈమూడుపదములను గ్రంథమందు ఆయా స్థలములలో ప్రయోగింపబడినట్లు నేను వ్రాయవలసివచ్చినది. ఐనను యథావస్థితముగ నిట్లు వ్యుత్పత్తిని చెప్పవచ్చునని తలచెదను.

ఖాద్రి:- ఖ శబ్దమునకు విష్ణుపదమను అర్థము ప్రసిద్ధము. విష్ణు పాదాంకితమగు పర్వతమిచ్చటనుండుటచే ఖ శబ్దమునకు విష్ణుపాదాంకి తత్వపర్యంతము అర్థముచెప్పి అద్రి శబ్దమును చేర్చినయెడల విష్ణు పాదాంకిత పర్వతముగలచోటు ఖాద్రియని సిద్ధించుచున్నది.

ఖాదిరీ:- ఈప్రదేశ మొకప్పుడు ఖదిరారణ్యమైయుండుటచే వృక్ష విశేష వాచకమగు ఖదిర శబ్దముపై సమూహార్థక ప్రత్యయముచేర్చి దానిని పురీశబ్దమునకో పురశబ్దమునకో విశేష్యనిఘ్నముచేయుటచే నిది వ్యుత్పన్నము కాదగును.

ఖాద్రీ :- ఖాదిరీశబ్దముయొక్క దేశ్యరూపమైయుండదగును.

ఈపుస్తకమునందు ఖాద్రిక్షేత్రమహిమ పదిమూడధ్యాయములలో 767 శ్లోకములుగ చెప్పబడినది.

కృతయుగమున హిరణ్యకశిపుఁడను దైత్యుని సంహరించి ధర్మ సంరక్షణము చేయుటకై శ్రీమహావిష్ణువు నరసింహావతారమెత్తినప్పటి దివ్యమంగళవిగ్రహము ఇచ్చటి మూలమూర్తియొక్క స్వరూపము. అష్ట బాహువులుగలిగి ఆసీనులైయున్న మూర్తికి సంహారావసరమందు ప్రక్కను శ్రీభూదేవులు లేరు. సమీపముననే వామపార్శ్వమున భక్తరత్న మగు ప్రహ్లాదకుమారుని విగ్రహము స్థానకావసరమున నున్నది (పేజి 8 శ్లో 36-53).

భృగుముని తపముజేసి వరమడుగగా ప్రసన్నుడగు నారసింహుడు తన ప్రతినిధిగ శ్రీభూదేవులతో గూడిన పంచలోహనిర్మితములగు మూడువిగ్రహములను ఒకపేటికయందుంచి వానిని నిత్యమారాధించి

కొనుటకై భృగువునకనుగ్రహించెను. ఆమూర్తులే ఇయ్యవి. ఈమూర్తులకు వసంతవల్లభులనియు వసంతమాధవులనియు పురాణమందు చెప్పబడిన పేరులు నేటికిని వ్యవహారమునందు కలవు. వీరే ఉత్సవమూర్తులు (పేజి 74 శ్లో 76-2).

వైఖానసశాస్త్రరీతిని పంచబేరములు ఈసన్నిధియందు ఆరాధనములో నున్నవి. ధ్రువకౌతుకబలిబేరములు దేవీరహితములుగను ఔత్సవస్నాపనబేరములు దేవీసహితములగు విష్ణురూపముగను నున్నవి.

సాధారణముగ పురాణములందు పుణ్యక్షేత్రములనుగురించి చెప్పునప్పుడు అందొకపర్వతము నది అరణ్యము దైవము ఆరాధనవిధానము నను విషయములను చెప్పుట వాడుకయైయుండును. అదేరీతిని ఈపురాణమందును చెప్పబడినది.

వేదవ్యాసులు అసురులకు తెలియకుండుటకై రహస్యముగ ఖాద్రిక్షేత్రమునకువచ్చి శిష్యులకు ధర్మోపదేశముచేసిన స్థలమగుటచే దీనికి వేదారణ్యము (పేజి 86) అనియు, హిరణ్యకశిపుని సంహరించినంతట దేవతలందరును భగవానుని నిచ్చటిపర్వతమందు స్తోత్రముచేయుటచే పర్వతమునకు స్తోత్రాద్రి(పేజి 26 శ్లో 48) యనియు అర్జునుడిచ్చటి నదియొక్కతీరమందు తపస్సుచేయుటచే నదికి అర్జుననది అర్జునతీర్థము (పేజి 108 శ్లో 75-77) ననియు పేరుప్రసిద్ధులు కలిగినవి. అర్జుననదియు ఆరుపుణ్యతీర్థములతోగూడియున్నట్లు చెప్పబడినది. అయ్యవి పురాణక్రమము ననుసరించి శ్వేతపుష్కరిణి భృగుతీర్థము లక్ష్మీతీర్థము గంగాతీర్థము గరుడతీర్థము భవనాశినీతీర్థము అనుపేరులుగలవి.

ఇందు గంగాతీర్థము విమానప్రదక్షిణములో ఆగ్నేయదిశను పాకశాల కెదురుగ నున్నది (8 అధ్యాయము). ఒకప్పుడిది విశాలమైన నదఖావిగనుండి కొలదికాలముక్రిందట సాధారణమైనఖావిగ కట్టబడి

యున్నది. విమానప్రదక్షిణమునందే ఈశాన్యభాగమున భవనాశినితీర్థ మున్నది (10 అధ్యా). ఇది శిలాసోపానములుతీర్చి నిర్మింపబడిన సువిశాలచతురశ్ర పుష్కరిణి. ఆలయప్రాకారమునకు వెనుకభాగమున భృగుతీర్థము కలదు (6 అధ్యాయము). ఇదియు శిలాసోపానములు తీర్చి కట్టబడి దీర్ఘచతురశ్రమైయున్న విశాలమగు పుష్కరిణి. దీనిమధ్య నీరాడి మండపశిథిలము మాత్రమిప్పుడుకలదు. పుష్కరిణికి ఈశాన్య దిశను తీర్థవారి మండపమున్నది.

ఆలయమున కాగ్నేయదిశను రమారమి రెండుఫర్లాంగులు దూర ములో శ్రీతీర్థముకలదు (7వ అధ్యాయము). ఇదియును శిలాసోపానములు తీర్చి కట్టబడిన చిన్నదగు చతురశ్రపుష్కరిణి. దీనికి దక్షిణపుటొడ్డున 'చింతపూలఉట్టి' అనుపేరుతో ఒక నాలుగు స్తంభముల మండపమును దానికిదక్షిణమునయున్న ఉద్యానవనములో పాకశాలామండపమును కలవు. చిత్రాపూర్ణిమనాడు ఈమండపమున శ్రీవారికి ఆస్థానోత్సవము వనభోజ నము జరుగుచుండును. ఈతీర్థమున కాగ్నేయదిశను సుమారు ఒకమైలు దూరములో గరుడతీర్థముకలదు (పేజీ 88). ఇదియు శిలాసోపానములు తీర్చికట్టి మధ్యమవై శాల్యముగల చతురశ్రపుష్కరిణి. దీనికితూర్పు దిశను విశాలమగు మండపము దానినడుమ శ్రీఆంజనేయుని శిలావిగ్రహ మును కలవు. ఖాద్రియందలి భక్తబృందమంతయును విశేషించి ఆర్య వైశ్యులును ప్రతిమాఘమాసము యిప్పదిదినములు ప్రాతఃకాలమందు మాఘస్నానమునకై ఈపుష్కరిణికివచ్చి స్నానదానాదుల జేసికొని మాఘపురాణమును వినిపోవుచుండురు. దీనికి సుమారు 1 మైలుదూర ములో దక్షిణముగ దేవరచెఱువు అనుతటాకము కలదు (పేజీ 48 శ్లోకం 28). ఇందుండియే ఈక్షేత్రమందలి తీర్థరాజములకు ఆధారభూత మైన అర్జునీనది (మద్దులేరు) ఉత్పన్నమై ప్రవహించినది. ఈనది పైనిచెప్పబడినతీర్థములనుచుట్టి భృగుతీర్థముయొక్క పడమరభాగము నుండిఉత్తరముగా ప్రవహించి ఇచ్చటికి 8 మైళ్ళదూరమున చిత్రావతీ

నదిలోచేరి అచ్చటికి సుమారు 70 మైళ్ళదూరమున కడపమండలమందలి కమలాపురమువద్ద పెన్నసదిలో కలియుచున్నది.

ఆలయమునకు తూర్పుదిశను సుమారు రెండుమైళ్ళదూరమున శ్వేతతీర్థముకలదు. ఇదియు శిలాసోపాన నిర్మితమగు దీర్ఘచతురశ్రపుష్కరిణి. ఇయ్యది భగవానుని చరణకమలములను చతుర్ముఖుడు తన కమండలు జలములతో కడుగగా యేర్పడినది (5 అధ్యాయము). దీనికి దక్షిణముగ గోవర్ధనాద్రి కలదు (పేజి 52, 58, 62) గోవర్ధనాద్రికి దక్షిణముగ సుమారు 4 ఫర్లాంగులు దూరములో స్తోత్రాద్రియున్నది. ఇందు శ్రీమహావిష్ణుని రెండుపాదముల చిహ్నము లచ్చటచ్చట కలవు.

ఈపర్వతమునకు దిగువభాగమున కొండలనరసింహదేవుని చిన్న ఆలయము అందు శ్రీలక్ష్మీనరసింహుని మూలమూర్తియు గలవు. ప్రతి యేట మకరసంక్రాంతి మరునాటి కనుమపండుగనాడు శ్రీశైలాద్రి నరసింహమూర్తి ఆలయమునుండి ఇచ్చటికి వేంచేసి ఆస్థానము జరిగి శ్రీగోవర్ధనాద్రిప్రక్కగా శ్వేతతీర్థమార్గమున విచ్చేసి సమీపమున మార్గములో పాలమండపమునందు క్షీరనివేదనము జరిగి అటుపై గ్రామమువెలుపల నున్న పార్వేటమండపములో వినోదములు జరిగి శ్రీవారు వీథిప్రదక్షిణముగ సన్నిధికి వేంచేయుదురు. మార్గమునందే ఉన్నపార్వేటమండపమునందు విజయదశమినాడు శమీపూజ మొదలగునవి జరుపబడు చున్నవి.

గ్రంథవిస్తరభీతిచే అధ్యాయముల కథాసంగ్రహమును వ్రాయలేదు.

ఏనాడో నిర్మింపబడిన శ్రీవారి విమానమండపాద్యప్రాకార గోపురాదులకు జీర్ణోద్ధారము చేయవలసిన అవసరమెంతయో నేడు కనబడుచున్నది. నిత్యనైమిత్తిక కైంకర్యములుకూడ ప్రాచీనకాలమందు జరుపబడిన వైభవముతో నేడును జరుపబడుట అవసరము. భక్తశిఖామణులు తమశక్తికొలది కైంకర్యములందు ప్రవర్తించి కైంకర్యములను జరిపి శ్రీవారికృపకు పాత్రులగుదురని కోరెదను.

'దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోऽనుపాలనమ్
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదమ్'

అనునది పరమ రహస్యమైన ధర్మము.

ఈగ్రంథమునకు తాత్పర్యమువ్రాయునపుడు ఈస్థలసంప్రదాయమును లేశమేని యెరుగని నేను గ్రన్థమందలి యథాశ్రుతార్థమునే వ్రాసినంతలో సంప్రదాయ విరుద్ధములగు నంశములున్నయెడల ప్రాజ్ఞులు వానిని మన్నింతురని వేడెదను. తాత్పర్యమును వ్రాయుటలోకూడ నామామూలు ధోరణిలో వ్యావహారిక భాషనే నేను ఉపయోగించితిని.

ఈపుస్తకముయొక్క సంస్కృత మాతృక నాసంచారములో ధర్మవరములో శ్రీ ఆనిగొండె సంస్థాన పండితులు శ్రీ ఉ. వే. అర్చకం వెంకటరాఘవ భట్టాచార్యులవారి గృహములో నాకు లభించినప్పుడు వారు ఇది కదిరివారి గ్రంథమేనని చెప్పినట్లు నాకు జ్ఞాపకమువచ్చు చున్నది.

ఈగ్రంథప్రకాశనమందు మొదటినుంచి తుదివరకు ఉత్సాహముతో కృషిచేసిన శ్రీమాన్ అర్చకం వేంకటరామాచార్యులు వారికిని ముద్రణమునకైన ద్రవ్యమును శ్రీనారసింహార్పితముగ నొసంగిన శ్రీకరే శిద్దప్పశెట్టి అండ్ సన్సు వారికిని వారిలో విశేషించి శ్రీవేంకటరమణయ్య శెట్టి వారికిని శ్రీదేవస్థానం పరిపాలకవర్గముతరపున శ్రీ పి. సీతారామయ్య గారికిని ఈప్రచురణకైంకర్యమునందు నాకు అవకాశముకల్పించి యాదరించినందుకు నేను కృతజ్ఞుడను

తిరుపతి, ఆకులమన్నాడు
విజయనామ సంII జ్యేష్ఠబహుళ ౯ ఆదివారము. పార్థసారథి భట్టాచార్యులు

శ్రీమత్ఖాద్రి నృసింహాయనమః

# కృతజ్ఞత

దక్షిణాపథమందలి సుప్రసిద్ధ పుణ్య క్షేత్రములలో శ్రీమత్ఖాద్రి క్షేత్రమొక్కటి. ఇయ్యది రాయలసీమ యందనంతపుర మండలములో నున్నది. ఇచ్చటి శ్రీలక్ష్మీనరసింహుని భక్తజనులు ప్రాయికముగ రాయలసీమ యందంతటను, మైసూరు రాజ్యమునం దధికముగను గలరు. శ్రీవారికి ప్రతిసంవత్సరము ఫాల్గుణమాసములో జరుగు బ్రహ్మోత్సవమునకు ఆంధ్రదేశమందలిప్రజలు లెక్కకుమిక్కిలిగ వచ్చుచుందురు. శ్రీస్వామిని సేవించుటకు వచ్చిన భక్తులు పలువురు స్థలపురాణమునుగురించి సహజముగా ప్రశ్నించుచుందురు. నేను వారికి గ్రంథస్థముగ సమాధానము చెప్పుటకు తగిన ఆధారములు దొరకక, యేవో పెద్దలవలన వినిన కొన్నివిషయములను మాత్రము చెప్పుచు వచ్చుచుంటిని. ఆవిషయములు సప్రమాణములే యగునని మాత్రము నా నమ్మకము. మాతండ్రిగారగు శ్రీమాన్ ధాళపట్టం నృసింహాచార్యులువారుతమ పవిత్ర జీవితమునంతను శ్రీవారి యారాధనమునకే అంకితమొనర్చి, వారి వైభవమును స్వానుభవముచేగూడ తెలిసికొని, బాల్యమునుండి నాకును చెప్పుచుండిరి. వారు ఖాద్రిస్థల పురాణము బ్రహ్మాండపురాణమున నున్నట్లుచెప్పుచుండిరి. వారుగతించిన వెనుక శ్రీవారియారాధన కైంకర్యము దాయప్రాప్తముగ నాకే సంక్రమించుటచే, నేనాకైంకర్యమును యథాశక్తిగ నిర్వహించుటలో శ్రీఖాద్రిస్థల పురాణమును సంపాదింపవలెనను కుతూహలము కలిగి క్రమక్రమముగా నాయాశ వృద్ధియైనది. నాగృహమందలి ప్రాతపుస్తకములను పలుమారు పరిశీలించితిని. ఆగ్రంథము

లభింపలేదు కాని శ్రీఖాద్రిస్థలపురాణ మందలి 'శ్రీనృసింహస్తుతి' యను శీర్షికక్రింద కొన్నిశ్లోకములు మాత్రములభించెను. గ్రంథము సమగ్రములభింపలేదను కొరతతో సందర్భము కలిగినపుడెల్ల ఈజ్ఞాపకముతో ప్రవర్తించుచునేయుంటిని. ఇట్లుచాలాకాలము గడచినది. ఒకప్పుడు సుమారు 7 సంవత్సరములకుముందు తిరుపతిదేవస్థానం వైఖానస పండితులగు 'శ్రీమద్వైయాకరణ పంచానన విద్వత్కవిసార్వభౌమ' ఇత్యాది బిరుదాలంకృతులగు శ్రీమాన్ పార్థసారధి భట్టాచార్యులువారు సంచారవశమున మాగృహమునకు వచ్చియుండగా మాటవరుసను వారితో స్థలపురాణవిషయము ప్రస్తావించితిని. వారునువియతో అందుకై తాము అన్వేషించి చూచెదమనిచెప్పి అదేప్రకారము శ్రమతోవెదకి, తమపుస్తకభాండాగారమున నున్న తాళపత్రమాతృకను గురించి నాకు తెలియి పరచిరి. గ్రంథము లభించినందుకు సంతోషపడి దానిని ముద్రించి ప్రచురించుట అవసరమని నమ్మి ముద్రించుటకువలయు ద్రవ్యమును సేకరింప సంకల్పించితిని. నాపరిచితులతో నాకోరికను చెప్పుచువచ్చితిని. ఒకనాడీయంశమును ఆర్యవైశ్య కులాలంకారులగు శ్రీకరే సిద్దప్పశ్రేష్ఠి అండ్సన్సు వారితో మనవిచేసితిని. ఈకైంకర్యము వారికి ప్రాప్తియుండుటచే వారందులకు సమ్మతించి ఈగ్రంథ ముద్రణవ్యయము సమగ్రముగ నొసంగిరి.

వీరికుటుంబము జన్మసిద్ధముగ సత్కార్యనిరతిగలిగి ప్రసిద్ధిజెంది యున్నది. ఖాద్రి పంచాయతీబోర్డుకుచెందిన పార్కుమైదానములో గాంధి మహాత్ముని విగ్రహమును వీరు ప్రతిష్ఠింపచేసిరి. ఈప్రాంత్యమందలి పేదసాదలలో వీరిసహాయ్యమును పొందనివ్యక్తి ఒక్కరైనను లేరనుట అతిశయోక్తి కాజాలదు. వీరులోగడకూడ శ్రీలక్ష్మీనృసింహ స్వామివార్ల మహారథమునకు మూడువేల రూప్యములను వెచ్చించి జీర్ణోద్ధారమును చేయించి, నాటనుండినేటికిని రథోత్సవమునకు ఉభయకర్తలై యున్నారు. కీర్తిశేషులగు శ్రీసిద్దప్పశ్రేష్ఠిగారి పుత్రరత్నములగు లక్ష్మీనారాయణశ్రేష్ఠి, అచ్చన్నశ్రేష్ఠి వెంకటరమణయ్యశ్రేష్ఠి, వెంకటసుబ్బయ్యశ్రేష్ఠి అని ప్రసిద్ధి

జెందిన నలువురలో శ్రీఅచ్చన్నశ్రేష్ఠిగారు శ్రీవారి ధర్మకర్తలలోనొక రైయున్నారు. శ్రీవిజయనామసంవత్సర జ్యేష్ఠమాసములందు జరుపబడిన శ్రీవారి ఉన్నతప్రతిష్ఠా కార్యక్రమములో వీరుతమతోడి పరిపాలకవర్గము వారితోకలసి చేసినకృషి ప్రశంసాపాత్రమైనది. ఆలయకార్యనిర్వాహకవర్గములోచేరిన శ్రీకుటాగూళ్లనరసింహారెడ్డిగారు, శ్రీకుటాగూళ్లనారాయణ రెడ్డిగారు ఈగ్రంథముప్రకటనను సాధించుటకు సకలవిధప్రోత్సాహము నుసమకూర్చిన దేవస్థానం యెగ్జిక్యూటివు ఆఫీసరు శ్రీ పి. సీతారామయ్య గార్ల సహకారమీయెడ స్మరింపదగినది. వీరలందరకు శ్రీఖాద్రినరసింహస్వామి ఇష్టార్థములను అనుగ్రహించుగాక.

తమ విద్యానిలయమందలి ఈగ్రంథమాతృకను దయతో మాకొసంగి శుద్ధప్రతినిచేసి ఆంధ్రతాత్పర్యమునుకూడ వ్రాయించి ముద్రింపించి యిచ్చిన శ్రీపార్థసారధి భట్టాచార్యులువారికి నేను సర్వదాకృతజ్ఞుడను.

| | |
|---|---|
| కదిరి.<br>విజయసంవత్సర<br>జ్యేష్ఠబ॥ ఆదివారము | ఇట్లు<br>శ్రీధాళవట్టం వెంకటరామాచార్యులు<br>శ్రీమత్ఖాద్రి నృసింహ పాదపద్మారాధకులు. |

శ్రియై నమః

శ్రీమతే నారసింహాయ నమః

శ్రీవిఖనసే నమః

# శ్రీమతి బ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే

# ఖాద్రీమాహాత్మ్యమ్.



## ప్రథమోఽధ్యాయః

నారద ఉవాచః-

శ్రుతం శ్రీరంగవాసాది త్వత్తో హైమవతీప్రియ
క్షేత్రాణాం చైవ మాహాత్మ్యం కావేర్యాః సరితస్తరామ్॥
హరేరర్చావతారస్య చతుర్ధా భేవధారిణః
దివ్యం సిద్ధం మానుషం చ స్వయం వ్యక్తమితీరితమ్॥
తస్య సర్వస్య భేదస్య ప్రస్తారం త్రిపురాన్తక
స్తోత్రాద్రిరిత్యభిహితం తన్మే విస్తరతో వద॥
సంక్షేపాద్బ్రహ్మణః పూర్వం శ్రుతం తన్నః ప్రపంచతః
విస్తరాచ్ఛ్రోతుమిచ్ఛామి మాహాత్మ్యం తస్య భూభృతః॥
తత్రత్య క్షేత్రమాహాత్మ్యం తీర్థానాం చ విశేషతః
వేదారణ్యం మహీభాగే సర్వలోకనమస్కృతమ్॥
శ్రోతుకామోఽస్మి దేవేశ పార్వతీహృదయప్రియ
విస్తరాద్బ్రూహి సర్వం మే త్వాం నతోఽస్మి మహేశ్వర॥

శ్రియై నమః

శ్రీమతే నారసింహాయ నమః

శ్రీవిఖనసే నమః

# శ్రీమద్బ్రహ్మాండపురాణమున రుద్రనారదసంవాదరూపమగు ఖాదిరీమాహాత్మ్యము.



## మొదటి అధ్యాయము.

నారదుడు చెప్పుచున్నాడు:- ఓమహాదేవా! శ్రీరంగము మొదలగు పుణ్యక్షేత్రములయొక్కయు విశేషించి కావేరినదియొక్కయు ప్రభావమును నీవు చెప్పితివి. స్వయం వ్యక్తము దివ్యము సైద్ధము మానుషము నని నాలుగు విధములగు క్షేత్రములందు అర్చాబింబములరూపముగ సాన్నిధ్యము చెందెడి శ్రీమహావిష్ణునిస్వరూపగుణచేష్టితములను స్తోత్రాద్రి యని ప్రసిద్ధి చెందినట్టి ఖాదిరీక్షేత్రముయొక్క మాహాత్మ్యమును దయతో నా కుపదేశింపుము. (1-3)

పూర్వము చతుర్భుజునివలన నీ క్షేత్రమాహాత్మ్యము సంగ్రహముగా చెప్పబడుటను వింటిని. కాని దానిని వివరముగా నీవలన విన గోరెదను. ఓశంకరా! స్తోత్రాద్రి యను నాపర్వతముయొక్కయు అందలి ఖాదిరీక్షేత్రముయొక్కయు వేదారణ్యమను వనముయొక్కయు అందలి పుణ్యతీర్థములయొక్కయు మాహాత్మ్యమును విస్తరించి చెప్పుము. నిన్ను శరణము జెంది వినయముతో ప్రార్థించువాడను. (4-6)

పృష్టః ప్రోవాచ భగవాన్ శంకరో లోకశంకరః

శంకర ఉవాచః-

సాధు పృష్టం మహాభాగ తన్మే నిగదతః శృణు॥ 7

వేంకటాద్రిరితి ఖ్యాతో విద్యతే భూభృతాంపరః

తస్య పశ్చిమదిగ్భాగే దశయోజనసమ్మితే॥ 8

వేదారణ్యం మహచ్చాస్తి పుణ్యం పృథ్వీస్థలే ఘనే

స్తోత్రాద్రిరితి విఖ్యాతో విష్ణుపాదాంకితో గిరిః. 9

నానావృక్షైః సమాకీర్ణో నానామృగనిషేవితః

సానుభిర్బహుభీ రమ్యైః దేవఖాతై రనేకశః॥ 10

తపాంసి చక్రిరే యత్ర మునయః సంశ్రితవ్రతాః

యత్ర విద్యాధరా దేవా గంధర్వాశ్చాప్సరోగణాః॥ 11

ఆగత్య విర్ఘరోపాస్త సరస్సు జలకేళితాః

ఆతన్వస్తే నిర్మలేషు కమలోత్పలగన్ధిషు॥ 12

తస్య పశ్చిమదేశే తు విద్యతేఽర్జునవిమ్నగా

ఫుల్లారవిందకుముద స్ఫురదిందీవరాంచితా॥ 13

హంసైశ్చ వివిధైర్దివ్యైః క్రౌంచైః కారండవైస్తథా

సారసైశ్చక్రవాకైశ్చ తదా కోయష్టికైర్మనే॥ 14

సేవితా మహతీ రమ్యా నదీ గంగేవ పావనీ

యస్యా మారుతసంగేన పాపౌఘధ్వంసనం భవేత్॥ 15

తద్దేశవాసినాంపుంసాంకిముత స్నానపానయోః

మునే వక్ష్యే విశేషేణ తస్యా మాహాత్మ్యముత్తమమ్॥ 16

అంగైరివ శ్రుతిః షడ్భిః తీర్థైః షడ్భిరలంకృతా

తస్యాః పశ్చిమతీరేఽస్తి వనమండవిరాజితమ్॥ 17

ఇట్లు నారదునిచే అడుగబడినశంకరుడు చెప్పుచున్నాడు. ఓనారదా అడుగదగినప్రశ్నము నడిగితివి. భగవత్కథాశ్రవణమును చేయ నాశపడెడి నీవు ధన్యుడవు. వినుముసువర్ణముఖరీనదీతీరమున వేంకటాచల మను నొక పర్వతరాజము కలదు కదా. ఆపర్వతమునకు పడమటిదిశను పదియోజనములదూరమున వేదారణ్య మనుపేరిట ప్రసిద్ధమగు నొక పుణ్యవనము కలదు. ఆవనమునందు స్తోత్రాద్రి యనుపేరున ప్రసిద్ధమై భగవానుడగు శ్రీమహావిష్ణుని పాదచిహ్నము గల పర్వత మొండు కలదు.

ఆ పర్వతమున అనేకములగు వృక్షములు మృగములు మనోరమములగు చరియలు కొలనులు కలవు. 10

అచ్చట వ్రతనిష్ఠులగు మహర్షులు తపము సేయు చుండిరో అచ్చట విద్యాధరులు దేవతలు గంధర్వులు అప్సరస్సులు గుంపులుగా చేరి కమలోత్పలవాసితములగు నిర్మలోదకములుగల సేలయేళ్ళచెంత నుండెడి పుష్కరిణులందు జలక్రీడల నానందించుచుందురు. (11-12)

ఆపర్వతమునకు పడమరదిశను వికసించిన కలువలు తామరలు కలిగి హంసములు మొదలగు జలచరజంతువులచే కలకలలాడెడి అర్జున నది యను నొక నది కలదు. ఆనదినుండి వీచెడి గాలి సోకినంత మాత్రమున సకలపాపములుశమించును. అందు స్నానము చేయుచు ఆ యుదకమును పానము చేయుచు ఆతీరమున నిత్యనివాసముచేయు మహాభాగ్యము లభించిన వారియదృష్ట మేమని చెప్పవచ్చును? ఓ నారదా ఆతీర్థమాహాత్మ్యమును చెప్పెద వినుము. (13-16)

షడంగములచే నలంకరింపబడిన వేదమువలె నియ్యది యారు తీర్థములచే కూడియున్నది. ఆనది పశ్చిమ తీరమున చక్కని వనప్రదేశము కలదు. ఆవనము కేసర పున్నాగ పిప్పల చంపక

యత్ర కేసరపున్నాగ పిప్పలాశోకచంపకాః
కపిత్థబిల్వకుందైలామాకందార్జున కింశుకాః ॥ 18

చంపకోదుంబరప్లక్ష నాళికేరకదంబకాః
కాంచనవక్తమాలాదిసింధువారకవిద్రుమాః ॥ 19

తమాలహింతాలసాలతక్కోలధవపిప్పలాః
తింత్రిణీవటజంబీరజంబూబిల్వరకర్ణికాః ॥ 20

జంపాపనసబంధూకపాటలామ్రకురంటకాః
కృతమాలాః కురవకాః తిలసంజులకాస్తథా ॥ 21

ఖదిరాః పారిజాతాశ్చ దేవదారుసహాసనాః
ఖర్జూరకదలీపూగప్రియామలకపీలతాః ॥ 22

మాలతీకేతకీమల్లీ కుందమందారచంపకాః
ఖర్జూరకరవీరాదిసౌగంధిక సహాసనాః ॥ 23

సప్తపర్ణసముత్తుంగరంభాస్తంభామనోహరాః
సేవన్తికాసువాసన్తీలతావేష్టితశాఖినః ॥ 24

కలాయకుసుమాకీర్ణ వర్ణపర్ణసమావృతాః
ద్రుమాః కేచిన్సమాఖ్యాతమానాహ్వాభ్రంలిహద్రుమాః ॥ 25

సగిరిర్వానరాద్యైశ్చ పీతనీలముఖైర్వరైః
వానరైః సింహసంకాశైః గోలాంగూలైశ్చ చంచలైః ॥ 26

వేష్టితాః ప్రతిశాఖాసు (కామం) తైస్తైర్ద్విజైర్వరైః
శిఖావల్యః ప్రనృత్యన్తి మదాఘూర్ణితలోచనాః ॥ 27

కూజన్తి కోకిలాః కీర్ణాః శుకాః సమ్యఙ్మనోహరమ్
క్రౌంచాశ్చ సారసాః క్వచ్చిః చిత్రవర్ణఖగాః కలమ్॥ 28

స్వనన్తి మధురం తత్ర వసన్తసమయే ముదా
చిత్రమేవం విధారామైః పరితః శోభితా నదీ॥ 29

కపిత్థ బిల్వ కుంద ఏలా మాకంద అర్జున కింశుక చంపక ఉదుంబర ప్రహ్వా నారికేర కదంబక కాదంబ నక్తమాల సిందువారక విద్రుమ తమాల హింతాల సాల తక్కోల ధవ పిప్పల తింత్రిణీ వట జంబీర జంబూ బదర కర్ణిక జపా పనస బంధూక పాటల ఆమ్ర కురంటక కృతమాల కురవక తిలవంజుల ఖదిర పారిజాత దేవదారు సహాసన ఖర్జూర కదలీ పూగ మాలతీ కేతకీ మల్లీ కుంద మందార చందన ఖర్జూర కరవీర సౌగంధిక సహాసన సప్తపర్ణ రంభా నేమన్తికా వాసన్తీ మొదలగు మహావృక్షములు గుల్మములు లతలు వీనిచే నిండి నిబిడమై యున్నది. (17-24)

కలాయకుసుమములచేతను స్వర్ణపర్ణములచేతను శోభించు నట్టియు ఆకాశము నంటి పెరిగినట్టియు వృక్షము లెన్నియో అచ్చట కలవు. (25)

అచ్చటి పర్వతమందు అనేకవర్ణములు గల సింహసంకాశము లగు వానరములు వానరజాతికి చెందిన గోలాంగూలములు మొదలగు జంతువులు కలవు. (26)

ఆవృక్షశాఖలయందలి వివిధములగు పక్షిజాతులతో గూడి సంపన్నాహారపుష్టములై మదించిన ఆనెమళ్ళు ఆనందతాండవము చేయుచుండును. అందు గుంపులుగా చేరి కోవెలపక్షులును చిలుకలును క్రౌంచపక్షులు సారసములు మొదలగు స్థలజలవిహారులగు విహంగ మములు మధురముగ పాడుచుండును. వసంతకాలమున నీప్రదేశమున నెక్కడ చూచినను మధురగానము వినవచ్చుచుండును. మనోహర ములగు నిట్టి యారామములతో ఆవరింపబడిన నదియొక్కటి అచ్చట కలదు. (27)

వికసత్పద్మమార్ద్వీకసతతగ్రాసతుందిలైః
సుందరేందిందిరైః రమ్యా చక్రవాకోపశోభితా॥ 30

సారంగైర్భృంగలాకారైః సారంగైశ్చ సమాకులా
మందిరైశ్చారుభిర్వ్యాప్తా శిట్టిభైశ్చాప్యనేకశః॥ 31

మకరైః కచ్ఛపైర్దీప్తైః పృథుదేహైః సమస్తతః
పాపభీతికరైరన్యైః జలజాతైశ్చ సేవితా॥ 32

తస్యాస్తీరేఽపి పూర్వస్మిన్ ప్రకామసుమనోహరే
విద్యతే నరసింహస్య దివ్యం ధామ మహాత్మనః॥ 33

మాణిక్యరత్నసంయుక్తైః మండపైః సుమనోహరైః
నానామణిసమాకీర్ణైః దివ్యైః కాంచనతోరణైః॥ 34

ప్రాసాదైః రత్నఖచితైః కార్తస్వరవిభూషితైః
స్వర్ణప్రాకారసంవీతం గోపురైః సుమనోహరైః॥ 35

రవిచంద్రాదిభిర్గుప్తైః గోపురైస్తైరలంకృతమ్
భక్తాలయైశ్చ పరితః శోభితం దేవమందిరైః॥ 36

మధ్యే స్తంభసహస్రేణ భాస్వరంరత్నదీపితమ్
ఇంద్రనీలసమాసక్తం వజ్రవైడూర్యరంజితమ్॥ 37

ముక్తామరకతచ్ఛన్నే కురువింద సమంచితే
గారుత్మద్రత్నప్రతిమాసంఘసంవీతభిత్తికే॥ 38

నిర్భరప్రసరద్రత్నగర్భాగారే మనోహరే
నృసింహో భగవానాస్తే హరిర్దైత్యభయంకరః॥ 39

ద్వ్యచతుర్బాహుర్దివ్యశ్రీభాస్వరః సర్వకామదః
యస్య దైత్యాంఘ్రిశిరసోః గ్రహణే ప్రసృతౌ కరౌ॥ 40

తద్వక్షోభేదకృత్యేషు వ్యాపృతౌ చాపరౌ పునః
ఖేటఖడ్గధరౌ శంఖచక్రహస్తౌ దృఢౌ భుజౌ॥ 41

ఆనది మహమత్తములగు భృంగములతోడను గుమికూడి సంచరించెడి సారంగములతోడను టిట్టిభపక్షులచేతను క్రీడామందిరములచేతను స్థూలశరీరములచేతను అమరియుండును. (32)

ఆనదియొక్క తూర్పుదిక్కున సర్వేశ్వరుడగు నరసింహదేవుని దివ్యాలయ మున్నది. భగవానుని దివ్యాలయము నవరత్నఖచితములును మనోహరములు నగుమండపములచే ఆవరింపబడినది. అందలి ద్వారములు గోపురములుబంగారువికారము లైనవి. గోపురములు సూర్య చంద్ర మండలములను తాకునంత ఎత్తైనవి. ఆలయమును చుట్టి భగవానునిపరిషత్పరివారముల మందిరములు కలవు. (33-36)

ఈవిధమగు దివ్యాలయప్రదేశమున మధ్యభాగమందు సహస్ర స్తంభములు కలిగి రత్నకాంతిచే ప్రకాశించునట్టియు బంగారువర్ణముగల రత్నప్రతిమలచే యలంకరింపబడిన భిత్తిభాగములు కలట్టియు రత్నములచేతనే నిర్మింపబడినట్టియు మనోహరమైనట్టియు గర్భగృహమందు దైత్యభయంకరుడగు శ్రీనృసింహదేవుడు సాన్నిధ్యము చెందియున్నాడు.

భగవానుడు సహస్రకోటి సూర్యుల ప్రకాశము కలిగి సర్వకామ ప్రదుడై యష్టభుజములతో నొప్పుచున్నవాడు. దైత్యేంద్రుడగు హిరణ్యకశిపుని పాదములను శిరమును పట్టినట్టివి రెండుకరములు. ఆతనివక్షఃస్థలమును భేదించుట కుద్యుక్తములగునట్టివి రెండు కరములు తక్కిననాల్గుహస్తములు క్రమముగ ఖేటకముఖడ్గము శంఖము చక్రము నను నాలుగాయుధములను ధరించి యుండును. మాణిక్యఖచితమగు కిరీట మాయనశిరము నలంకరించును. కంఠమున వెలలేని హారములు కౌస్తుభమణియు భుజములందు కేయూరకటకకంకణములు కటిభాగమున కటిబంధనము చెవులకు సూర్యకోటిప్రతీకాశములగు కుండలములు కలిగి

ఏవమష్టభుజో దేవో మాణిక్యమకుటాంచితః
కేయూరహారకటకరత్నకంకణరంజితః ॥ 42

నానామణి సమూహాత్తకటిచక్రవిరాజితః
స్రగ్వీ పీతాంబరధరః కౌస్తుభోద్భాసితోదరః ॥ 43

ఉద్యద్భానుసహస్రాభః కుండలాభ్యామలంకృతః
నిమ్ననాభిర్విశాలోరాః స్ఫురత్పంకజలోచనః ॥ 44

వజ్రదంష్ట్రిః శరశ్చంద్రచంద్రికాధవలస్మితః
గాంభీర్యాదార్యచాతుర్యశాలీనిర్మలవిగ్రహః ॥ 45

గోకర్ణకర్ణః పరమః స్వర్ణమాలీ పరాత్పరః
శుద్ధసత్వమయః శ్రీమాన్ శ్రీభూమిభ్యాం సమావృతః ॥ 46

పద్మాసనస్థో నిత్యశ్రీరజేయః పురుషోత్తమః
వైకుంఠవాసీ శ్రీకంఠసేవితః పాపనాశనః ॥ 47

స్థిరస్సర్వసమః శాన్తః శాన్తేతరగుణాన్వితః
ప్రహ్లాదోపస్థితః సాధురదనాత్మా విచక్షణః ॥ 48

పద్మాక్షమాలీ స్థూలాక్షః శిక్షితాక్షః కపాలధృత్
సటాఘటాధరః పుణ్యకీర్తిరార్తివిఘాతకః ॥ 49

భయధ్వంసీ మహాభోగీ త్రిశూలీ ఘోరదర్శనః
షడ్గుణాశ్రయవాన్ కాలో మృత్యుమృత్యుర్గదాధరః ॥ 50

భీషణః సాహసంసేవ్యో వీరో విష్ణుస్త్రిలోచనః
సదాజ్వలన్మహామాయీ మాయాదూరః సమో వశీ ॥ 51

వైనతేయేన శేషేణ సేనాధీశేన సేవితః
కుముదాదిగణాధ్యక్షైః చండాద్యైః ద్వారపాలకైః ॥ 52

నిత్యముక్తైః సదా సేవ్యః సనకాదిభిరాగమైః
బ్రహ్మాదిదేవతైరన్యైః సప్తర్షిప్రవరైర్మునే ॥ 53

పీతాంబరమును ధరించిన యాదివ్యమంగళవిగ్రహము పుష్పదామములచే నిబిడముగ నలంకరింపబడి యుండును. విశాలమగు నాభీకుహరమును పద్మపత్రములబోలిన లోచనములును పద్రసారములగు కోరపండ్లును కలిగి శరచ్చంద్రచంద్రికవలె ప్రసన్నమగు చిరునగవుతో భగవానుని కుచితమగు ఔదార్యగాంభీర్యచాతుర్యశౌర్యలావణ్యము లాదిగాగల యాత్మగుణసంపత్తిచే ఆదివ్యమంగలవిగ్రహ మాకర్షణీయమైనది. శుద్ధసత్త్వమయమైన యా యర్చాబింబము శ్రీభూమిదేవులతో నమరి యున్నది. (40-46)

పద్మాసనమందుండి నిత్యశ్రీసంపన్నుడై యజేయుడైన వైకుంఠ వాసియగు పురుషోత్తముడీతడే. సర్వసముడును శాంతినిధానమునైనను రౌద్రగుణముతో సాక్షాత్కరించువాడు ప్రహ్లాదునిచే ప్రార్థింపబడి ప్రసన్నుడై యుండును. పద్మాక్షమాలాధారియు స్థూలాక్షుండును శిక్షితాక్షుండును కపాలధారియు సటాఛటాధరుండునై త్రిశూలము ధరించి ఘోరదర్శనుడయ్యును భక్తులయార్తిని శమింపజేసి భయహరుడై శాశ్వతపుణ్యకీర్తిని వెలసినట్టిది నృసింహుని యవతారము. ఆతడు జ్ఞాన శక్తి బలైశ్వర్యవీర్యతేజంబులను షడ్గుణంబుల కేకాశ్రయుడు. కాలము నకు కాలము మృత్యువునకు మృత్యువునైనవాడు. భీషణాకారుడయ్యు భక్తులకు సుఖసేవ్యుడు. ఈతడు త్రినేత్రములు కలిగిన మహావీరుడగు శ్రీమహావిష్ణువు సంతతప్రకాశము కలవాడు. సకలలోకవశంకరియగు వైష్ణవమాయ ఈతని నశవర్తిని. శేషశేషాశమలు విష్వక్సేనుడు కుముదాదిపరివారములు ఈదేవుని పరిచర్యచేయుచుందురు. (47—52)

నిత్యులు ముక్తులు సనకాదిమహనీయులు మూర్తివంతములగు వేదములు నానాలోకనివాసులగు బ్రహ్మాద్యాధికారికపురుషులు సప్తర్షులు నృసింహదేవుని నారాధింతురు. (53)

నృసింహో రమతేయత్ర పురే ఖాదిరనామకే
నగరేణ సమం యేన నగరం న మహీతలే॥ 54

యస్మింశ్చ భూసురశ్రేష్ఠాః చతుర్వేదపరాయణాః
న్యాయశాస్త్రప్రవీణాశ్చ శబ్దశాస్త్రవిశారదాః॥ 55

మీమాంసాపారగాః సర్వధర్మశాస్త్రేషు నిష్ఠితాః
స్వకర్మనిరతాః సర్వే సాహితీరసవేదినః॥ 56

బుద్ధ్యా బృహస్పతేస్తుల్యా గాంభీర్యే సాగరోపమాః
సత్యవన్తః పురాణజ్ఞాః సమాః సంగీతశాలినః॥ 57

సదా విష్ణుకథాలోలాః పరస్త్రీవిముఖాః ప్రియాః
వేదాన్తజ్ఞాన సంపన్నాః సంపన్నాః సర్వసంపదా॥ 58

ఆన్వీక్షక్యాదివృత్తజ్ఞాః పంచాయతనవేదినః
ఏకమాత్రద్విమాత్రాదిగూఢవృత్తివిభేదినః॥ 59

విచిత్రచిత్రసాహిత్యభావార్థార్థప్రదాయినః
జ్యోతిఃసిద్ధాన్తమర్మజ్ఞాః సంజ్ఞావిద్యాసు శిక్షితాః॥ 60

యజ్ఞదానతపోహోమైః విష్ణుప్రియకరా మునే
యత్ర భాగవతశ్రేష్ఠా దివ్యగాథానురంజితాః॥ 61

రాజానో యత్ర ధర్మజ్ఞా ధనుర్వేదపరాయణాః
శూరాశ్చ కృతవిద్యాశ్చ వేదార్థమతయస్తథా॥ 62

సదానుకూలాః సౌమ్యాశ్చ భగవద్భక్తిసంయుతాః
సత్యవన్తః శుభాచారాః దర్పకప్రతిమాంగకాః॥ 63

గురునిష్ఠాః పురాణార్థమోదినః శత్రుఘాతినః
నీతిజ్ఞాశ్చ రణజ్ఞాశ్చ భూతభావ్యర్థవేదినః॥ 64

గజశిక్షాకుశలినో హ్యాశ్వశిక్షానుగాః పరే
వాస్తుకర్మప్రవీణాశ్చ రథచర్యాసు నిశ్చలాః॥ 65

ఇట్టి నరసింహదేవుడు నిత్యనివాసముచేయ నవధరించిన ఖాదిరీ నగరమునకు మించినట్టిగాని తుల్యమైనట్టిగాని నగరము త్రిలోకముల నెచ్చటను లేదు. ఈనగరమందలివిప్రశ్రేష్ఠులు చతుర్వేదములను వేదాంగములను ఇతిహాసపురాణములను ధర్మశాస్త్రములను అధ్యయనము చేసి స్వకర్మనిరతులై యుందురు. బుద్ధియందు బృహస్పతివలెను గాంభీర్యమందు మహార్ణవమువలెను ప్రకాశింతురు. ఆచారసంపన్నులై భగవత్కథలనే నిరంతరముగ చెప్పుకొనుచు పాడుచు ఆడుచు కాలక్షేపము చేతురు. పరస్త్రీలను కన్నెత్తియైన చూడరు. సామాన్యశాస్త్రజ్ఞానముచే కలుషితముకాక వారిహృదయము వేదాన్తజ్ఞానమందులగ్నమై యాజ్ఞానము అపవర్గపర్యవసాయియై ఫలించినది. ఇట్లాధ్యాత్మికచింతనము కలిగినను వారల యైహికవిషయానుభవము సైతము పరాకాష్ఠ నంది యున్నది. అరువదినాలుగు కళలయందును వారికి గల నైపుణ్యము సాటిలేనిది. (54-62)

దీనితోపాటు తాము అభ్యసించిన శాస్త్రములను అనుష్ఠానపర్యంతము తెచ్చి నిత్యనైమిత్తికములగు యజ్ఞదానతపంబుల నుత్తమరీతిని భగవన్ముఖోల్లాసముగ నాచరించుచుందురు. భాగవతమతము నవలంబించెడి తెగవారలు భాషాప్రబంధములను చక్కగ పఠించి వానిని వ్యాఖ్యానము సేయుచు ప్రొద్దుపుచ్చుచుందురు. 61

ఆనగరమందలి క్షత్రియులు ధనుర్వేదమునందు పారంగతులై ధర్మమార్గముననే సంచరించుచుందురు. శూరులును కృతవిద్యులునై వేదార్థములను గురుముఖముగ నెరింగి ప్రజలను పక్షపాతములేక పాలించుచు దయామయులును అనుకూలురును సదాచారసంపన్నులును దేవద్విజగురుశుశ్రూషాతత్పరులును పురాణజ్ఞులును నీతిశాస్త్రజ్ఞులును భూతభవిష్యత్తుల నెఱుంగగలవారును అశ్వశిక్షయందును గజశిక్షయందును

సమరారచనోదగ్రాః పృథుపీనభుజాః పరే
ఏవంవిద్యాసమారబ్ధాః శాస్త్రేషు రుచిశాలినః
వైశ్యాః కృషీవలాః కేచిద్ధనధాన్యవివర్ధితాః
వాణిజ్యధర్మనిరతాః సర్వే ధర్మావిరోధినః ॥
శూద్రాః కేచిద్భూసురేన్ద్రపరిచర్యాపరాయణాః
కేచిద్భాగవతానాం వై భక్తాః తచ్చిహ్నధారిణః ॥
స్వకర్మనిరతాః సర్వే ప్రతిలోమానులోమజాః
ధనధాన్యసమాయుక్తా రాజసేవాసమాశ్రితాః ॥
యత్ర వారాంగనా రమ్యారక్తాంబుజసమాంఘ్రయః
కాహలీసదృశాజంఘాః కదలీసదృశోరవః ॥
గంభీరనాభిసంయుక్తా నితంబాయతనందితాః
తనురోమావలీరమ్యా నితాంతకృశమధ్యమాః ॥
ఉత్తుంగవృత్తకఠినస్తనమండలరాజితాః
సుకుమారకరాంభోజాః కంబుకంఠ్యః శుచిస్మితాః ॥
పల్లవాధరశోభాఢ్యాః కుందోద్యద్దన్తపంక్తయః
ఉత్పలాక్ష్యః సువదనాః సుకేశిన్యోఽమలద్విషః ॥
నూపురైః పాదకటకైః వేల్లత్పాదసరోరుహాః
మల్లికామాలతీకుందవిలత్కేశసంధయః ॥
కస్తూరీఘనసారాదిపాటీరాంచితవక్షసః
పద్మతాటంకవిలసచ్ఛ్రీవర్ణశ్రోత్రకాంచితాః ॥
ముక్తాఫలసమాబద్ధమేఖలాభిరలంకృతాః
దివ్యమాల్యాంబరధరా నాట్యవిద్యాసు సమ్మతాః ॥ (సమావృతాః)
తౌర్యత్రికేణ నృత్తేన సేవన్తే నృహరిం మునే
యస్య ప్రాన్తేషు రాజన్తే కదలీవనరాజయః ॥

కుశలురును వాస్తుకర్మప్రవీణులును రథచర్యయందు నైపుణ్యము గల వారు యుద్ధమందు జయము నాకాంక్షించెడివారలు నై యుందురు. మహాపురుషలక్షణపరిష్కృతములగు సకలలక్షణములతో కూడిన సకలావయవసన్నివేశము కలిగి మన్మథుని మరపించెడి విగ్రహసౌందర్యము కలిగియుందురు. (62-66)

ఆనగరమందలి వైశ్యప్రవరులును కృషిగోరక్షవాణిజ్యములందు సిద్ధహస్తులై ధనముతోడను ధాన్యసంపదతోను తులతూగుచుండియు స్వవృత్తియగు వ్యాపారమునందు ధర్మమునకు విరోధము రాకుండ ప్రవర్తించుచు ధర్మపరులైయుందురు. 67

అచ్చటి శూద్రులును ద్విజపరిచర్యయందును భాగవతశుశ్రూష యందును తత్పరులై ఆయాసంప్రదాయము ననుసరించి శైవచిహ్నములగు భస్మరుద్రాక్షములను వైష్ణవచిహ్నములగు శంఖచక్రలాంఛనములను ధరించి కర్మనిరతులై యుందురు. తక్కుంగల వర్ణములవారును స్వకర్మనిరతులై రాజసేవయందుండి ధనధాన్యసంపదలతో కూడి యుందురు.

అచ్చటి వారాంగనలు లోకోత్తరలావణ్యశాలినులై దేవలోకసుందరులగు నప్సరసలను స్పర్ధించెడి చక్కదనము కలిగి శ్రీనృసింహదేవుని యాస్థానములందు భగవానుని కల్యాణగుణములను పాడుచు నర్తనముసేయుటకు వలయు దివ్యమోహనములగు సాముద్రికశాస్త్ర ప్రసిద్ధములగు లక్షణముల నన్నిటిని పరిపూర్ణముగ కలిగి యుందురు. భగవానుని దివ్యచేష్టితములను తనివిదీర యనుభవింపచేయగల్గుటకు వలయు హావభావముల నభినయించుటకు వలయు దేహసంపత్తియు గాననైపుణ్యమును ఈవేశ్యలయందు మూర్తీభవించి ఈమోహనదేవతలచే ప్రాకృతజనులును అయత్నముగ భగవత్సన్నిధానమున కాకర్షింపబడుచుందురు. భగవత్సన్నిధానమున నిత్యకైంకర్యములందు నిరత

నానామృగగణోపేతం గవ్యాద్యైః బహుభిర్వృతమ్
తదేతన్నగరం దివ్యం విచిత్రగృహశోభితమ్ ॥ 78

ప్రాసాదైర్బహుభిర్జుష్టం చిత్రశాలామనోహరమ్
ఋజువిస్తృతదీర్ఘాభిః వీథిభిః సమలంకృతమ్॥ 79

గగనాస్పర్శనోదగ్రనాళికేరవనాని చ
హల్లకోత్పలగంధాఢ్యాః హంససారససేవినః ॥ 80

మల్లికాద్యైః ధార్తరాష్ట్రైః కిన్నరైశ్చ కపింజలైః
కృతకేళీసమాలాపలాలితా లోకశాలినః ॥ 81

సహస్రపత్రసౌగంధ్యగ్రథనామోదషట్పదాః
శతపత్రసమూహాఢ్యాః స్ఫటికా ఇవ నిర్మలాః ॥ 82

హల్లకోత్పలగంధాఢ్యాః కాసారాశ్చ సహస్రశః
యత్ర సోపానసంయుక్తాః రత్నవేదివిరాజితాః ॥ 83

దీర్ఘికా ఘర్మదాః శర్మప్రదాః సరసశీతలాః
ఘర్మాంబుజలదావిద్ధచిపిటార్భకమండితాః ॥ 84

నీలోత్పలలసత్సర్వసంధయః సింధుశీకరాః
సుసాధవ ఇవానందరసాపూరితనిర్మలాః ॥ 85

యమాదియోగినాం సత్యజ్ఞానానందనివాసినామ్
వేదవాదవతాంనిత్యతేజోరుచిరశాలినామ్ ॥ 86

ఆశ్రమా బహవః సన్తి ఋషీణాం పరితస్తతః
శిక్షితాక్షవతాం శ్రీమత్సౌభాగ్యైశ్వర్యభావినామ్ ॥ 87

విచిత్రశైలసంఘాతైః రమ్యైరోగణసేవితైః
చూతపున్నాగసురభివకుళార్జుననీపకైః ॥ 88

బహుపుష్పగణోపేతైః విహంగైః శిఖరైః ద్రుమైః
వికసత్పుష్పశబరైః రత్నధాతువిచిత్రితైః ॥ 89

లగుటచే వారలకు మితిలేని భూషణసంపదయు సాటిలేని దేహసౌష్ఠవ మును కలిగి యుండును. వారలు ఆయాకాలములందు వాద్యవిశేషము లతో మేళవించి గానము నృత్యములతో శ్రీనరసింహుని సేవించు చుందురు. (70-76)

ఆయాలయసమీపప్రదేశములందు అరటితోటలు కలవు. 77

ఆపట్టణమందు చిత్రచిత్రములగు చిన్నకట్టడములు, పెద్ద మేడలు రాజసౌధములు పెక్కులుకలవు. క్రీడాగృహములయం దనేక మృగములు పక్షులు పెంచబడుచుండును. విశాలములై నిడివిగల వీధు లచే యాపట్టణము శోభాయన మగుచుండును. ఆకాశమునంటిన కొబ్బరి తోటలు నగరము నావరించి యుండును. హంసములాదిగాగల జలచర విహంగమముల సంచారముకలిగిన పుష్కరిణు లచ్చట కలవు. పక్షి సంఘముల మధురనినాదములచే పరిసరవాసులు శ్రవణసుఖము ననుభ వింతురు. ఆకొలకులందలి సహస్రదలపద్మముల తావి నాఘ్రాణించి మధువును గ్రోలిన తుమ్మెదల ఝుంకారము శ్రావ్యమై యుండును. శతపత్రములసమృద్ధిచే ఆకొలకులందలి జలములు తెల్లగ ప్రకాశించును. ఆపుష్కరిణులను చుట్టి రత్నములచే నిర్మింపబడిన సోపానములు వేదికలు వెలయుచుండును. సరసశీతలములగు నుదకములు గల బావులందలి నిర్మలోదకములు ఘర్మకాలములందు శైత్యమును శీత కాలములందు ఔష్ణ్యమును యిచ్చునవై యుండును. అందు నీలోత్పల ములు ఉదకరసమును యథోచితముగ పరిష్కరించి యానందరసాస్వాద పరులగు సాధుజనహృదయములవలె నిర్మలము జేయుచున్నవి. (78-85)

ఆ నగరమునకు నలుదెసలను మహర్షుల యాశ్రమములు చాల కలవు. వేదార్థచింతనము సేయుచు తేజోభాస్వరులై యమనియమాదు లచే వాయుజయము చేసి ఇంద్రియగ్రామమును స్వవశము జేసికొని స్వకర్మనిరతులై భగవదారాధనము చేయుచు భగవద్దర్శనానందపార వశ్యమున కాలక్షేపము చేయు మహానుభావులాయాశ్రమములందు వసి యింతురు. (86-87)

వైఢూర్య సానుభీ రమ్యైః నానామృగగణైర్వరైః
ఏవం విధైః సమాసక్తం గగనం కుశలప్రదమ్ ॥ 90

మాహాత్మ్యం వర్ణ్యతే కేన పులస్త్యేనోదితం మునే
పురాకృతయుగే బ్రహ్మసభాయాం మునిపుంగవ ॥ 91

సనకేనోపదిష్టం యత్తదప్య కథితం మయా
యతో నృసింహ స్తత్రాస్తే భుక్తిముక్తిఫలప్రదః ॥ 92

ఖాదిరాన్నగరాత్తస్మాత్పరితో యోజనద్వయమ్
అపవర్గ ప్రదం నృణాం దివ్యజ్ఞానకరం మునే ॥ 93

యస్మిన్ క్షేత్రే సముత్పన్నాః తిర్యంచః స్థావరాస్తథా
ముచ్యన్తే నాత్ర సందేహః మనోవాగ్జాతకిల్బిషాత్ ॥ 94

కిమత్ర బహునోక్తేన తస్యక్షేత్రస్య వర్ణనమ్
ఇతిసురమునిరుచ్చకైర్మనోజ్ఞం
శ్రుతిమధురం వచనం సచోప(శివేన?) దిష్టమ్
హృషితతనురుహో నిశమ్య భూయః ॥ 95

సుఖితమనాః ప్రబభూవ నిర్మలాత్మా
నరహరిచరితం నిశమ్యసమ్యక్
తదపి సుధామధురం సతస్యహృద్యమ్
కథమపి వసతేర్నిమిత్తమారాత్
రఘుపదభక్తిమవేక్ష్య చాన్వయుక్త ॥ 96

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఖాద్రీమాహాత్మ్యే

ప్రథమోఽధ్యాయః

అచ్చటి పర్వతసానుప్రదేశములందు బహువిధములగు సుగంధి పుష్పముల నుత్పత్తిచేసెడి మహావృక్షములును ఆశ్చర్యమును కలుగ చేయు మృగపశుపక్షిసంఘములును కలవు. ఆప్రదేశములందు దేవయోని విశేషములగు యక్షవిద్యాధరాదులును అప్సరస్సులును విహరింతురు.

ఆప్రదేశముయొక్క మహిమను వర్ణింప నెవరికి శక్యము? ఈరహస్యము పూర్వ మొకప్పుడు చతుర్ముఖుని సభయందు పులస్త్యునిచే పృచ్ఛింపబడిన సనకుడు చెప్పినరీతిని నేను నీకు తెలియజేయ గల్గితిని. ఇట్టి ప్రభావమునకు కారణము ఆప్రదేశమునందు భుక్తిముక్తులను ప్రసాదించెడి నరసింహదేవుని సాన్నిధ్యము తప్ప వేరేమి యుండును? ఈ ఖాదిరనగరమును చుట్టి రెండుయోజనముల దూరము వాసముచేయు ప్రాణిజాతము స్వర్గాపవర్గముల కధికారియై యుండును. ఈప్రదేశమున పుట్టి వాసముచేయు మహాభాగ్యమును పొందినట్టి స్థావరములేమి జంగమములేమి సమస్తప్రాణులును సంసారబంధమునుండి ముక్తి చెందినవారలై పునరావృత్తిరహితమగు శ్రీవైష్ణవలోకమును సులభముగ పొందుదురు. మనోవాక్కాయకృతములగు సమస్తదోషములును సంచితాగమప్రారబ్ధములగు సకలకర్మబంధములనుండి విముక్తి చెందుదురు. ఆక్షేత్రమహిమమును ప్రశంసించుటకు పరమావధిని ఇంతకంటె అధికముగా చేయుటకు వలనుకాదు.

ఇట్లని పరమశివునిచే యుపదేశింపబడిన క్షేత్రమాహాత్మ్య ఉపోద్ఘాతమును అవధానముతో వినిననారదుడు ప్రసన్నుడై సంతసించెను. ఇట్లు సుధామధురమగుట హృద్యమగు శ్రీనృసింహదేవుని నిలయమగు ఖాదిరీక్షేత్రమహిమమును వినిన నారదుడు రామనామమహిమమును స్మరించుచు భగవదాలయవిశేషములను విన నాశపడుచుండెను. (95-96)

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారదసంవాదమందు ఖాదిరీమహాత్మ్యగ్రంథమునందలి ప్రథమాధ్యాయము.

శ్రీ నృసింహాయనమః

## ద్వితీయోऽధ్యాయః

శ్రీనారదః:-

నృసింహోऽర్చావతారేణ సంస్థితః ప్రథితః ప్రభుః
స్తోత్రాద్రిరితి నామేదం భూభృతః కేన హేతునా ॥ 1

అస్తీతి శిఖరే రమ్యే విష్ణుపాదాంకసం యుతః
మయి స్నేహాన్మహాదేవ సర్వమేతద్వదస్వ మే ॥ 2

శివః ప్రోవాచ భగవానిదం పృష్టః సురర్షిణా
దితేః పుత్రో మహాభాగ హిరణ్యకశిపుః పురా ॥ 3

బ్రహ్మదత్తవరోద్రిక్తః త్రిషులోకేషు విశ్రుతః
తస్య పుత్రో మహానాసీ ద్విష్ణుభక్తో విమత్సరః ॥ 4

ప్రహ్లాదో హృదయే నిత్యం విష్ణోర్నామ స్మరత్యరమ్
సుఖితం గృహమానీయ కదాచిద్దైత్యనాయకః ॥ 5

పప్రచ్ఛ విద్యాం బ్రూహీతి శిక్షితాం గురుసన్నిధౌ
ఇతి పృష్టోऽవదత్పుత్రో వాసుదేవాత్పరం విభో ॥ 6

నజానే తత్త్వతః కావా విద్యా యా సఫలప్రదా?
ఇతి బ్రువాణే తనయే గురుమాహూయ దైత్యరాట్ ॥ 7

చుకోప భ్రాతృహననాత్పూర్వవైరమనుస్మరన్
దురాత్మన్ శిక్షితః కిం వా మత్పుత్రస్యాతిదుర్మతే ॥ 8

పురా విష్ణుస్తవపరాన్ మత్ఖడ్గదలితాన్ పురాన్
న జానీతే భవాన్ నూనం న చేదేవం కథం భవేత్ ॥ 9

ఇతి నిర్భర్త్సితస్తేన కంపమానోऽవదద్ద్విజః
శృణుష్వ నిత్యం దైత్యేన్ద్ర తవ పుత్రస్య నిశ్చయమ్ ॥ 10

శ్రీనృసింహాయ నమః

## రెండవ అధ్యాయము

నారదుడు ప్రశ్నించుచున్నాడు

ఓపరమశివమూర్తీ! శ్రీనృసింహదేవుని యావాసమగు నీక్షేత్రమునకు స్తోత్రాద్రియనుపేరేల కల్గినది? ఈపర్వతశిఖరమందు శ్రీమహావిష్ణునిపాదచిహ్నమేలకల్గినది? ఈవ్యవహారములందు గల హేతువులను దయతో నాకు వివరించి యుపదేశింపవేయని నారదుడు పృచ్ఛింపగా పరమశివుడిట్లని చెప్ప నారంభించెను. (1-2)

ఓనారదా! సావధానమనస్కుడవై యాకర్ణింపుము. పూర్వకాలమందు కాశ్యపప్రజాపతికి దితియందు దుద్భవించిన హిరణ్యకశిపు డను దానవుడు బ్రహ్మచేవరముల నంది త్రిలోకములందు ప్రసిద్ధుడై స్వచ్ఛంద విహారము సేయుచుండెను. ఆతనికి దైవయోగమున విష్ణుభక్తిసంపన్నుడగు ప్రహ్లాదు డనుపుత్రుడు జన్మించెను. (3-4)

ఒకానొకప్పుడు హిరణ్యకశిపుడు పుత్రునివిద్యను పరీక్షింప గోరి ప్రహ్లాదు నడుగగా నాతడు వైష్ణవపారమ్యమును ప్రశంసించుచు సకలవిద్యలకు సారము విష్ణుని పరదైవతముగా తెలియుటయే యని చెప్పెను. హిరణ్యుడు గురువగుచండామర్కుల బిలచి తనకుమారునికి వైష్ణవభక్తి కల్గుటకు గతము గురువుల ప్రమత్తతచే యేర్పడిన దని యనుకొని వారలను బహుప్రకారముల దూరెను. తనసోదరుడగు హిరణ్యాక్షుని బలాత్కారముగ సంహరించినట్టి విష్ణునియందు తన కేర్పడిన వైరమును ఆతడు స్మరించి యావిష్ణునియందు తనకుమారునికి గల్గినభక్తి తనవంశమునకే హాని దెచ్చునని భయముతో గురువులను బెదరించగా వారలు ఖిన్నులై యిట్లనిరి. (5-9)

ఉపదిష్టేఽర్థశాస్త్రే తు మనో న కురుతే ప్రభో
హరిం స్మరతి మనసా వాచా స్తౌతి నమత్యసౌ ॥ 11

తస్మాత్త్వత్కృతిరేవైషా తనయస్య తవ ప్రభో
న నివారయితుం శక్తస్త్వయాపి సురకంటక ॥ 12

మమైవ దోషో నాస్త్యత్ర స్వభావః నైవ వార్యతే
ఇత్యుక్తో దైత్యనాథోఽసౌ విససర్జ ద్విజాధిపమ్ ॥ 13

ఉపదిష్టః సమీపస్థం పుత్రం విష్ణుపరాయణమ్
దృష్ట్వా క్రోధసమావిష్టో దైత్యేంద్రస్తం చ దుర్మనాః ॥ 14

హన్తుకామో మహాబాహుః ప్రేషయామాస పన్నగాన్
కాలకూటవిషోద్రిక్తాన్ కరాలవదనాన్ ఖరాన్ ॥ 15

ఆదిష్టాః పన్నగాస్తేన దదంశుస్తం కుమారకమ్
నబాధన్తే హరేర్భక్తం భుజంగాస్తీక్ష్ణదంష్ట్రిణః ॥ 16

దిగ్గజైర్వహ్నినా జ్వాలా జటిలేన మహీయసా
విషదానేన తుంగాద్రైః ప్రాసాదాత్పతనాదధః ॥ 17

అన్యైరపి వధోపాయైః రక్షితం భయవర్జితమ్
పప్రచ్ఛ తనయం క్రుద్ధః సభాయాం దైత్యనాయకః ॥ 18

దురాత్మన్ దైవతం కిం తే కస్య స్థానం వదస్వ మే
ఇత్యుక్తో దైత్యరాజేన ప్రహ్లాదోఽథ సునిర్భయః ॥ 19

విష్ణురేవ పరం దైవం విష్ణురేవ సదాగతిః
విష్ణురేవ పరం బ్రహ్మ విష్ణురేవ గతిర్మమ ॥ 20

తస్య స్థానం కిమన్వేష్యం సర్వత్ర వసతి ప్రభుః
త్వయ్యస్తి చ స విశ్వాత్మా మయ్యస్తి సకలేశ్వరః ॥ 21

సర్వత్ర వర్తతే తాత పరమాత్మా సనాతనః
బ్రహ్మరూపేణ విష్ణుః సప్రజాసర్గం కరోత్యసౌ ॥ 22

ఓరాజా! మేము నీకును నీకుటుంబమునకును హితచింతకులమే గాని విరోధచింతకులము కాము. మావిద్యాభ్యాసమును నీకుమారుడు వినుట లేదు. ఆతనికి హరిభక్తి పుట్టుకతో కల్గినది. దానిని మార్చుటకు మేమే గాక నీవును శక్తుడవు కాజాలవు అని చెప్పగా రాజు వారలను కనికరించి విడచెను. (10-13)

ఆపల పుత్రుని యంకమున జేర్చి లాలించియు ప్రయోజనము గానక హిరణ్యకశిపుడు క్రోధావిష్టుడై పుత్రుని వధించుటకు సంకల్పించి పెనుబాముల రావించి కరిపించెను. కాలకూటవిషమును వెడలగ్రక్కుచు తీక్ష్ణదంష్ట్రలచే యాసర్పములు ప్రహ్లాదుని శరీరమాపాదమస్తకము కరచెను. హరిభక్తుడగు ప్రహ్లాదునిశరీరమం దాసర్పవిషము ఎట్టి యాలోపమును కలుగజేయ జాలకపోయెను. (14-16)

ఆప్రయత్నము కార్యసాధకము కాకపోగా హిరణ్యకశిపుడు మదించిన యేనుగల రావించి వానిచే బాలుని ద్రొక్కించెను. ప్రత్యేకముగ విషమును దెప్పించి నోటబోయించి త్రావించెను. పర్వతములపై నెక్కించియు యెత్తైనప్రదేశములనుండియు క్రిందికి త్రోయించెను. ఇట్లు యెన్నియో వధోపాయంబుల నాచరించినను చావక వైష్ణవశక్తిచే సురక్షితుడై భయము లేక యానందపరవశుడై తిరిగెడి కుమారు నొకనాడు సభామధ్యమున దెప్పించి హిరణ్యకశిపుడు ఇట్లని యడిగెను. (17-18)

ఓదురాత్మా! నీవు నాకు పుత్రుడవు కావు. నేను చేసినవధోపాయములనుండి నిన్ను కాపాడిన నీదేవు డెవ్వడు? ఆతనినియునికి యెచ్చట? చెప్పవే యనిన ప్రహ్లాదుడు సంకోచము లేక బదులుచెప్పనారంభించెను. 19

సర్వాధారుడును సర్వరక్షకుడునగు శ్రీమహావిష్ణుదే నాకును రక్షకుడు. ఆతని కొక్కస్థానమనునది లేదు. ఆతడు సర్వవ్యాపి నీయందు కూడ కలడు. ఆతడు సర్వశక్తుడు. సనాతనుడు ఆతనికి పరిభవమ్ములేదు.

స్వయం విష్ణురపి శ్రీమాన్ పరిపాతి జనాన్ భువి
రుద్రరూపేణ విశ్వాత్మా సంహరత్యఖిలం జగత్ ॥ 23

నారాయణాత్పరో నాన్యద్దైవమస్తి మహీతలే
అంతర్వ్యాపీ బహిర్వ్యాపీ నిరాకారో నిరంజనః ॥ 24

సర్వసాక్షీ జగత్స్రష్టా స్థూలాత్ స్థూలతరః పుమాన్
అపాణిపాదో జవనః నిత్యశుద్ధః స్వయం ప్రభుః ॥ 25

కలికల్మషసంహర్తా దుష్టదైత్యవినాశనః
సాధుప్రియః సర్వలోకసాక్షీ వేదాన్తగోచరః ॥ 26

పద్మమాలీ నిరీహః శ్రీనాయకః పురుషోత్తమః
సంకర్షణః సదానందః సర్వాత్మా హరిరీశ్వరః ॥ 27

చరాచరాత్మా దుష్ప్రేక్ష్యః జ్ఞానినామభయప్రదః
నాస్తి కించిద్ధరేస్తాత వ్యతిరిక్తం కదాచన ॥ 28

ఇత్యేవముక్తః పుత్రం తం హిరణ్యః క్రోధమూర్ఛితః
జవాదుద్ధాయ సంప్రేక్ష్య ప్రోవాచ పరుషాక్షరమ్ ॥ 29

సూక్ష్మబుద్ధే దురాచార వైధేయ ప్రచురం వృథా
కిం వదస్యప్రసిద్ధం తం విష్ణుం వైకుంఠవాసినమ్ ॥ 30

సర్వాత్మా చేద్ధరిః శ్రీమాన్ భవతి ప్రాచ్యమేవ చ
స్తంభేऽస్మిన్ దర్శయస్వేతి ప్రావదత్కుటిలాననః ॥ 31

శృణ్వస్తి చ విశేషేణ స్తంభేऽస్మిన్ పురతః స్థితే
ఇత్యుదీరితమాకర్ణ్య ప్రహ్లాదేన మహాత్మనా ॥ 32

హిరణ్యకశిపుః క్రుద్ధః స్తంభం తం నికటే స్థితః
సముద్ధృత్యైకచరణం స్తంభం తాడయితుం కృథా ॥ 33

యదా సముద్ధితో దైత్యః తదా భూత్తత్ర ఘుఘుకారః
కల్పాన్తాశనినిస్స్వనః సాట్టహాసః స్ఫురద్రవః ॥ 34

బ్రహ్మస్వరూపియై సృష్టికార్యమును విష్ణుస్వరూపియై రక్షణకార్యమును రుద్రస్వరూపియై సంహారకార్యమును ఆతడే చేయుచున్నాడు. ఆతనినే నారాయణుడనియు చెప్పుదురు. ఆతనికంటె వేరు దైవము లేదు. ఆతడు ప్రపంచమునంతటను లోపలను బయటను నిరంతరముగ వ్యాపించియు తద్వ్యాప్తములగు పదార్థములయొక్క దోషమునంటక సాక్షిభూతుడై మాత్రమే యుండును. అణువుకంటె అణువుగను మహత్తుకంటె మహత్తుగను ఆతనిస్వరూప ముండును. కరచరణాదులు లేకనే సర్వకార్యముల నాతడు నిర్వహించును ఆతడు స్వయంప్రభువు. ఆతని నాజ్ఞాపించువారు లేరు. ఆతడు కలిదోషములను పోగొట్టి దుష్టసంహారముచేయుచు సాధువులను రక్షించును వేదాస్త్రవేద్యు డాతడే. ఆతనికి శ్రీదేవి భూదేవియను నిద్దరు భార్యలు కలరు. దివ్యభూషణ దివ్యాయుధములచే యాతని దివ్యమంగళవిగ్రహ మలంకరింపబడి యుండును. చరాచరస్వరూపియై కన్నుల కగుపడని స్వరూపము కలవాడు. ఆతడు లేని పదార్థములేదు.

ఇట్లని పుత్రునిమాటలు విని కోపించి దురహంకారముచే కర్తవ్యమును తెలియక హిరణ్యకశిపుడు పుత్రుని బెదరించి పరుషవాక్యములచే దూషించి తాను ప్రశంసించిన విష్ణుని సభాస్తంభమున చూపు మని యరచెను. (29-31)

ప్రహ్లాదుడు సంతోషమున వినయావనతుడై సర్వవ్యాపియగు పురుషోత్తముడు తానుకోరిన స్తంభమందును తప్పక సాన్నిధ్య మంది యున్నాడని బదులు పలికెను. 32

ఆమాటలువిని క్రుద్ధుడైన హిరణ్యకశిపుడు సమీపమునందుండెడి యొక స్తంభమును కాలితో తన్నుట కుద్యుక్తుడగు సమయమున నాస్తంభమునుండి యొక్క ఘర్ఘరధ్వని వినసాగెను. ఉత్తరక్షణమున నాధ్వని ప్రలయకాలమందలి పిడుగుపాటుధ్వనివలె మహాభయంకరమై వృద్ధి

తమాకర్ణ్య మునే దైత్యాః సభాయాముద్ధితాః పరమ్
ఏవం విదలితే స్తంభే తన్మధ్యాదుదభూన్మహాః ॥ 35

సహస్రసూర్యసంకాశం దుర్నిరీక్ష్యం సురైరపి
తన్మధ్యవర్తీ నృహరిస్తూర్ణమాగత్య భీషణః ॥ 36

గృహీత్వా దైత్యరాజానం గరుత్మానివ పన్నగమ్
శాయయిత్వా స్వకీయాంకే విదదార భుజాన్తరమ్ ॥ 37

కరైర్వజ్రనఖైర్భీమైః నఖైశ్చన్ద్రిభాసురైః
నిష్కృష్య తస్య వక్షస్త ఆన్త్రిమాలాం విభీషణః ॥ (ణామ్) 38

నిదధానః పరం కంఠే వైకుంఠాధిపతిః కృధా
అట్టహాసం కరోతిస్మ హత్వా దైత్యం దురాసదమ్ ॥ 39

తదీయానాగతాన్ దృష్ట్వా యోద్ధుకామాన్ మహాబలాన్
నృహరిః క్రోధతామ్రాక్షో రాక్షసాన్ కుటిలాశయాన్ ॥ 40

కాలనాభ మహానాభస్థూలాక్ష స్థూలపాదకాన్
దంభారిష్ట ప్రమాథ్యాదిటంకాన్ సాలకటంకటాన్ ॥ 41

పృథుమాలి మహామాలి సర్వాస్య రుధిరాశనాన్
ప్రజంఘ జంఘ ప్రభృతీన్ ఘోరాకారాన్ భయంకరాన్ ॥ 42

ఏతాన్ హన్తుం నరహరిర్యదా కృతమతిస్తదా
పలాయనపరాన్ పశ్యన్ పర్వతం సానుభూషితమ్ ॥ 43

తానేవానరన్ శ్రీమాన్ నృహరిర్దైత్యవల్లభాన్
హత్వా తస్థౌ మహావీరో నృసింహో దైత్యనాశనః ॥ 44

తతోదేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః
బ్రహ్మాణమగ్రతః కృత్వా గగనస్థాః స్తువన్ (తిం) హరిమ్ ॥ 45

దేవదేవం జగన్నాథం స్తోత్రైమత్రైః తథావిధే
చక్రుర్నరహరిం దీప్యజ్జ్వలదగ్ని సమప్రభమ్ ॥ 46

చెందగా సభయందలి మనుష్యు లందరును తమయాసనములనుండి లేచి నిలచి ఆయుత్పాతమును ఆశ్చర్యముతో చూచుచుండిరి. అంతలో నా స్తంభము బ్రద్దలై యా స్తంభమధ్యమందుండి సహస్రకోటిసూర్యప్రకాశమును దుర్నిరీక్ష్యము నగు నొక్క దివ్యతేజ ముద్భవించెను. ఆ తేజస్సుమధ్యము నుండి శ్రీనృసింహభగవాను డావిర్భవించి యెదుట నిలచియున్న భక్తద్రోహుండగు హిరణ్యకశిపుని బట్టి తనతొడలయందుంచికొని వజ్రతీక్ష్ణములగు గోళ్ళతో నాతనివక్షఃప్రదేశమును చీల్చి యందలిప్రేవులను దీసి వానిని తనకంఠమందు హారములవలె ధరించినవాడై భయంకరముగ గర్జించెను. (33-39)

అంతలో యుద్ధార్థులై మూగిన హిరణ్యుని సేన నెదుర్కొని కాలనాభుడు మహానాభుడు స్థూలాక్షుడు స్థూలపాదుడు దంభుడు అరిష్టుడు ప్రమాథుడు టంకుడు సాలకటంకటుడు వృషమాలి మహామాలి సర్వాస్యుడు రుధిరాశనుడు ప్రజంఘుడు జంఘుడు మొదలుగాగల భయంకరులగు రాక్షసులను చూడగా వార లందరును నరసింహదేవుని ప్రతాపమును జూచిభీతులై పర్వతసానువులకు బరువులిడుచుండ వారల నెన్నంటి యందరను సంహరించెను. (40-44)

అంత నాకాశమందు దేవగంధర్వాదులు మహర్షులు బ్రహ్మను పురస్కరించుకొని భగవానుని నిట్లు స్తోత్రముసేయ మొదలిడిరి. 45

ఓదేవదేవా జగన్నాథా! నీకు జోహారులు నీవు సర్వభావనుడవు పురాణపురుషుడవు. లక్ష్మీసహాయుడవు. షాడ్గుణ్యపరిపూర్ణుడవు భూతభావనుడవు. సహస్రశిరంబులు సహస్రపాదములు సహస్రనేత్రములు సహస్రబాహువులు కలిగిన విశ్వరూపియగు విరాట్పురుషుడవు. నీవు త్రింశత్కోటి దేవసంఘాతమున కేకైకనియంతవు. అజ్ఞానతిమిరాంధము నీకు దూరమున నుండును. నీవు పరాత్పరుడవు నీవు ప్రణవావయవమగు

ఆదిదేవ జగన్నాథ నమస్తే సర్వభావన
పురాణపురుష శ్రీమన్ భగవన్ భూతభావన ॥ 47

సహస్రశీర్షాపురుష సహస్రాక్ష సహస్రపాత్
సహస్రబాహో దేవేశ మాయాభూత పరాత్పర ॥ 48

ఏకాక్షరస్వరూపస్త్వం నాస్త్యస్తీతి పదం విభో
యజ్ఞస్త్వం సామవేదస్త్వం ఋగ్వేదస్త్వం యజుర్మయః॥ 49

శిక్షావ్యాకరణం ఛందో జ్యోతిస్త్వం వాదసన్తతిః
ధర్మస్త్వం లోభవృత్తిస్త్వం ? సత్యం త్వమసి కేశవ ॥ 50

బుద్ధిస్త్వం సర్వశః శాన్తిః వషట్కారః ప్రజాపతిః
ఆపస్త్వం వాక్శుచిః ప్రాణవాయుస్త్వం జగతీపతే ॥ 51

ఇంద్రోగ్నిస్త్వం యమస్సూర్యః వరుణస్త్వం ధనాధిపః
కపాలీ త్వం మహాబాహో నారదో వామలోచనః ॥ 52

త్వత్తః పరతరం నాన్యత్కించిదస్తి మహాభుజ
మాహాత్మ్యం తే న జానీమో సోష్ట బాహో త్రిలోచన ॥ 53

యస్మాత్ స్తోత్రం ప్రకుర్వన్తి స్తోత్రాద్రిర్యత్ర వైతి చ ?
తదాప్రభృతి తన్నామ్నా ఖ్యాతిమేష్యతి భూతలే ॥ 54

తదా పారిషదాస్సర్వే కుముదాద్యాస్త్వరాన్వితాః
అనన్తవైనతేయాద్యాః విష్వక్సేన పురస్సరాః ॥ 55

పురస్కృత్య మహాలక్ష్మీం ప్రహ్లాదం చ హరేః ప్రియమ్
సత్యవంతం మహాభాగం ప్రాప్తా నరహరేః పదమ్ ॥ 56

తతో బ్రహ్మాదయో దేవాః ప్రణేముః పురుషోత్తమమ్
నృసింహం భీషణః ప్రోచుః సర్వే ప్రాంజలయః సురాః 57

రూపమేతద్ధరేzద్య త్వయా దుర్నిరీక్ష్యం భయప్రదమ్
సునిరీక్ష్యం తథా కార్యముపసంహర శాన్తిద ॥ 58

నకారముయొక్క స్వరూపమవు అస్తి నాస్తి శబ్దముల కవిరోధముగ నీవు వాచ్యుడవై యుండెదవు. నీవు హవిస్స్వరూపుడవు యజ్ఞస్వరూపుడవు నీవుఋగ్యజుఃసామాధర్వవేదస్వరూపుడవు. తత్ప్రతిపాద్యుడవు గూడ నీవే. వేదషడంగములు నీవే. ధర్మము లోభము సత్యము బుద్ధియు నీవే. నీవు సర్వగతుడవు శాన్తియు వషట్కారము నీవే. నీవేప్రజాపతివి. ఇంద్రుడు అగ్ని యముడు సూర్యుడు వరుణుడు కుబేరుడు ఈశానుడు వాయువు నారదుడు మొదలగువార లందరు నీవే. నీకంటె వేరగు పరాశక్తి వేరు లేదు. నీయొక్క మహాత్త్యమును ఉన్నదానిని ఉన్నట్లుగ నిజరూపమును యెవ్వ రెరుంగ గలరు? అనిస్తుతియించిరి. (46-53)

దేవయోనివిశేషంబులు భగవానునిక్షేత్రమం దీయవసరమున నున్నట్లు స్తోత్రము సేయుటచే నీ ఖాదిరీక్షేత్రమునకు స్తోత్రాద్రి యను పేరు సార్ధకనామముగ వ్యవహరింపబడినది. 54

అంతపార్షదులగు విష్వక్సేను డాదిగాగల మహానుభావులు శ్రీమహాలక్ష్మిని ప్రహ్లాదుని ముందిడుకొని శ్రీభగవానుని సమీపమునకు వచ్చి చేరిరి. (55-56)

ఇట్లు వచ్చి చేరిన బ్రహ్మాదిదేవతలు భగవానునిదండ ప్రణామము లాచరించి బద్ధాంజలులై నిలచి ఇట్లని స్తుతింప సాగిరి. 52

ఓ దేవా! ఈ నీ నృసింహరూపమును మేము సేవింపజాల కున్నాము. ఈ దివ్యరూపము భయావహమైయున్నది. ఈరూపమును నుపసంహరించుకొని సౌమ్యరూపముతో నుండుమని ప్రార్థించి ప్రహ్లాదుని భగవత్సామీప్యమునకు పోయి అట్లే ప్రార్థింపు మని వేడిరి. (58-59)

ప్రహ్లాదుడును అట్లు చేసి భగవానుని వనునయము చేసెను. అంతట శ్రీనృసింహదేవుడు భక్తపరాధీను డగుట బ్రసన్నుడై సౌమ్య

ఇత్యుక్త్వా దేవతాః సర్వాః సుప్రసన్న ముఖాంబుజమ్
ప్రహ్లాదం వత్సయాహీతి హరిభక్తపరాయణమ్ ॥
సోఽపి గత్వా మహాబాహుః నృహరేః సన్నిధిం గతః
స్తుత్వా స్తోత్రైర్బహు విధైః ప్రసీదేత్య బ్రవీద్వచః ॥
తతః ప్రసన్నో భగవాన్ మందస్మితమువాచ హి
వత్సాగచ్ఛ మహాబాహో వరం వరయ సువ్రత ॥
ప్రాంజలిః ప్రణతో భూత్వా నృహరిం తం నిరీక్ష్య సః
నమో హిరణ్య గర్భాయ సృష్టిస్థిత్యన్తకారిణే ॥
వాసుదేవాయ సూక్ష్మాయ దేవానాం పతయే నమః
నమో నమః సహస్రాంశు బింబాన్తర్వర్తినే సతే ॥
నమః సహస్రశిరసే సింహరూపాయ తే నమః
అణోరణీయసే ధాత్రే కాలరూపాయ తే నమః ॥
గండభేరుండ వక్త్రాయ సింహవక్త్రాయ తే నమః
వ్యాఘ్రాశ్వక్రోడతుండాయ మహావీరాయ తే నమః ॥
కప్యాస్యాయ నమస్తే తు ఖగవక్త్రాయ శూలినే
ద్వాత్రింశత్కోటిహోష్ణే తే నమస్తే పాపనాశినే ॥
శరణాగతరక్షాయ శంఖచక్రధరాయ చ
ప్రణతక్లేశనాశాయ నృసింహాయ నమో నమః ॥
ఇత్యేవం నృహరిం స్తుత్వా ప్రణతః పునరబ్రవీత్
స్వామిన్నరహరే దేవ ప్రసీద పరమేశ్వర ॥
ఋషీణామత్ర వసతాం ఘోరే తపసి తిష్ఠతామ్
అనన్య తపసామేషాం దివ్యం వర్ష సహస్రకమ్ ॥
అభయం దేహి నృహరే దివ్యజ్ఞానవతాం సతామ్
సతాన్ వ్యలోకయచ్ఛ్రీమాన్ వీతరాగాన్ విమత్సరాన్ ॥

రూపము నవధరించి మందస్మితముఖారవిందముతో ప్రహ్లాదుని జూచి వరమును కోరు మనెను. (60-61)

ప్రహ్లాదుడు ప్రాంజలియై నిలచి భగవదనుగ్రహముచే మనసు పరవశమై ఇట్లని స్తుతియింప నారంభించెను. ఓదేవా! నీవు హిరణ్య గర్భుడవు, సృష్టిస్థితి సంహారకారణమవు. వాసుదేవుడవు. సూక్ష్మ స్వరూపివి. దేవతల కధిపతివి. నీవు సహస్రాంశుడగు సూర్యుని మధ్య మందు సాన్నిధ్యము జెందినవాడవు నీవు సహస్రశిరములు కలవాడవు. సింహరూపివి. అణువుకంటె అణువైనవాడవు. పరిపాలకుడవు. కాల స్వరూపివి. గండభేరుండవక్త్రము కలవాడవు. సింహవక్త్రముకలవాడవు వ్యాఘ్రము అశ్వము క్రోడము వీటివక్త్రమువంటి వక్త్రము కలవాడవు. మహావీరుడవు. గంభీరాంభములం దుదయించి సుమృష్టనాళమై రవికర వికసితపుండరీకముపలె విశాలమగు కన్నులు కలవాడవు. గరుడునివంటి వక్త్రమును నీకు కలదు. నీవు శూలపాణివి. ముప్పదిరెండుకోట్ల బాహా వులు కలవాడవు. శరణాగతరక్షణవ్రతము నీది. నీకు శంఖచక్రము లాయుధములు. ఆశ్రితుల యాపదలను నీవు తీర్చెదవు. ఓ నృసింహ దేవా! నీకునేను ప్రణామ మాచరింతును. (62-67)

ఇట్లు స్తుతించి మరియు నిట్లని పలికెను. ఓస్వామీ నారసింహా! ప్రసన్నుడవు కమ్మా. ఈక్షేత్రమందు తపంబుండెడి యసంఖ్యాతులగు సాధువులను తపోవిఘ్నభయము లేకుండ ననుగ్రహింపవే యని కోరగా భగవానుడు ప్రసన్నుడై మహాఋషులవంకచూచెను. (68-70)

మహాఋషులును భయంకరరూపోపసంహారమును ప్రార్థింపగా భగవాను డంగీకరించి వారల ననుగ్రహించెను. (71-73)

మరియు నాశిలయందు భగవానుడు తనపాదచిహ్నములు వ్యక్త మగునట్లు చేసి యాపాదచిహ్నములు శాశ్వతముగ నట్లే ఆశిలయం

తతోమునిగణో నత్రమ స్తేzబ్రువన్ నరసత్తమమ్
నృసింహరూపం హైరణ్యవక్షః స్థల విభేదినమ్ ॥
త్వామేవం రూపసంయుక్తం ద్రష్టుం సైవోత్సహామహే
తథైవ క్రియతే హ్యద్య మునయశ్శంసితవ్రతాః ॥
ఇతి సం హృత్య రూపం స్వం నృసింహో భగవాన్ హరిః
తత్రా స్తే భగవాన్ పూర్వస్థానే నర హరి స్తదా ॥
తస్యాం శిలాయాం సువ్యక్తం మమపాదద్వయాంకనమ్
అస్తు లోకత్రయఖ్యాతం సేవ్యం మద్భక్తిసంపదా ॥
విష్ణుభక్తా యే ప్రవీణాః ధర్మనిష్ఠాద్విజాతయః
స్వాధ్యాయనిరతాః సత్యవాచః శుచిసమన్వితాః ॥
పరదారపరద్రవ్యపర స్త్రేవతరబుద్ధయః
తేషాం తు దర్శనీయం స్యాత్కుపతీనామగోచరమ్ ॥
ఇత్యేవముక్త్వా భగవానుద్దిశ్యమునిపుంగవాన్
ప్రసన్నవదనః శ్రీమాన్ నృహరిః క్లేశనాశనః ॥
తతః పశ్చిమదిగ్భాగే గిరేర్వనవిభూషితే
తస్థౌ నదీసమాయుక్తే శిఖరేzస్య స్థితః ప్రభుః ॥
బ్రహ్మాదిదేవా ఆగత్య విమానే వ్యోమ్ని సంస్థితాః
సేవార్థం తస్య నృహరేః సానుగాః సపరిచ్ఛదాః॥
గిరౌ తస్మిం స్తపోనిష్ఠాః తుష్టువుః క్షీణకల్మషాః
అరూపాయాదిరూపాయ నమో దైత్యాన్తకాయ చ ॥
నమ స్తే భీమరూపాయ నమః ప్రహ్లాదరక్షిణే
నమస్తే వజ్రదంష్ట్రాయ వజ్రాయుధనఖాయ చ ॥
సటాచ్ఛటాభిరూపాయ త్రినేత్రాయ త్రిమూర్తయే
నమో రత్నకిరీటాయ నమః కేయూరధారిణే ॥

దుత్కీర్ణములై యుండి సాధువులకు సజ్జనులకు దర్శన మొసంగి కామితముల నిచ్చుననియు భక్తివిహీనుల కాపాదచిహ్నము లగుపడ వనియు వర మిచ్చి యట్లు చేసెను. (74-76)

ఇట్లు తనపాదచిహ్నములచే యాశిల నంకితముచేసిన భగవానుడు దయాపరవశుడై యాపర్వతసానువునకు పశ్చిమభాగమునను నదీతీరమునను దివ్యోద్యానపరివృతమగు ప్రదేశమున నొక్క దివ్యాలయమందు తానే స్వయముగ వసియించెను. (77-78)

ఆయవసరమును ప్రతీక్షించుచుండిన బ్రహ్మాదిదేవతలు పరిషత్పరివారగణములు మహర్షులు తమతమ విమానములలో ఆకాశమునను అవకాశములందును గుమిగూడి నరహరి నిట్లని స్తుతింప నారంభించిరి. ఓ! దేవా! నీవు రూపములేనివాడవు. ఆదిరూపుడవు. దైత్యసంహారకారకుడవు. భీమరూపుడవు. ప్రహ్లాదుని రక్షించినవాడవు. వజ్రదంష్ట్రములు వజ్రాయుధముబోలిన నఖములు కలవాడవు సటాచ్ఛటలచే మనోహరమగు రూపము కలవాడవు. త్రినేత్రుడవు. త్రిమూర్తిస్వరూపుడవు. రత్నములు తాపినకిరీటముచే నీశిరమలంకరింపబడినది. నీబాహువులు కేయూరముల కలంకారములు. నీనాభియందు చతుర్ముఖుడుద్భవించినాడు. నీవు ధర్మరూపుడవు. పీతాంబరముచే శోభించెడి కటిప్రదేశము కలవాడవు. నీనేత్రములు కమలములకాంతిని ధిక్కరించునవి. నీకటాక్షములు ప్రసన్నములైనవి. నీవు అవాప్తసమస్తకాముడవగుటచే నీకు మావలన గాని ఈబ్రహ్మాండములవలన గాని కాదగిన ప్రయోజనములేదు. ఈబ్రహ్మాండములను సృష్టించి రక్షించి సంహరించుటయను నిరవధికమగు కార్యజాతము నీయొక్క లీలకే యేర్పడినది. అనాయాసముగ వేడుకకై ఇట్టి

నమః పంకజనాభాయ ధర్మిణే పీతవాససే
నమః కమలనేత్రాయ సితనేత్రాయ తే నమః ॥ 83

ప్రయోజనం న పశ్యామః పరిపూర్ణస్య తే విభో
జగత్సర్గస్థితిలయాణ్ లీలయా త్వం కరోషి హి ॥ 84

త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వమోంకారః ప్రజాపతిః
జిష్ణురగ్నిర్యమాదిత్యవసవ స్త్వం శశీ శివః ॥ 85

బహునాఽత్ర కిము క్తేన జగత్సర్వం త్వమేవ చ
త్వయా వ్యాప్త మిదం సర్వం జగత్ స్థావరజంగమమ్ ॥ 86

త్వమన స్త స్త్వము న్తః త్వం నిర్గుణః ప్రకృతేః పరః
సగుణ స్త్వం చిదాభాసో భాస్వర స్త్వం నిరీహభాక్ ॥ 87

త్వద్గుణా అపరిచ్ఛేద్యా హ్యసంఖ్యాతా జనార్దన
తిష్ఠన్తి దేవా స్త్వాం ద్రష్టుం దూరతో నరకేసరిన్ ॥ 88

త్వం రక్షక స్త్వం జనకః త్వం మాతా త్వం సుహృ త్తథా
అత్ర స్థితాశ్చ నిర్భికాశ్చర స్తే దర్శనోత్సుకాః ॥ 89

చరతాం బహుకాలం నః భగవన్ దుశ్చరం తపః
ఫలితం దర్శనాదద్య రూపస్య నృహరే తవ ॥ 90

తతో నరహరిః శ్రీమానబ్రవీద్దేవసంసదమ్
శృణుష్వావహితో బ్రహ్మన్ దేవాస్సన్తుగతవ్యథాః ॥ 91

ఏతస్యాం దృషది ప్రాజ్యే మమ పాదాంకనం స్ఫుటమ్
దర్శనా త్సర్వపాపఘ్నం సేవనా న్ముక్తిదాయకమ్ ॥ 92

ఇత్యుక్త్వా న్తర్హితో దేవః తత్క్షణాదేవ నిర్మలే
నద్యాః పూర్వతటే రమ్యే దివ్యే ధామ్ని నృకేసరీ ॥ 93

జగచ్చక్రమును నీవు నడిపించుచున్నావు. నీవు యజ్ఞస్వరూపుడవు. నీవే వషట్కారము ఓంకారమునై యున్నావు. నీవే ప్రజాపతి ఇంద్రుడు అగ్ని యముడు ఆదిత్యుడు వసువులు చంద్రుడు పరమశివుడు నై యున్నావు. వేయేల ప్రపంచమంతయు నీవు అను ప్రవేశించి యున్నావు. నీవు అనన్తుడవు. అన్తఃప్రవిష్టుడవు. హేయగుణశూన్యుడవు. ప్రకృతికతీతుడవు. సమస్తకల్యాణగుణ పరిపూర్ణుడవు. చిదాభాసమవు. స్వప్రకాశస్వరూపుడవు. నిరీహుడవు. నీకల్యాణగుణములు త్రివిధపరిచ్ఛేదములేనివి. నీప్రతాపమునకు వెరగొంది దేవత లందరును దూరమున నిలచి ఆసతో చూచుచున్నారు. తల్లియు తండ్రియు రక్షకుడవు నీవే. నీదర్శనము నపేక్షించియెంతో కాలమునుండి వీరందరును తమశక్తికి మించి వివిధములగు నియమములకు లోనై ఘోరతరములగు తపంబుల నాచరించుచున్నారు. ఆతపః ఫలమే నేడు నీదివ్యసరూపమును వారియెదుట సాక్షాత్కరింపజేసినది. ప్రసన్నుడవు కమ్మని ప్రార్థించిరి.

అంత నరకేసరి వారలస్తోత్రములచే ప్రసన్నుడై వారల నుద్దేశించి ఇట్లనెను. ఓప్రజాపతీ! దేవత లందరును భయవిముక్తులు కాదగును. ఈపర్వతసానువునందలి ఈశిలయందు నా పాదచిహ్నములు సమర్పింపబడియున్నవి. ఈచిహ్నములను దర్శనముచేయువారలపాపములు నశించును. ఆరాధించువారలు సంసారబంధమునుండి ముక్తులగుదురు. అని వరమిచ్చి యాక్షణమందే ఆశిలకుపశ్చిమభాగమందు పూర్వము పేర్కొనబడిన దివ్యాలయమధ్యమున వెలసెను. దేవత లందరను స్వయంవ్యక్తముగ వెలసిన శ్రీనృసింహదేవుని యర్చాబింబమును భక్తియుక్తులై శాస్త్రవిధి ననుసరించి యారాధింపజేయ నారంభించిరి. ఈరీతిని హిరణ్య

నృసింహరూపీ సర్వేశ స్తత్ర ప్రాదురభూన్మునే
తతో బ్రహ్మాదయో దేవా రుద్రశ్చ క్షీణకల్మషాః ॥ 94

సిద్ధాః సాధ్యాశ్చారణాశ్చ గరుడోరగదేవతాః
యక్షాః కింపురుషా దేవాః సమాగత్య ప్రుతం హరిమ్ ॥ 95

సేవ స్తేऽనన్యమనసో భక్తియుక్తాః సమాహితాః
పురాణపురుషం దేవం నృసింహం పాపనాశనమ్ ॥ 96

ఇతి నరహరిసంభవం శివేన
క్రథన సమాగత దైత్యనాశనాయ
విధిముఖరచితస్తుతిం నిశమ్య
ప్రగదిత ముచ్చతరం సుఖీ బభూవ మౌనిః ॥ 97

ఇతి శ్రీమద్బ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే
ఖాద్రీమాహాత్మ్యే ద్వితీయోऽధ్యాయః॥

కశిపుసంహారమునకై యవతారముజేసిన శ్రీనృసింహదేవుని చరితమును ఆయవతారమును బ్రహ్మాదులు స్తుతించిన ప్రకారమును పరమశివునివలన వినిన నారదమౌనీంద్రుడు పరమానందభరితుడాయెను.

పరమపురుషుడగు శ్రీమహావిష్ణుని నామమహత్త్వమును చెప్పుటకు పరమశివునకు మించిన యధికారిలేడు. పరమశివుని యుపదేశమును లేశమైనను విడువక యవగాహముచేసికొని లోకోజ్జీవనమునకై వ్యాఖ్యానముచేయుటకు నారదునకు మించినయధికారియు కలుగబోడు. భగవన్మహిమమును పరమ భాగవతుడగు పరమశివుని ముఖమునుండి వినుటయు తానట్లువినిన పరమరహస్యమును లోకమునకై వినియోగింపనవకాశము కలుగుటయు నారదునకు కలిగిన యానందమునకు బీజములుగ తెలియదగినది. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు సమానులనెడి వాదము వారలు ఒక్కటే ననువాదము వారలకంటె అతిరిక్తముగ బ్రహ్మపదార్థము వేరుగా కలదను వాదమును సమంజసములు కావు. పరమపురుషుడగు శ్రీమన్నారాయణుడు సర్వదేవోత్తముడు.

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారదసంవాదమందు ఖాదిరీమహాత్మ్యగ్రంథమునందలి ద్వితీయాధ్యాయము.

శ్రీ నృసింహాయ నమః

అథ తృతీయోఽధ్యాయః

నారద ఉవాచ :—

చంద్రశేఖర దేవేశ నృహరేరుత్సవం మమ
చిత్రం కథయ కైలాసనాథ శ్రీపార్వతీపతే ॥ 1
కథం బ్రహ్మాదయో దేవాః సమాగత్య నతాః పురా
కస్మిన్ మాసే మహానాసీదుత్సవః సర్వశోభనః ॥ 2
శివః ప్రోవాచ భగవాన్ సురర్షిం దీప్తతేజసమ్
మునే శృణు యథా తత్త్వం సమాహితమనా భవ ॥ 3
నృహరేస్తస్య దేవస్య ప్రాగల్భ్యాదుత్సవో మహాన్
ప్రోచ్యతే హ్యధునా దేవపూజ్యః ప్రాజ్యః ప్రయత్నతః ॥ 4
వసన్తసమయే తత్ర సర్వతః సుమనోహరః
చూతాంకురాస్వాదమత్తమంజుకోకిలరాజితః ॥ 5
నవపల్లవశోభాఢ్యః సంధ్యాభ్రాస్తికరః సదా
మకరందగ్రథనోన్మత్త చంచరీకసమంచితః ॥ 6
నానాకుసుమగంధోద్యన్మలయాచలమారుతః
వికసన్మల్లికాసూనసమూహావలితః పరమ్ ॥ 7
చంపకాశోకవకుళపాటలప్రసవాకులః
కుందసుందరమందారకురంటకసుమప్రదః ॥ 8
ఏవమాభాత్యసౌ రమ్యశ్చలత్పల్లవశోభితః
వికసత్పుష్పశబలచూతవ్రాతవిరాజితః ॥ 9
తదా చతుర్ముఖో దేవో మనస్యేవం వ్యచిన్తయత్
నృసింహస్యోత్సవాహోఽయం కాలః సంపరివర్తతే ॥ 10



శ్రీవసంతవల్లభస్వామివారి వసంతోత్సవము

శ్రీ నృసింహాయ నమః

## మూడవ అధ్యాయము

నారదుడు పృచ్ఛించుచున్నాడు.

ఓ చంద్రశేఖరా! కైలాసనాథా! పార్వతీపతీ! ఖాదిరినరసింహదేవుని మహోత్సవవైభవమును వివరించి విన గోరెదను. బ్రహ్మాదిదేవతలు పూర్వకాలమందు శ్రీనృసింహదేవుని మహోత్సవమును జరిపించినట్లు వింటిని. ఆమహోత్సవము ఏమాసమందు యెవ్వరెవ్వరు కలసి యెట్లు జరిపించిరి. మహోత్సవవైభవమును వివరములను తెలియజెప్పవేయని నారదుడు ప్రశ్నింపగా పరమశివుడు భక్తివివశుడై ఇట్లని వివరింప నారంభించెను. (1-2)

ఓ నారదమునీంద్రా! సావధానముగ వినుము. భగవానుడగు నరకేసరియొక్క దివ్యమహోత్సవము సకలదేవతలచే కొనియాడదగినంతటి గొప్పది. ఆయుత్సవము సర్వభూతమనోహారియగు వసంతకాలమున జరుపబడుచున్నది. మామిడిచిగుళ్ళను మెసవి కోకిలలు మధురగానము చేయుకాలమది. సకలదిక్కులందును వృక్షగుల్మలతాదులు చిగిర్చి లేజిగుళ్ళయొక్క యెఱ్ఱనికాంతిని వెదజల్లుచుండును. వికసించిన పూలయందలి మకరందమును గ్రోవి మత్తములగు భ్రమరములు ఝుంకారనినాదముల జేయుచుండును. పూలనుండి వెడలెడు పరిమళగంధమును దిక్కులందు ప్రసరింపజేసెడి మలయమారుతము మెల్లగ వీచుచుండును. వికసించిన మల్లికాకుసుమము లాదిగాగల పుణ్యపుష్పములతావులు ప్రసరించుచుండును. చంపకములు అశోకములు వకులములు పాటలములు కుందములు మందారములు కురంటకములు నమ నీమొదలగు వృక్షములు

ఉత్తరా ఫల్గునీ యత్ర పౌర్ణమాసీయుతః శుభా
తస్యామేవోరంభః కత్సవార్త్వ్య ఇతి పద్మజః ॥ 11

దేవస్యోత్సవమారేభే తదా సురగణైస్సహ
అంకురార్పణపూర్వం వై శాస్త్రదృష్టేన వర్త్మనా ॥ 12

వైఖానసం మహాభాగం జటామండలభూషితమ్
పద్మాక్షమాలికాకంఠం వైకుంఠే సక్తచేతసమ్ ॥ 13

పురస్కృత్య మహాత్మానమాగతాః క్షీణకల్మషాః
ఋషయశ్చ మహాత్మానః చతుర్వేద పరాయణాః 14

జాబాలిజహ్నుశాండిల్యవిశ్వామిత్రాత్రిగౌతమాః
వసిష్ఠో గోభిలః కణ్వో మాండవ్యశ్చాంగిరా భృగుః 15

శాతాతపో భరద్వాజో జమదగ్నిర్మహాతపాః
మార్కండేయోఽథ మౌద్గల్యః దుర్వాసాః కపిలోఽరుణః ॥ 16

పులస్త్యః పులహో దక్షః హారీతః కాశ్యపస్తథా
ఏవమాద్యా మునిశ్రేష్ఠా అసంఖ్యాతాస్తథాగమాః ॥ 17

హాహాహూహూప్రభృతయో గంధర్వాస్తత్ర సంగతాః
వసవోఽష్టౌ ద్వాదశార్కా రుద్రా ఏకాదశాగతాః ॥ 18

విద్యాధరాః కింపురుషా ఇంద్రాద్యాశ్చ దిగీశ్వరాః
మరుద్గణాః సిద్ధగణాస్తథైవాప్సరసాం గణాః 19

వాసుకిప్రముఖాః సర్వే ఆగతాః పన్నగేశ్వరాః
కిమత్ర బహునోక్తేన త్రైలోక్యే యే జనాః స్థితాః ॥ 20

తే సర్వే తత్ర విచితాః సమ్మర్దోఽభూన్మహత్తరః
అతో వవౌ సుఖస్పర్శః శ్వసనశ్శీతలో మహాన్ ॥ 21

తుంబురుర్గానకుశలో నృహరేః సన్నిధిం ముదా
విశ్వావసుర్మహాభాగశ్చాన్యే గంధర్వనాయకాః ॥ 22

విశేషించి పల్లవించి మనోహరములై యుండెడి వసంతకాలము కాలచక్రమున శేఖరీభూతమై యమరియుండును. (3-9)

అట్టి యొకానొక దివ్యవసంతసమయమున తత్కాలోచితకార్యనిర్వహణమందు వ్యగ్రుడైన చతుర్ముఖుడు దీర్ఘకాలము చింతించి ఈ సమయమున శ్రీనృసింహదేవుని మహోత్సవము చేసి కృతార్థుడ నగుదునుగాక యని నిర్ణయించుకొనెను. ఈమాసమందు ఉత్తరఫల్గునీ యుక్తమగు పూర్ణిమాశుభదినసమున భగవానునియుత్సవారంభము చేయుట తగునని నిశ్చయించి తనపరివారమగు దేవగణమును సమకూర్చి శ్రీవైఖానసశాస్త్రవిధి ననుసరించి అంకురార్పణ మారంభించి శ్రీనృసింహదేవుని యుత్సవమును ప్రారంభించెను. (10-12)

జటామకుటధారియు పద్మాక్షితులసీమాలధారియునై నారాయణ పరాయణుడగు వైఖానసుని పురస్కరించికొని మహర్షు లందరును ఆయుత్సవమున పాల్గొనిరి. జాబాలి జహ్ను శాండిల్యుడు విశ్వామిత్రుడు అత్రి గౌతముడు వసిష్ఠుడు గోభిలుడు కణ్వుడు మాండవ్యుడు అంగిరస్సు భృగువు శాతాతపుడు భరద్వాజుడు జమదగ్ని మార్కండేయుడు మౌద్గల్యుడు దుర్వాసుడు కపిలుడు అరుణుడు పులస్త్యుడు పులహుడు దక్షుడు హారీతుడు కాశ్యపుడు ఇంకను మహాతపస్సంపన్నులగు ముని పుంగవులు లెక్కకు మిక్కిలిగ నామహోత్సవమును సేవింప వచ్చిరి.

హాహాహూహూ మొదలగు గంధర్వులు అష్టవసువులు ద్వాదశాదిత్యులు ఏకాదశరుద్రులు విద్యాధరులు కిన్నరులు కింపురుషులు ఇంద్రాది దిక్పాలకులు మరుద్గణములు సిద్ధచారణగణములు అప్సరస్సులు వాసుకి మొదలగు పన్నగగణములు సకలలోకదిగన్తనివాసులు ఆయుత్సవమును సేవింపవచ్చిరి. వేయేల! త్రిలోకములనుండిన ప్రజాసమూహ మంతయు తండోపతండములుగ వచ్చుట చేరగా లోకోత్తరమగు సంమర్దము కల

నర్తక్యోఽప్సరసస్తత్ర రంభాద్యా మునిసత్తమ
తాసాం తౌర్యత్రికం తత్ర ప్రవృత్తం నికటే హరేః ॥ 23

ఉత్తరాఫల్గునీయుక్తపౌర్ణమాస్యాం ప్రదోషకే
తతః సముత్థితే చంద్రే పూర్ణే చంద్రికయాఽన్వితే ॥ 24

కర్పూరఖండసంయుక్తరసైః కస్తూరికాదిభిః
పాటీరైః కుంకుమాసక్తైః చర్చితః పురుషోత్తమః 25

నానావిధ ధ్వజచ్ఛత్రవ్యజనాలంకృతో హరిః
నృసింహో గరుడారూఢో నిర్యాతో జగతీపతిః ॥ 26

తప్త కార్తస్వరోదంచత్కిరీటేన విభాస్వతా
వజ్రవిద్రుమవైదూర్యముక్తాఫలసుశోభినా ॥ 27

వృతః పరమయా లక్ష్మ్యా శోభితో నరకేసరీ
కలాపైర్బహుభిర్యుక్తః శ్రీమాన్ నరహరిః స్వయమ్ ॥ 28

తతో దుందుభయో నేదుః పటహాః కాహలైః సమమ్
వాద్యఘోషైర్బహువిధైః త్రైలోక్యం పూరితం తదా॥ 29

తతో బ్రహ్మాదయో దేవాః ప్రణమ్యోత్థాయ వై పునః
ఆనందనిర్భరాస్తత్ర ననృతుః పురతో హరేః ॥ 30

ఋషయస్తుష్టువుర్వాక్యైరామ్నాయార్థగోచరైః
జగుర్గంధర్వ పతయో ననృతుశ్చాప్సరోగణాః ॥ 31

ఏవం ప్రతిదినం రమ్యం తదాఽఽసీదుత్సవో మహాన్
నివేదనైర్బహువిధై రుపచారైర్మహత్తరైః ॥ 32

తతశ్చావభృథం కృత్వా బ్రహ్మా దేవగణైః సహ
నృసింహేనాభ్యనుజ్ఞాతం స్వం లోకం ప్రాప్తవాంస్తదా ॥ 33

ఇంద్రాదయో దిగీశాద్యా గంధర్వాప్సరసాం గణాః
ఆగతా ఋషయో దేవా జగ్ముస్తే స్వం స్వమాశ్రమమ్ ॥ 34

వరము యేర్పడినవి. భగవదనుగ్రహముచే నాజనసమ్మర్దము సంకటము చెందక సుఖముగనే కాలము గడిపినవి. మందమారుతము వీచెను. తుంబురుమొదలగు గంధర్వనాయకులు భగవానుని చేష్టితములను మృదు మధురముగ బాడుచుండిరి. రంభాదిదేవకామినులు ప్రక్కవాద్యములు మేలవించగా నర్తన మాచరించుచుండిరి. భగవానుని దివ్యాస్థానము చూడ ముచ్చటయై యచ్చటి మహాజనమును సర్వవిధముల నాకర్షించి వారల మనోవాక్కాయము లన్యపరములుగాకుంత చేయుచుండెను. (18-23)

ఆనాడు ఉత్తరఫల్గునియుక్తపూర్ణిమాశుభదివసము. నాటిప్రదోష సమయమున సకలలోకానందకరముగ పూర్ణచంద్రు డుదయించుచుండగా పచ్చకర్పూరము కుంకుమపూవు కస్తూరి మొదలగు పుణ్యగంధద్రవ్యము లచే యలంకరింపబడి శ్రీనృసింహదేవుడు ఆస్థానమందు విజయముచేసెను. ఆవల ఛత్రచామరధ్వజపింఛములాదిగాగల చక్రవర్తిలాంఛనములు పరి వారింపగా శ్రీనృసింహభగవానుడు గరుడవాహనమునధిరోహించి గ్రామ వీథులవెంట నూరేగుటకు బయలువెడలెను. (24-26)

భగవానుని శిరమున మేలిమిబంగారుతో చేయబడిన కాంతివంత మగు కిరీటము సమర్పింపబడినది. ఆకిరీటమున వెలలేని వజ్రములు విద్రుమములు వైడూర్యములు ముత్యములు మొదలగు రత్నములు పొదగబడియున్నవి. భగవానునిసేవను చూచుటకు వేయికండ్లు కావలసి నట్లుండెను. ఇంకను భగవానుని దివ్యమంగళవిగ్రహ మాపాదమస్త కము దివ్యాభరణ దివ్యాయుధములచే పరిష్కరింపబడినది. (27-28)

స్వామి మెరవణకు వెడలగా ఆకాశమునుండి దేవదుందుభులును వెంటభేరీమృదంగపటహానకాదివాద్యములును దిక్కులు పిక్కటిల్లునట్లు మ్రోగెను. బ్రహ్మాదిదేవతలు భగవానుని సందర్శించి మాటిమాటికి మ్రొక్కుచు లేచుచు ఆనందపారవశ్యముచే పాటలు పాడుచు నృత్యము

ప్రతిసంవత్సరం చైవ బ్రహ్మాఽఽగత్య సురైః సహ
ఉత్సవం కారయిత్వా వై స్వం లోకం ప్రతిగచ్ఛతి 35
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చ మునిపుంగవ
ఆగత్యాఽచారహీనా వా ప్రతిలోమానులోమజాః ॥ 36
ఉత్తరాఫల్గునీయుక్తే పౌర్ణమాస్యాం ప్రదోషకే
నృహరిం గరుడారూఢం దృష్ట్వా తే సర్వకిల్బిషైః 37
విముక్తాస్తత్పదం యాన్తి తద్ధ్యానవిరతాః సదా
ఇత్యేవం తవ కథితం నృసింహమూర్తేః 38
భక్త్యా యశ్చరితమిదం శృణోతి మర్త్యః
తస్యాంగం సువృఢం చ దీర్ఘమాయు
రారోగ్యం దితిజరిపుర్దదాతి భక్తిమ్ ॥ 39

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఖాద్రీమాహాత్మ్యే
తృతీయోఽధ్యాయః

చేయ మొదలిడిరి. మహర్షులు వేదాస్త్రవాక్యములచే వేదాంతవేద్యుని బాడిరి. గంధర్వులు గానము చేయగా అప్సరస్సులు నృత్యముచేసిరి. ఇట్లు ధ్వజారోహణ మాదిగ నుత్సవాంతము వరకు సాయంప్రాతఃకాలము లందు నృసింహుని యుత్సవము జరిగినది. ఉత్సవాదిని మధ్యమున అంతమున విశేషములగు నుపహారములు నివేదనములు సమర్పింపబడెను. ఆవల మహోత్సవము యథావిధిగ నవభృథముతో సమాప్తి కావింప బడెను. (29-32)

అవభృథముతో ఉత్సవమును పూర్తిజేసికొని భగవానునిననుజ్ఞ వడసి బ్రహ్మాదిదేవతలును ఇంద్రాదిదిగీశ్వరులును గంధర్వులు అప్సరస్సులు మహర్షులాదిగాగల సేవార్థులందరును తమతమ నెలవుల కేగిరి.

ఇట్లే ప్రతిసంవత్సరమును వసంత ర్తువునందు దేవతాసమూహ మును వెంట నిడికొని సత్యలోకమునుండి చతుర్ముఖుడు ఖాదిరీనగర మునకు వచ్చి నృసింహుని వషోత్సవమును నిర్వహించి స్వలోకము నకు పోవ నారంభించెను. ఈమహోత్సవమందు బ్రాహ్మణులు క్షత్రి యులు వైశ్యులు శూద్రులు తక్కిన జాతులవారు వీరు వారనక ప్రజలంద రును భగవానుని యుత్సవమునకు భక్తితో వచ్చి సేవించి పూర్ణిమనాటి గరుడోత్సవమును విశేషభక్తితో సందర్శించి పోవుట యాచారమై యొప్పినది. ఈ గరుడసేవను సేవించిన భక్తులు సర్వపాపములనుండి విముక్తులై సకలైశ్వర్యములను అపారితముగ నిహలోకమునందు దీర్ఘకాల మనుభవించి దేహాంతమున వైష్ణవలోకములందు విష్ణు సాయుజ్యము నంది పరమపదమందే నిత్యవాసము సేయుచు భగవన్నా మామృతమును గ్రోలుచు ఆనందింతురు. (33-37)

ఈవిధముగ నృసింహుని బ్రహ్మోత్సవప్రకారమును శ్రద్ధతో వినెడి భక్తులకు శ్రీనృసింహదేవుడు దృఢగాత్రమును దీర్ఘాయువును పుష్కలారోగ్యమును తనపాదకమలములందు దృఢభక్తిని అను గ్రహించుచున్నాడు. 39

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారదసంవాదమందు ఖాదిరీమాహాత్మ్యగ్రంథమునందలి మూడవ అధ్యాయము.

శ్రీ నృసింహాయ నమః

అథ చతుర్థోఽధ్యాయః

నారద ఉవాచః—

నృసింహేఽర్చావతారస్య కారణం కథితం త్వయా
గిరేః స్తోత్రాద్రినామ్నోఽస్య శృంగం హర్యంఘ్రిలక్షణమ్ ॥
యస్యాస్తీరం తరులసద్ద్రుమషండవిరాజితమ్
దివ్యం ధామ నృసింహస్య విద్యతే సా నదీ వరా ॥
సమేతా తీర్థషట్కేన యుక్తా పూర్వం త్వయేశ్వర
బ్రూహి తత్తీర్థషట్కస్య మాహాత్మ్యం చంద్రశేఖర ॥
ఇతి పృష్టో మహాదేవః సాదరం త్రిదశర్షిణా
ఉవాచ దన్తకాన్తేందుకాన్తిం ప్రకటయన్నివ ॥
శృణుష్వ నరశార్దూల సాధు పృష్టం త్వయాఽధునా
తద్ధామ్నః పూర్వదిగ్భాగే సుధాకల్పం మనోహరమ్ ॥
శ్వేతపుష్కరణీ నామ విద్యతే విమలం సరః
తస్యోత్పత్తిం ప్రవక్ష్యామి శృణుష్వ సుసమాహితః ॥
పురా యుగసహస్రాన్తే మగ్నే లోకే మహార్ణవే
మునే తదా చతుర్వక్త్రః తావద్వర్షసహస్రకమ్ ॥
శయిత్వాండం ప్రబుద్ధస్సన్ యథాపూర్వమకల్పయత్
లోకత్రయస్య సృష్టస్య పుష్టికామః ప్రజాపతిః ॥
స్తోత్రాద్రేర్నికటే రమ్యే తపస్తేపే సుదుస్తరమ్
అష్టాక్షరేణ మన్త్రేణ ధ్యాయన్ నారాయణం హరిమ్ ॥

శ్రీ నృసింహాయ నమః

## నాల్గవ యధ్యాయము

నారదుడు ప్రశ్నించుచున్నాడు:-

ఓ మహాదేవా! భగవానుడు నృసింహరూపమున నర్చాసమాధియం దవతరించినప్రకారమును స్తోత్రాద్రి యను పేరిట నచ్చటి పర్వతమునకు వ్యవహారము కలిగినవిధమును అచ్చట విష్ణుపాదచిహ్నము లేర్పడుటకు గతమును భగవానుని దివ్యమందిరము వెలసిన పుణ్యనదియొక్కయు ఆనదీతీరమందలి పుణ్యోద్యానములయొక్కయు చరిత్రమునునీ వెరింగించితివి. ఆనదియు ఆరు పుణ్యతీర్థములచే కూడినట్లు నీవు చెప్పి యుంటివి. ఆతీర్థములయొక్క మహత్త్వమును వివరించి చెప్పవే యని యడిగిన నారదునిప్రశ్నమును వినిన చంద్రశేఖరుడు భగవత్కథను వివరింప తనకు కల్గిన సదవకాశమును స్మరించి పరవశుడై ఆనందముతో నిట్లని చెప్ప దొడంగెను. (1-4)

ఓ నరశ్రేష్ఠుడా! భగవత్కథాశ్రవణకుతుకివగుట నీవుధన్యుడవు. నీప్రశ్నమునకు నేను చెప్పెడి సమాధానమును అవధానముతో వినుము. భగవదాలయమునకు తూర్పుదిశను విమలోదకపూరితమగు శ్వేతపుష్కరిణి యను సరోవరము కలదు. దానిచరిత్రమునువినుము. పూర్వమొకానొక మహాప్రళయమందు జలార్ణవమున శయనించిన చతుర్ముఖుడు ప్రలయాంతమున నిద్రనుండి మేల్కాంచి సృష్టికార్యమును చేసెను. లోకములన్నియు క్షేమముగ వృద్ధిచెందుటకై యాతడు మహావిష్ణుని యనుగ్రహమును బొందగోరి స్తోత్రాద్రి సమీపమున ఘోరతపం బాచరించెను. ఆతపమునకు పరమసాధనము శ్రీమదష్టాక్షరమహామంత్రపురశ్చరణమే యయ్యెను. (5-9)

ఏవం హృది తపస్తస్య దివ్యం వర్షసహస్రకమ్
అభూత్తత్ర మునిశ్రేష్ఠ రహస్యేకో మునిస్తదా ॥ 10

తతో నారాయణో దేవః శంఖచక్రగదాధరః
కౌస్తుభోద్భాసితోరస్కః గరుడోపరిసుస్థితః ॥ 11

పీతవస్త్రపరీతాంగః ప్రాదురాసీజ్జ్వలంస్త్విషా
తం దృష్ట్వా దండవద్భూమౌ ప్రణనామ ప్రజాపతిః 12

ఉత్థాయ చ పునః పశ్యన్ నారాయణమనామయమ్
ప్రక్షాల్య పాదౌ దేవస్య స్వకమండలువారిణా ॥ 13

వేదాన్తవాక్యైః స్తుష్టావ ధ్యాయన్ హృది పునః పునః
తతః ప్రసన్నో భగవానవదత్పద్మజం హరిః ॥ 14

తపసా తవ తుష్టోఽస్మి కిమిచ్ఛస్యబ్జసంభవ
జానామ్యహం తవ బ్రహ్మన్ జ్ఞానేన హృది సంస్థితమ్ ॥ 15

త్వత్సృష్టానాం ప్రజానాం హి పుష్టికామేన వై త్వయా
స్రష్టాఽహమితి మానేన న జానీషే చతుర్ముఖ ॥ 16

స్రష్టాఽహం సర్వలోకానాం భర్తాఽహం తదనన్తరమ్
సంహర్తాఽహం తథా బ్రహ్మన్ ఏవం మే వృత్తిరీదృశీ ॥ 17

అనవాప్తమవాప్తవ్యం న మే యద్యస్తి విద్యతే
తథాఽపి భవతామేషామంశ ఏవ చతుర్ముఖ ॥ 18

సృష్టిః పుష్టిర్వినష్టిశ్చ లీలార్థం విదధామ్యహమ్
నిమిత్తమాత్రం తు భవాన్ సృష్టౌ త్వం వినియోజితః ॥ 19

తస్మాత్ప్రజానాం సృష్టానాం పుష్ట్యై తాం ప్రకుర్వతా
యతస్త్వయా తపస్తప్తమస్మిన్ దేశే తు దుస్తరమ్ ॥ 20

ఇట్లు దివ్యవర్షసహస్రకాలము తపం బొనరించిన చతుర్ముఖు నకు ఒక్క శుభసమయమున శంఖచక్రగదాధరుడును కౌస్తుభాలంకృత వక్షుడును పీతాంబరపరివృతుడును గరుడవాహనారూఢుడునై సహస్ర సూర్యప్రకాశముతో శ్రీమహావిష్ణువు సాక్షాత్కరించెను. ఆభగవానుని జూచి చతుర్ముఖుడు దండప్రణామముల జేసి భగవానుని చరణకమల ములను కనకమండలునందలి పుణ్యజలములచే కడిగి యర్ఘ్యాది సక లోపచారంబుల జేసి వేదాంతవాక్యములచే మానసికముగను వాచికము గను వేవిధముల స్తుతించెను. (10-13)

ప్రపన్నుడగు చతుర్ముఖునియందు ప్రసన్నుడగు భగవానుడు పరమీయ నవధరించి పద్మజున కిట్లనియె. 14

ఓపద్మసంభవా! నీతపసుకు మెచ్చితిని. నీకోరికెను నే నెరుంగు దును. నీవు సృష్టించిన ప్రాణులక్షేమమును కోరి నీవు తపం బొనరించితివి. నీవుసృష్టించితి ననియు నీవే భరింతుననియు భ్రమముచే నీవాయాస పడుచున్నావు. చరాచరములను సృష్టించి సంరక్షించువాడను నేను కల నని నీవు మరచి కష్టపడుచున్నావు. జగత్సృష్టిస్థితిసంయమములకు నేనే కర్తను. ఆకార్యములను ఏమరుపాటు లేక నేను నిర్వహించు చుందును. నాకింతకుమించిన కార్యమేమున్నది? తత్త్వమును విమర్శించి చూచినచో నాకీ జగద్వ్యాపారమువలని ప్రయోజనము లేశమేని లేదు. అయినను ఈవ్యాపారమును కేవలము వేడుకకై చేయుచున్నాను. అదియు ప్రయోజనమే యైనయెడల సమ్మతమే. సృష్టికార్యమునందు నిమిత్తమాత్రముగనే నీవు నియోగింపబడితివి. అందలి కర్తృత్వము నీదికాదు. నీ వా యహంకారమును విడచి ఇపుడు నాకై తపస్సు చేసితివి. నేను తుష్టుడ నైతిని. నీప్రజలనుగురించి నీవు తపంబు చేసి సిద్ధిబొందిన ఈ క్షేత్రమున తపంబు చేయుమానవులకీ క్షేత్రము శీఘ్రసిద్ధిప్రదమగు

భవిష్యతి తతో దేశః శీఘ్రసిద్ధిప్రదో నృణామ్
ప్రక్షాలితా త్వయా బ్రహ్మన్ పాదౌ శుద్ధేవ వారిణా ॥ 21

తద్వారిణా పాపహరం వర్తతే విమలం సరః
పిబతాం ప్రాణినామేతజ్జలమారోగ్యదం భవేత్ ॥ 22

పిబన్తి సలిలం యే వై తేషాం జ్ఞానప్రదం భవేత్
అగ్నిష్టోమాదిభిర్యజ్ఞైః ప్రాప్యతే యత్ఫలం ద్విజైః ॥ 23

తత్ప్రాప్నోతి జలస్నానాత్తస్య తీర్థస్య భక్తితః
ఇత్యుక్త్వాऽన్తర్దధే విష్ణుః శంఖచక్రగదాధరః ॥ 24

హృష్టస్తతః సత్యలోకం గతః పద్మభవో ముదా

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే రుద్రనారద సంవాదే
ఖాద్రీమాహాత్మ్యే చతుర్థోऽధ్యాయః

గాక. మఱియు నేను నీకు సాక్షాత్కరించిన ఈయవసరమున నిర్మలము లగు నీకమండలుజలములచే నాపాదములను కడిగితివి. ఆయుదకములు ప్రవహించి యేర్పడిన యీ పుష్కరిణిలోని జలములు పాపములను పోగొట్టును. ఈయుదకములను ద్రావిన మానవులు దృఢగాత్రమును దీర్ఘాయువును ఆరోగ్యమును పొందుదురు. వారలకు భగవద్భక్తియందు మనసు లయించి జ్ఞానులగుదురు. అగ్నిష్టోమాది వేదక్రతువుల ననుష్ఠించుటచే కలుగు పుణ్యఫల మీ తీర్థపానమువలన కల్గును. ఈయుదకము లందు భక్తితో స్నానముచేయువారలకును పైచెప్పబడిన సకలఫలము లునుకల్గును. ఇట్లని యానతిచ్చి శంఖచక్రగదాధరుడగు భగవాను డంతర్హితు డాయెను. చతుర్ముఖుడును సంతుష్టాంతరంగుడై సత్యలోకము నకు మరలెను.

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారదసంవాదమందు
ఖాదిరీమాహాత్మ్యగ్రంథమునందలి నాల్గవయధ్యాయము.

శ్రీనృసింహాయ నమః

అథ పంచమోఽధ్యాయః.

తతః సురర్షిః దేవేశం శంకరం లోకశంకరమ్
వినయావనతో వాక్యమువాచ మధురాక్షరమ్ ॥ 1

ఇత్యేవముచ్యమానం తం శ్వేతపుష్కరిణీ కుతః
నామాఽస్య సరసః శ్రీమత్పద్మ సౌరభశాలినః ॥ 2

ఇతి పృష్టోఽవదద్భూయః సాదరం త్రిపురాన్తకః
జాబాలేర్మునివర్యస్య శ్వేతనామాఽస్తి నందనః 3

తపస్వీ చ సదా దాంతః సదాచారరతో వశీ
కదాచిచ్చిన్తయామాస యజ్ఞః కార్యో మయేతి సః 4

తదర్థం హవిషః సిద్ధేః తప్తుకామో మునేః సుతః
శీఘ్రసిద్ధికరం మత్వా స్తోత్రాద్రేర్నికటం గతః 5

తస్యాస్య సరసః ప్రాప్తే గిరేః గోవర్ధనాహ్వయే
జజాప నియతః కృష్ణమన్త్రిమష్టాదశాక్షరమ్ ॥ 6

ఇత్యేవం జపతస్తత్ర మునిపుత్రస్య నారద
గోపాలన్యస్తచిత్తస్య అత్యగాత్సుమయో మహాన్ ॥ 7

తత్రాఽస్తే శోణితాఖ్యోఽసౌ రాక్షసః పిశితాశనః
పుత్రం మునేః మహాభాగం జాబాలేః సూర్యవర్చసమ్ ॥ 8

తపస్వినం సదాచారం కామక్రోధవివర్జితమ్
శ్వేతం పశ్యన్ మహాత్మానం హన్తుకామో నిశాచరః ॥ 9

నిరీక్ష్య సమయం దుష్టః తం కదాచిన్నరాశనః
దిదృక్షురాస్తే దుష్టాత్మా కుత్రచిత్ రుధిరప్రియః ॥ 10

శ్రీ నృసింహాయ నమః

## ఐదవ యధ్యాయము.

అంతట దేవర్షియగు నారదుడు లోకశంకరుడను శంకరునిజూచి వినయావనతుడై మృదుమధురముగ ఓశంకరా! పై చెప్పబడిన సరస్సునకు శ్వేతపుష్కరిణియను వ్యవహారమేలకలిగినది. ఈ సరోవరము యొక్క విసరమును చెప్పవే యనియడిగెను. నారదునిప్రశ్నమునకు బదులుచెప్పుచు త్రిపురారియగు శంకరు డిట్లని యుత్తర మొసంగెను. ఓ నారదా! సమాహితుడవై వినుము. పూర్వము జాబాలి యను తపోనిధికి శ్వేతుడను కుమారు డుండెను. ఆశ్వేతుడు తపస్వియు సదాచార సంపన్నుడును జితేంద్రియుడునై యుండెను. ఆతడొకనాడు యాగము చేయ దలపెట్టెను. యాగనిర్వహణమునకు ధనిస్సును సంపాదించుటకై యాతడు తపము సేయగోరి తపస్సును శీఘ్రముగసిద్ధి పొందింపవగు స్తోత్రాద్రియొక్క మహిమమును యెరిగి ఆ యద్రియందు ఈ పుష్కరిణీతీరమున గోవర్ధన మను గిరియందుండి నియతవ్రతుడై శ్రీకృష్ణాష్టాదశాక్షరమహామంత్రమును పురశ్చరణము జేసెను. ఇట్లు శ్వేతుడు చిరకాలము తపంబు చేసెను. (1-7)

ఆ ప్రదేశమందే నరమాంసాశనుడగు శోణితుడను పేరుగల రాక్షసుడు నివసించుచు సదాచారసంపన్నుడును మహాత్ముడు నగు శ్వేత మునిని చంప దలచి సరస్తీరమందు సమయమునకై వేచియుండెను.

దైవయోగమున నదేసమయమున శ్వేతర్షియు సంధ్యావందనము చేయుటకై యాసరస్తీరమునకు వచ్చెను. అంతట తీక్ష్ణములగు కోరపళ్ళతో గూడి భయంకరాకారము దాల్చి యున్న నిశాచరుడు వికృతా

శ్వేతోఽపి సంధ్యోపాసార్థం సరస్తీరముపాగమత్
తదా చ భీషణాకారః తీక్ష్ణదంష్ట్రో నిశాచరః ॥ 11

హన్తుకామో మునేః పుత్రం వికృతో వికృతాననః
యదాఽఽసీన్మునిపుత్రస్య హుంకారాత్ క్షణదాచరః ॥ 12

తత్క్షణాదేవ గంధర్వో హ్యభూత్సోఽపి నిశాచరః
దివ్యం విమానమారూఢో దివ్యసుందరమూర్తిమాన్ ॥ 13

ప్రభామండలమధ్యస్థః సాక్షాద్విష్ణురివాపరః
విమానాదవతీర్యాథ స తూర్ణం మునిపుత్రకమ్॥ 14

ప్రణమ్య పురత స్తస్థౌ శ్వేతస్యాంజలిమావహన్
తేన పృష్టః స్వకం వృత్తమబ్రవీత్ శ్రూయతామితి ॥ 15

చిత్రాంగదస్య మాం విద్ధి గంధర్వాధిపతేః సుతమ్
గానవిద్యాసు కుశలం వరిష్ఠం దేవగాయినామ్ ॥ 16

తపశ్చచార ఘోరం వై గాలవో మునిసత్తమః
శంకాదోలాయమానోఽభూద్యేన త్రిదశనాయకః ॥ 17

తతో మాం ప్రముఖం కృత్వా యుక్తమప్సరసాం గణైః
వాసవః ప్రేషయామాస తపోవిఘ్నాయ వై మునేః 18

తతోఽహం తూర్ణమాగత్య గాలవస్యాశ్రమం మునేః
అగాయం మధురం తత్ర సహితోఽప్సరసాం గణైః ॥ 19

తతో మాం ప్రేరయామాస గాలవో గానమోహితః
కదాచిదత్ర శయితం దృష్ట్వాఽహం మృగశాబకమ్ ॥ 20

కంఠే గృహీత్వా తద్రక్త మపిబం తృష్ణయాన్వితః
తతస్సమీపమాగత్య మునేర్గానే సమాశ్రుతే ॥ 21

స మునిర్గతమాజ్ఞాయ రక్తస్య ధ్యానమాస్థితః
విదిత్వా స మునిః క్రుద్ధో మామువాచాతి నిష్ఠురమ్ ॥ 22

కారముతో నోరుతెరచి మునిసుతుని మ్రింగ బోయెను. ఆభయంకరుడగు రాక్షసుని జూచి భయముజెందకయున్న మహర్షియొక్క హుంకారముచే రాక్షసుడు నిహతుడై కనురెప్పపాటుమాత్రకాలమున నొక్క దివ్య గంధర్వుడై జగన్మోహనసుందరరూపము ధరించి మనోహరమగు విమానము నెక్కినవాడై యాకాశమున ప్రభామండలమధ్యమున సాక్షాత్కరించెను. ఆతనిరూపము శ్రీమహావిష్ణునిరూపమువలె నుండెను. కొంతదడవాతడాకాశముననుండి మరల నావిమానమునుండి యవతీర్ణుడై మునిపుత్రుడగు శ్వేతుని సమీపించి వినయావనతుడై నమస్కరించి యెదుట నిలచెను. శ్వేతుడును ఆశ్చర్యచకితుడై గంధర్వుని తన వృత్తాంతమును నివేదింప గోరినంతట నాగంధర్వుడు తనవృత్తాంతము నిట్లని వివరింప నారంభించెను. (11-15)

ఓశ్వేతమౌనీంద్రా! వినుము. నేను చిత్రాంగుడను గంధర్వ రాజునకు పుత్రుడను. నేను గానవిద్యయందు ప్రవీణుడను. దేవలోక గాయకు లందరిలోను నేను ఉత్తమగాయకుడను. ఒకప్పుడు గాలవుడను మునిశ్రేష్ఠుడు గొప్ప తప మాచరించుచుండ శతక్రతుడగు దేవాధిపతి ఈర్ష్యాళుడై మునిచే తనపదవికి ముప్పు రాదగు నని భయపడి యామహర్షి తపస్సును విఘ్నపరుప యత్నించెను. తనకార్యమును సాధించుకొనుటకై యాతడు నన్ను ప్రధాననిమిత్తముగ నండజేసికొని నాకు సహాయముగ తనయాస్థానమందలి యప్సరోగణమునిచ్చి మహర్షి యాశ్రమమునకు పంపెను. నేనును దేవేంద్రుని మోమోటమికి భ్రమపడి యప్సరస్సులు నావెంట వచ్చి తమ నృత్యప్రావీణ్యమును జూపి నర్తనము సేయుచుండ నా గానవిద్యాకౌశలమును మహర్షిచిత్తాకర్షకముగ ప్రదర్శించితిని. గాలవుడు నాగానముచే ముగ్ధుడాయెను. ఆసమయమున నొక మృగశిశువు మహర్షిచెంత నాడుచుండుటను జూచి యామృగ శాబమును బట్టి కంఠమును కొరికి నేనారక్తమును ద్రావితిని.. గానము

దురాత్మన్ వాసవేనేహ ప్రేషితశ్చాప్సరోగణైః
ప్రత్యూహాయైవ తపసః సుచిరం సంభృతస్య మే ॥ 23

యతస్త్వం మృగశాబస్య మమోత్సంగశయస్య వై
అపిబః శోణితం పాపిన్ రక్షోధర్మం విచారయన్ ॥ 24

రాక్షసః శోణితాఖ్యాఖ్యః తతో భవ సుదుర్మతే
ఇతి శప్తో మునేస్తస్య పాదయోః పతితోఽభవమ్ ॥ 25

చిరాద్దేశమిమం ప్రాప్య మునిపుత్ర త్వయేక్షితః
స్వరూపం ప్రాప్తవానస్మీత్యుక్త్వా తస్మిన్ గతే పునః ॥ 26

మునిపుత్రశ్చ తత్రైవముక్తవాన్ సరసస్తటే
యోఽప్యత్ర మజ్జతి జలే పానార్థే విమలే శుభే ॥ 27

దురాత్మనస్తస్య శిరః శతధా భంగమాప్నుయాత్
ఇత్యుక్తో దివమారుహ్య విమానం సూర్యసన్నిభమ్ ॥ 28

జగామ గంధర్వపతేః సుతః శాపవిమోక్షితః
ముక్తో రాహుముఖాచ్చంద్రస్తమసా భానుమానివ ॥ 29

తతో జాబాలితనయః కృష్ణమన్త్రం జపన్ స్థితః
మునిపుత్రశ్చ తత్రైవ స్థితవాన్ సరసస్తటే ॥ 30

క్షేత్రాద్రేః పరితో దివ్యాః శతశః సన్తి గోవృషాః
కదాచిద్గోవ్రజాదేకా విభ్రష్టా ధేనురాగతా ॥ 31

పీనోన్నతా సులక్షైంచ్ఛుభలక్షణసంయుతా
మునిపుత్రాశ్రమే శ్రీమన్నవశష్పవిరాజితే ॥ 32

అవసద్బిల్వతులసీకరవీరవిరాజితే
కుందబాణాసనోదగ్రే పిప్పలీవనశోభితే ॥ 33

తాలహింతాలవకుళప్రవాళాశోకసంచయే
పూగపున్నాగసుకాశీసాజ్జనసమావృతే ॥ 34

నిలిపి సంతట మహర్షి స్వపశువై యాప్రదేశమున మృగశాబహత్యచే చిందినరక్తబిందువులను గుర్తించి యందుకు హేతువును జ్ఞానదృష్టిచే తెలిసికొని యెదుట నిలిచియుండు గంధర్వుని దుశ్చేష్టితముగా నిర్ణయించినవాడై కోపించి నన్ను శపించెను. ఓయీ దురాత్మా! నాతపంబు విఘ్నము చేయుటకై యప్సరోగణసహాయముతో నీవు దేవేంద్రుని పంపున నీ యాశ్రమమునకు పంపబడితివి. చిరకాలము కష్టార్జితమగు నాతపంబును నీవు చెరుపవచ్చితివి. నాయాశ్రమమునందలి నిరపరాధియగు మృగశాబమును రాక్షసప్రవృత్తితో నీవు చంపితివి. నీ విట్టిఘోరపాపమును నా కపచారమును చేసితివి. కావున నీగంధర్వరూపమును విడచి ఘోర రాక్షసరూపము చెందినవాడవై శోణితు డను పేరిట లోకముల భ్రిమ్మరుదువు గాక యని యాతడు నన్ను శపించగా నేను భయగద్గదగాత్రుడనై మహర్షిపాదములపై బడి శాపాంతమును వేడగా నీయొక్క దర్శనముచే నాకు శాపవిముక్తి నాతడు ప్రసాదించెను. (16-25)

శాపఫలము నెంతయో కాలము రాక్షసశరీరముతో ననుభవించి నేటికి నీదర్శనమహాభాగ్యముచే స్వస్వరూపము నొందగల్గితి ననిచెప్పి గంధర్వుడు నిలచుండెను. శ్వేతుం డాశ్చర్యచకితుడై సరోమాహాత్మ్యమును ప్రకటించి పానాహారములగు నీసరోజలముల స్నానము చేయువారలు పతితులగుదు రనియు చెప్పి గంధర్వుడు విమానారూఢుడై తన లోకమునకు వెళ్ళెను. (26-29)

అంతట శ్వేతుడును కృష్ణమహామంత్రమును పూర్వమువలెనే యా సరస్తీరమున జపియించుచుండెను. 30

స్తోత్రాద్రిని పరివారించి ఆవులమంద లసంఖ్యాతములుగ నుండెను. ఆమందలలో నొక్క మందనుండి యొకానొకప్పు డొక్క గోవు సస్యశ్యామలమగు మహర్షి యాశ్రమమునకు వచ్చి యచ్చట పచ్చికలను మేయుచుండి తనమందకు మరలిపోలేక నిలిచిపోయెను. (31-34)

తత్ర గోవర్ధనో నామ గిరిః ప్రస్రవణావృతః
చూతజంబీర చాంపేయ కపిత్థ ఖదరీయుతః ॥ 35

పూగ పున్నాగ నారంగ భృంగసారంగ సంకులః
రంభోరు సప్తపర్ణాఢ్య ముకుందా నందవర్ధనః ॥ 36

వానరైర్గోముఖై ర్భీమై ర్మార్జాలైః ధేనుకై ర్వరైః
మదమత్తై ర్మతంగైశ్చ శారికా శుకమాగధైః ॥ 37

శార్దూలైః చమరైః సింహైః ఖడ్గైర్భలైః ప్లవంగమైః
చమూరుభిర్మహారణ్యైః వ్యాప్తః పుష్పితశాఖిభిః ॥ 38

ఏవం హ్యాభూత్తస్య గిరేః చరిత్వా పరితస్తృణమ్
తత్రపంకజ కల్హార నీలోత్పల విరాజితమ్ ॥ 39

నిర్మలం భాస్వరం దీవ్యచ్చక్రవాక విరాజితమ్
హంసకారండవాకీర్ణం జలకుక్కుటరంజితమ్ ॥ 40

గ్రాహైః కులింగైః కమఠైః బృహద్భిః కర్కటైర్వరైః
హింస్రేతరైర్మనోజ్ఞైశ్చ జలమానుష సంచయైః ॥ 41

విరాజితం మహామౌని సేవితం పుణ్యశాలిభిః
శ్వేతపుష్కరిణీనామ సర్వస్వర్గ ఫలప్రదమ్ ॥ 42

తస్య తీర్థం చ పాపఘ్నం తిరశ్చామపి సౌఖ్యదమ్
మానవానాం కిమాశ్చర్యం కిమిహాత్ర విచార్యతామ్ ॥ 43

పీత్వా వరహాతే ర్దివ్యం మందిరం రత్నశోభితమ్
ప్రదక్షిణీకృత్య చ సా నివసత్యాశ్రమే మునేః ॥ 44

శ్వేతోఽపి కృష్ణమన్తేణ హృదయే దేవకీసుతమ్ ॥
ధ్యాత్వా చ ఘోరే తపసి చక్రే యత్నమనన్యధీః 45

తతో వర్షసహస్రాన్తే నృహాతిః కృష్ణరూపవాన్
ప్రాదురాసీన్మహాతేజాః శ్వేతస్య పురతో మునేః ॥ 46

ఆయాశ్రమమందు గోవర్ధనమను పేరుగల చిన్నపర్వత మొక్కటి యుండెను. ఆపర్వతమందెల్లయెడలను సెలయేళ్లు ప్రవహించుచున్నవి. చూతము జంబీరము చాంపేయము కపిత్థము బదరీ పూగము పున్నాగము నారంగము భృంగము సారంగము రంభా ఉసిసప్తపర్ణము ముకుందానంద వర్ధనము మొదలగు వృక్షము లెన్నియో కలవు. వానరములు గోముఖ ములు మార్జారములు ధేనుకములు మదమత్తములగు మాతంగములు అచ్చట సంచరించుచుండును. శుకశారికాదిపక్షివిశేషములు శార్దూల చమర సింహ ఖడ్గభల్లి ప్లవంగమ చమూరు ప్రభృతులగు నారణ్యక మృగములు విరివిగ నచ్చట సంచారము చేయును. ఆపర్వతోపరిప్రదేశ ములందు నిర్భయముగ సంచరించుచు లేతపచ్చికలను దినుచు ఆ గోవు సుఖముండెను. మరియు గ్రాహములు కులింగములు కమలములు కర్కటములు మొదలగు మృదుమనోజ్ఞములగు జలచరములతోడ గూడి పుణ్యశాలురగు మహర్షులచే సేవింపబడియెడి సరస్సున తీర్థముల ద్రావి యాగోమాత తనమందను మరచియే పోయెను. ఆసరస్సునందలి యుదకములమహిమమట్టిది. అయ్యవి ప్రాణతర్పకములే గాక ఆత్మ తర్పకములునై మానవులకువలె తిర్యగ్జంతువులకు నైతము హిత ప్రదములై యుండెను. ఆపచ్చికల దిని ఈయుదకములద్రావి యాగోవు. నినరహరియొక్క దివ్యాలయమును ప్రదక్షిణము జేసికొనుచు శ్వేతము యాశ్రమమందే నివసించి యుండెను. (35-44)

శ్వేతుడును శ్రీకృష్ణ మహామంత్రమునే యథాపూర్వముగ జపించుచు తనతపస్సునందే లగ్నచిత్తుడై కాలముపుచ్చుచుండెను. 45

ఇట్లు గడచిన వేయిసంవత్సరములవెనుక శ్రీనృసింహభగవానుడు కృష్ణరూపముతో శ్వేతునిమెదుట సాక్షాత్కరించెను. 46

మునిపుత్రశ్చ తం దృష్ట్వా మగ్నో హ్యానందసాగరే
పపాత దండవద్భూమౌ ప్రస్సదేతి వదన్ముహుః ॥ 47

తతో దేవేన సందిష్టో వాంఛితం వ్రియతామితి
వృతోఽపి జ్ఞానమత్యా చ న వవ్రే పూర్వకాంక్షితమ్ ॥ 48

యయాచేఽనుత్తమాం సిద్ధిం పునరావృత్తి వర్జితామ్
తతః స్మితముఖః కృష్ణో జగాద మునినన్దనమ్ ॥ 49

హవిషామేవ యజ్ఞార్థం తపస్తప్తం త్వయాఽత్ర హి
హవిస్సిద్ధేరుపాయం తే వదామి మునిపుత్రక ॥ 50

తవాశ్రమే యా వసతి ధేనుః భ్రష్టా తు గోవ్రజాత్
సా కామధేనుర్భవితా సంగృహాణ మునీశ్వర ॥ 51

భూయసాం హవిషాం సిద్ధ్యై సా విధాస్యతి సత్వరమ్
తతస్త్వం బహుభిర్యజ్ఞైః కామనారహితైశ్చ మామ్ ॥ 52

అర్చయిత్వా విశుద్ధాత్మా తతో మామేష్యసి ధ్రువమ్
త్వన్నామ్నా చ జగత్యస్మిన్ పాదప్రక్షాలనోద్భవమ్ ॥ 53

శ్వేతపుష్కరిణీతీర్థం ఖ్యాతిమేష్యతి భూతలే
ఇత్యుక్త్వాన్తర్దధే కృష్ణస్తదా శ్వేతస్య పశ్యతః ॥ 54

గౌః ప్రాప్య కామధేనుత్వం శ్వేతస్య వశగాఽభవత్
తామాదాయ చ స శ్వేతః ప్రతిపేదే స్వమాశ్రమమ్ ॥ 55

శ్వేతపుష్కరిణీతోయం యో దదాతి పిపాసవే
ప్రపాయాం నిర్జలే దేశే నిర్మాతుర్యత్ఫలం భవేత్ ॥ 56

తత్ఫలం సమవాప్నోతి స తు మర్త్యో న సంశయః
పుణ్యవాన్ సుకృతీ ధన్యః శ్రేయోవాన్ హి భవిష్యతి ॥ 57

శ్వేతుడును భగవద్దర్శనము కలిగినయానందమున పరవశుడై భగవానునికి దండప్రణామములాచరించి యాతని ప్రసన్నుడవు కమ్మని యనేకవిధముల స్తుతించెను. 47

భగవానుడు ప్రసన్నుడై వరమును కోరుమని యడుగగా నాతనికి భగవద్దర్శనజనితమగు నానందపారవశ్యముచే తన తపశ్చరణ కారణము మరపునకు రాగా నాతడు భగవానునిజూచి పునరావృత్తివర్జితమగు మోక్షము ననుగ్రహింపుమని కోరెను. భగవానుడంత చిరునగవుతో శ్వేతుని ఓయీ ఓమునివర్యా! నీవు తపముసేయుటకు పరమోద్దేశము నీకుగలిగిన యజ్ఞకార్యనిర్వాహమునకై వలయు హవిస్సంపాదనమై యుండెను. నాదర్శనముచే ముగ్ధుడవగు నీకా యంశము స్మృతిపథమునకు రాదాయెను. నీకు మొదటి కాంక్షితమగు హవిస్సును తత్సాధ్యమగు యజ్ఞమును సాధించుట కుపాయము చెప్పెదను. ముందు దానిని నిర్వర్తింపుము. నీయాశ్రమమున కొక ధేనువు వచ్చి నాసాన్నిధ్యమున పరిచర్య చేయుచున్నది. ఆ ధేనువును హోమధేనువుగా నీవు స్వీకరించి యథావిధిగ యజ్ఞముల నాచరించితివేని తన్మూలముగ పరిపక్వకషాయుడవై జ్ఞాన విశేషము కలిగి నీవు నాసాయుజ్యము చేరగలవు. చతుర్ముఖుడు నాపాదములు కడిగిన యీపుణ్యజలముగల పుష్కరిణి నీపేరిట ప్రఖ్యాతి చెందును. అని వరమిచ్చి యంతర్హితు డాయెను. (48-54)

ఆగోవును హోమధేనువై మహర్షికి వశవర్తినియై యొప్పగా నాతడు స్వాశ్రమమున సకలవైదికకార్యములను అనుష్ఠించుచుండెను. ఇష్టసిద్ధిజెంది యాతడు దేహాంతమున శ్రీవైకుంఠమును జేరెను. 55

దాహార్తుడగువానికి శ్వేతపుష్కరిణీజలము నొసంగువానికి నిర్జన ప్రదేశమందు చలివందిరిని స్థాపించినఫలము కలుగును. అతడు పుణ్యాత్ముడు ధన్యుడు సుకృతి శ్రేయోవంతుడునగును. (56-57)

మృష్టాన్నం యః పుష్కరిణ్యాస్సమీపే
విప్రాయోచ్చైః సాదరం యః ప్రదద్యాత్
స ప్రాప్నోతి బ్రాహ్మణానాం సహస్రే
భుంక్తే దాతుర్యత్ప్రదం తత్ఫలం వై ॥ 58

శ్వేతపుష్కరిణీస్నానం దర్శనం నృహరేః పరమ్
దుర్లభం సత్యసంధానామితరేషాం కిమద్భుతమ్ ॥

ఇతి శ్రీ బ్రహ్మాండ పురాణే రుద్రనారదసంవాదే ఖాద్రీమాహాత్మ్యే
శ్వేతపుష్కరిణీ మాహాత్మ్య వర్ణనం నామ పంచమోఽధ్యాయః

శ్వేతపుష్కరిణీతీరమం దెవ్వడు పంచభక్ష్య పరమాన్నములతో బ్రాహ్మణున కాహార మొసంగునో యాతడు బ్రాహ్మణసహస్రమును భుజింపించిన పుణ్యఫలమును పొందగలడు. 58

శ్వేతపుష్కరిణీస్నానము ఖాదిరీనృసింహుని దర్శనము నను నియ్యవి మహాత్ములకు కూడ లభించుట కష్టమై యుండును. ప్రాకృత మానవులకియ్యవి రెండును రెంటిలో ఒక్కటియు లభించదు.

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారదసంవాదమందు
ఖాదిరీమాహాత్మ్య గ్రంథమునందలి ఐదవ యధ్యాయము.

శ్రీనృసింహాయనమః

అథ షష్ఠోఽధ్యాయః

రుద్ర ఉవాచ :—

శ్వేతపుష్కరిణీతీర్థమాహాత్మ్యం కథితం మునే
అధునా భృగుతీర్థస్య మాహాత్మ్యం వర్ణ్యతే శృణు 1

తద్ధామ్నః పశ్చిమాశాయాం విద్యతే నామ వై సరః
భృగుతీర్థమితి ఖ్యాతం పావనం నృహరేః ప్రియమ్ ॥ 2

మందరస్య సమీపే వై స్వాయంభువమనుః పురా
పురా ప్రారబ్ధవాన్ దీర్ఘసత్రం ద్వాదశవార్షికమ్ ॥ 3

తత్రాగతాః మునిశ్రేష్ఠా మునయో బ్రహ్మవాదినః
భృగ్వత్రికణ్వహారీతవిశ్వామిత్రపరాశరాః 4

వసిష్ఠకౌత్సపులహదక్షవాత్స్యమరీచకాః
మార్కండేయశ్చ దుర్వాసా భరద్వాజశ్చ గోభిలః 5

మాండవ్యజహ్నుశాండిల్యావామదేవశ్చ కాశ్యపః
శాతాతపోఽంగిరా వ్యాసో మౌద్గల్యశ్చ్యవనస్త్రిపాత్ 6

ఏవమాద్యా మునిగణాస్తత్ర సమ్మిలితాస్తదా
ధర్మక్షేత్రే మహాభాగా నైమిశే సత్యశాలినః 7

తస్థివాంసః కదాచిత్తుతేషాం సంవాదముచ్చకైః
మహర్షిణా మహాదేవం శతసూర్యసువర్చసామ్ 8

బ్రహ్మవిష్ణుమహేశానాం కో వా శ్రేష్ఠః త్రిమూర్తిషు
సౌలభ్యం సర్వశక్తిత్వం వాత్సల్యం కరుణా క్షమా 9

గాంభీర్యౌదార్యధైర్యాద్యాః శుభా గుణగణా అమీ
యస్మిన్ వసన్తి దేవేశే స కశ్చిత్పురుషోత్తమః ॥ 10



శ్రీ వసంతవల్లభస్వామివారి కల్యాణోత్సవము



భృగుతీర్థము

శ్రీ నృసింహాయ నమః

## ఆరవ యధ్యాయము.

రుద్రుడు చెప్పుచున్నాడు.

ఓ నారదమునీంద్రా! శ్వేతపుష్కరిణీతీర్థమాహాత్మ్యము నీవువింటివి కదా! అట్లే భృగుతీర్థమాహాత్మ్యమునుకూడ చెప్పెద వినుము. 1

శ్రీనృసింహుని దివ్యాలయమునకు పశ్చిమభాగమున భృగుతీర్థ మను పేరబరంగెడి యొక పుణ్యసరోవరముకలదు. అది పరమపవిత్రమై నృసింహునకు ప్రియమైనది. పూర్వకాలమందొకప్పుడు మంధరపర్వత పరిసరములందు స్వాయంభువమనువు ద్వాదశవార్షికసత్రము నారం భించెను. ఆయజ్ఞమునకు బ్రహ్మవాదులగు మహర్షులెందరో విజయము చేసిరి. వారలలో భృగువు అత్రి కణ్వుడు హారీతుడు విశ్వామిత్రుడు పరాశరుడు వసిష్ఠుడు కౌత్సుడు పులహుడు దక్షుడు వాత్స్యుడు మణీ చకుడు మార్కండేయుడు దుర్వాసుడు భరద్వాజుడు గోభిలుడు మాండ వ్యుడు జహ్నువు శాండిల్యుడు వామదేవుడు కాశ్యపుడు శాతాతపుడు అంగిరసుడు వ్యాసుడు మౌద్గల్యుడు చ్యవనుడు త్రిప్రాదుడు మొదలగు వారలు కలరు. వీరలందరును ధర్మక్షేత్రమగు నైమిశవనమున స్వాయం భువమనువుని మహాయజ్ఞమందు చేరియుండగా ఒకానొక శుభసమయ మున మహానుభావులగువారలయొక్క ప్రసంగమునందు త్రిమూర్తితత్త్వ మీమాంసప్రస్తుతమై త్రిమూర్తులని ప్రసిద్ధిజెందిన బ్రహ్మవిష్ణురుద్రులలో నెవ్వడు ఉత్తముడని నిర్ణయింపదలపడిరి. ఉత్తమత్వమును నిర్ణయిం చుటకు వలయు సౌలభ్యము సర్వశక్తిమత్త్వము వాత్సల్యము కరుణ క్షమ గాంభీర్యము ఔదార్యము ధైర్యము మొదలగు కల్యాణగుణము

ఏవం విధం దైవతం పై త్రిషు బ్రహ్మాదిషు స్ఫుటమ్
పరీక్ష్య సహసా సమ్యక్ తాదృశోఽపి పుమాన్ పరః ॥ 11

వక్తవ్యః పండితైః సత్యజ్ఞానానన్దాకృతిః కృతీ
భవేత్సర్వసహః సాక్షి సర్వభూతాంతరాత్మకః ॥ 12

ఏవం వదత్సు మునిషు భృగురుత్థాయ సత్వరమ్
ఆహామేవం విధం దైవం పరీక్షే త్రిషు మూర్తిషు ॥ 13

స గత్వా వేదయిష్యామీ త్యుక్త్వా తూర్ణం యయౌ తదా
సత్యలోకం చ గత్వైవ బ్రహ్మణః సదనం గతః ॥ 14

బ్రహ్మా తదానీం సదసి రత్నసింహాసనే స్థితః
బ్రహ్మర్షి మాగతం శ్రేష్ఠం మునినామగ్రతః స్థితమ్ ॥ 15

నాలోకయామాస తదా రజోగుణ విజృంభితః
శశాప సపది క్రుద్ధో భృగుస్తేనావమానితః ॥ 16

యతశ్చతుర్ముఖోఽసిత్వ మృషిమద్య సమాగతమ్
న పశ్యస్యాధిపత్యాద్వై రజోగుణ సమన్వితః ॥ 17

తతస్త్వామర్చయిష్యన్తి సద్విజాః పృధివీతలే
ఇతి శప్త్వా భృగుస్తూర్ణం కైలాసశిఖరం గతః ॥ 18

తత్రదివ్యమహారత్న మయస్య భవనస్యవై
మహేశస్య భృగుస్తస్థౌ ద్వారోపాన్తే నివారితః ॥ 19

నందినా సున్దరేణాద్య ద్వదనేన మహాత్మనా
ఆవేదకం హరే కంచిన్నాపశ్యత్తత్ర వై భృగుః ॥ 20

నావేదకః కశ్చిదభూ త్పార్వతీసహితస్య మే
తతశ్చుకోప భగవాన్ భృగుస్తూర్ణం శశాపతమ్ 21

రుద్ర త్వం దర్శనం మేఽద్య న దదాసి యతః పరమ్
భవేత్తతో మహాదేవ యోనిలింగాకృతి స్తవ ॥ 22

లన్నియు నెవ్వనియందుకలవో ఆతడే పురుషోత్తముడని గదావైదిక సమయసిద్ధాన్తము. (2-11)

బ్రహ విష్ణు రుద్రులలో కల్యాణగుణములు కలిగిన భగవానుని పరీక్షించి నిర్ణయించవలయునని మహర్షులు సంభాషించుకొనగా భృగు మునీంద్రుడు చివాలునలేచి మహర్షుల నాశ్వాసపరచుచు తానా నిర్ణయమునుచేసి చెప్పగలనని చెప్పి మొదలుగా బ్రహ్మదేవుని పరీక్షించుటకై సత్యలోకమునకేగెను. (12-14)

మహర్షి సత్యలోకమునకు విజయముచేసిన సమయమున చతుర్ముఖుడు తన సదస్సునందు రత్నసింహాసనమునందు సుఖాసీనుడై యుండి యభ్యాగతుడగు సదోమధ్యగతుడగు భృగువును గురుతించలేక పోయెను. బ్రహ్మరజోగుణముచే నభిభూతుడై తనను గారవింపకుండుటను సహింపని భృగువు అవమానతప్తుడై కోపించి చతుర్ముఖుని శపించెను. 16

నీవు చతుర్ముఖుండవయ్యు రజోగుణాభిభూతుడవగుట సదోమధ్యమందు నిన్నుచూడవచ్చిన నన్ను తెలిసికొనలేక పోతివి. ఆకారణముచే నిన్ను ఈభూమండలమునందు ద్విజులెవ్వరును సాకారుడుగ నారాధింపరు. ఇట్లని శపియించి రుద్రుని పరీక్షించుటకై కైలాసశిఖరమున కేగెను.

కైలాసశిఖరమున మహారత్న శిలానిర్మితమగు శంకరుని దివ్యసౌధమునకేగి ద్వారమందలి ద్వారపాలకునిచే అడ్డగింపబడిన భృగువు నిరాశుడై నిలచెను. ద్వారమున నామహర్షిని అడ్డగించినది ప్రమథగణ నిర్వాహకుడగు నందీశ్వరుడే. తనయొక్క ఆగమనమును గురించి ఈశ్వరునికి నివేదింపగలవానినెవ్వనిగాని కానక ముగ్ధుడైన భృగుముని కోపించినవాడై ఈశ్వరు నిట్లని శపించెను. ఓ రుద్రదేవా! నీదర్శనమునకై వచ్చిన నాకు దర్శనమీయక నిరాదరణ చేసితివి. నిరంతర విషయాసక్తుడవై యుంటివి. కావున నీశరీరము స్త్రీ-పురుష ప్రజననాంగచిహ్నము

లోకే త్వామర్చయిష్యన్తి బ్రాహ్మణా బ్రహ్మవాదినః
తుభ్యం నివేదితం యద్వై తదశుద్ధం భవిష్యతి ॥ 23

పత్రపుష్పాదికం యత్తు త్వద్భక్తై రర్చితం సదా
నిర్మాల్యమపవిత్రత్వాత్తదధార్యం భవిష్యతి ॥ 24

ఇతి శప్త్వా భృగుస్తత్ర పశ్యతో నందినస్తదా
పశుత్వం ప్రాప్నుహీత్యేవం నందినం చ శశాపహ ॥ 25

స జవేన జగామోచ్చైః క్షీరాబ్ధేర్మధ్య సంస్థితం
శ్వేతద్వీపం మహారత్నసంకులం సుమనోహరమ్ ॥ 26

తత్రవిష్ణోః సమాసాద్య దివ్యం ధామ సుభాస్వరమ్
న నిషిద్ధో ద్వారపాలైరన్తః సదనమాప్తవాన్ ॥ 27

లక్ష్మ్యా సహ హృషీకేశం రత్నపర్యం కశాయినమ్
పుండరీకవిశాలాక్షం నీలమేఘసమప్రభమ్ ॥ 28

కిరీటహార కేయూర కాంచీదామ విరాజితమ్
పూర్ణచంద్రాననం వల్గుహాసం చంపకనాసికమ్ ॥ 29

శ్రీవర్ణ కర్ణయుగలం కపోలచితదర్పణమ్
బింబాధరం కుందకోశరదనం స్వప్రకాశకమ్ ॥ 30

దరసుందర సద్గ్రీవం విశాలోరఃస్థలం మునిమ్
సింహమధ్య మహాభాహుం కోటిమన్మథసున్దరమ్ ॥ 31

పీతాంబరధరం దేవంవిష్ణుం వైకుంఠవాసినమ్
ఏవం విధం మహాత్మానం భృగుః దృష్ట్వా క్రుధాన్వితః ॥ 32

తస్యపాదేన సుదృఢం సుప్తస్య త్వరయా హరేః
వక్షస్యతాడయద్విష్ణుః మునినా తాడితో భృశమ్ ॥ 33

ఉత్థాయ ప్రణతో భూత్వా సన్నివేశ్యా సనోత్తమే
తమృషిం పూజయామాస హరిరర్ఘ్యాది పూర్వకమ్ ॥ 34

కలదై యొప్పుగాక. అట్లు విరూపమైన యోనిలింగాకృతియుతముగ నీరూపమును బ్రహ్మవాదులగు బ్రాహ్మణులర్చింతురు. నీకు నివేదనము చేయబడిన పదార్థము పవిత్రముగాక అపవిత్రమై పోవుగాక. అట్లే నీకు అర్పింపబడిన పత్రపుష్పఫలతోయాదినిర్మాల్యములును అపవిత్రములై యపరిగ్రాహ్యములగు గాక యని శపించి ద్వారమందలి నందినిగూడ పశుత్వము నొందుమనట్లు శపించెను. (17-25)

ఆపలకార్యవ్యగ్రుడగు భృగువు త్వరితుడై క్షీరసాగరమధ్యమందు దివ్యరత్న సంకులమగు శ్వేతద్వీపమున సూర్యకోటి సంకాశమగు లక్ష్మీపతియొక్క దివ్యధామమునకు పోయెను. అచ్చట రుద్రధామము నందువలె ద్వారపాలకులడ్డగింపక స్వాగతదానముచే యాదరించుట జేసి యవారితుడుగ భగవన్మందిరమును చేరగలిగెను. (26-27)

అచ్చటి దివ్యధామమున రత్నపర్యంకమందు హృషీకేశుడు నిత్యానపాయినియగు శ్రీమహాలక్ష్మితోసమేతుడై దర్శనమొసంగెను. భగవానుని దివ్యమంగళవిగ్రహమును భృగువు తనివిదీర నిట్లు సేవింప మొదలిడెను. తెల్లదామరలబోలి విశాలములగు నయనములును నీలమేఘముబోలి శ్యామలమగు శరీరకాంతియుకల్గి కిరీటము హారములు కేయూరములు కాంచీదామము మొదలగు దివ్యాభరణములచే అలంకృతమైనదియు పూర్ణచంద్రునిబోలి చిరునగవుచూపెడి ముఖమును చంపకపుష్పముబోలిన నాసికమును బింబఫలమునుబోలిన అధరమును శ్రీకారము వంటిచెవులును కుంభములబోలిన పలువరుసయు శంఖమునుబోలిన కంఠమును విశాలమగు వక్షఃప్రదేశమును సన్నని కటిమధ్యమును దీర్ఘములగు బాహువులును కలిగినదియుగ నాదివ్యమంగళవిగ్రహము సాక్షాత్కరించెను. (28-31)

ఇట్లు పీతాంబరధరుడగు వైకుంఠవాసుడు మౌనమువహించ క్రుద్ధుడౌ ఋషి తనపాదముచే భగవానుని యురమున గాఢముగ తన్నెను.

ప్రాంజలిః పురత స్తస్థౌ వినతో భృగుమబ్రవీత్
బ్రహ్మర్షే పావనతరం త్వత్పాదాంబుజసంగతమ్ ॥ 35

మన్యేఽమునా పూతతమం మదీయం విగ్రహం ధ్రువమ్
రక్షసాం యుద్ధసంఘాతకిణాఙ్కైః కర్కశస్య మే ॥ 36

వక్షసో మృదులాంఘ్రేస్తే పీడా స్యాదితి మేఽద్య భీః
తస్మాద్యదజ్ఞానకృతం తత్సర్వం క్షన్తుమర్హసి ॥ 37

ఇత్యుదీరితమాకర్ణ్య హరిణా భృగురుత్థితః
ప్రాంజలిః ప్రణతః స్థిత్వా ప్రహసన్నిదమబ్రవీత్ 38

అహో కారుణ్య సంపూర్తిరహో సత్త్వమహో క్షమా
అహో సౌలభ్యవాత్సల్యగాంభీర్యౌదార్యమార్దవమ్ ॥ 39

త్వాం వినా విద్యతే స్వామిన్ లోకేస్మిన్ పురుషో న హి
సర్వపాపహరం దేవం నారాయణ న సంశయః ॥ 40

తుభ్యం నివేదితం యద్వై తత్సర్వం పావనం స్మృతమ్
అశుద్ధం తద్విజానీయాత్తుభ్యం యదనివేదితమ్ ॥ 41

త్వదర్పితం చ మాల్యాది చందనం పావనం స్మృతమ్
ఇత్యుక్త్వా ప్రణిపత్యాశు నారాయణమనామయమ్ ॥ 42

ధ్యాత్వా ముహూర్తం హృత్పద్మే లక్ష్మీనాథం జగద్గురుమ్
తేనైవానుమతస్తూర్ణం హరిణా పాపహారిణా ॥ 43

యత్ర తే మునయః సన్తి సమాగత్య భృగుర్మునిః
తేభ్యో నివేదయామాస వృత్తాన్తం చానుపూర్వకమ్ 44

తతః ప్రభృతి లోకేస్మిన్ ఋషయో బ్రహ్మవాదినః
తమర్చయన్తి లోకేశం విష్ణుమేవ నిరన్తరమ్ 45

తతో మునిర్భృగుశ్చిత్తే చిన్తయామాస బుద్ధిమాన్
పాదేన తాడితో విష్ణోః దివ్యమంగళవిగ్రహః 46

భగవానుడును భృగుపాదాహతికి కినియక వినయముతో మహర్షిని నొక్కదివ్యాసనమున నుపవిష్టుంజేసి యర్ఘ్యపాద్యాదులగు వివిధోపచారములచే నాతనిన నునయించి చేతులుమోడ్చి కింకరుడై యెదుటనిలచి యిట్లని విన్నవించెను. 'ఓమౌనీంద్రా! పరమపావనమగు నీపాదపద్మము యొక్క సంబంధమువలన నేడు నాశరీరము పవిత్రతమమై కృతార్థమైనదనుట నిశ్చయము. నిరంతరముగ క్రూరులగు రాక్షసులతో యుద్ధముల వలన కలిగిన సంక్షోభమునందు కర్కశబాణపాతముచే కాయలుకాచిన నాయురమునుదాకి కోమలమగు నీపాదపద్మమున కెంతటి నొప్పికలిగి యుండునో! నాయజ్ఞానమువలన నీకు కోపముకల్గించి నిన్నాయాస పరచిన దోషమును క్షమింపుము' అని వేడెను. (32-38)

ఈ దీనాలాపములవినిన భృగువు ఆశ్చర్యచకితుడై భగవానునికి నమస్కరించి ప్రాంజలియై నిలిచి చిరునగవుతో నిట్లనియనెను. 39

ఆహా! ఎట్టికారుణ్యగుణ సంపూర్తి! ఎట్టి సత్త్వము! ఎట్టిఓర్పు! ఎట్టిసౌలభ్యము! ఎట్టివాత్సల్యము! ఎట్టి గాంభీర్యము! ఎట్టి ఔదార్యము! ఎట్టిమార్దవము! ఓస్వామీ! ఈలోకమందు నీకంటెఉత్తముడగు పురుషుడు వేరెవ్వడు! నీసాటివ్వడెవ్వడు కలడు? నీవుసమస్తపాపములను పోగొట్టగల ప్రభుడవు; నీవు లోకాధారుడవగు నారాయణుడవు. నీకు నివేదింపబడిన పదార్థమే పావనమైనది. నీకు నివేదితముగాని యేపదార్థముగాని అశుద్ధమైనది. నీకు సమర్పింపబడిన స్రక్చందనాదులు సర్వాదరణీయములు. అని వేవిధముల స్తుతించి నమస్కరించి ధ్యానయోగముచే జగద్గురుడగు శ్రీమన్నారాయణుని తనహృదయ కుహరమందాంతరదృష్టితో ననుభవించుచు భగవానునిచే అనుమతిజెందినవాడై పూర్వము తానువిడచి వచ్చిన మహర్షులు విడిసియుండిన ప్రదేశమునకు వచ్చి జరిగిన వృత్తాంతమును పూసగ్రుచ్చినట్లు భృగుమహర్షి తోడిమహర్షులకందరకును విశదముగ చెప్పెను. (39-44)

మౌఘాక్ష్యాన్మయా యత స్తస్మాత్సర్వపాపాలయో్యాస్మ్యహమ్
భృగురిత్యను త_ప్తస్సన్ సంప్రాప్యార్జుననిమ్నగామ్ 47
త_త్తీరే నరసింహస్య విమానచ్ఛాయయాఽన్వితే
విష్ణుమ_న్త్రం జపన్నిత్యం నిరాహారో జితేన్ద్రియః 48
దివ్యవర్ష సహస్రాణి తప స్తేపే సుదు_స్తరమ్
ఆవిరాసీ_త్తతో విష్ణుః శంఖచక్రగదాధరః 49
పీతాంబరీరపరతాంగః కౌ_స్తుభో ద్భాసితోదరః
వనమాలీ మహామాయీ మాయాదూరః పరాత్పరః 50
శేషశాయీ మహాభాగో భగవాన్ భూతభావనః
ఆవిర్భూతం తతో దృష్ట్వా విష్ణుం త్రైలోక్యనాయకమ్ 51
ఆనందాబుధిసంమగ్నః ప్రణనామ భృగు_స్తదా
ఉత్థాయ ప్రాంజలిః స్థిత్వా తుష్టావ శరశార్ఙ్గిణమ్ 52

దధ్యౌ పునః పునః శ్రీమత్పుండరీకనిభేక్షణమ్
విశ్వాత్మానం విశ్రుతోదారకీ_ర్తిం
విశ్వాధారం విశ్వతః శ్రోత్రపాదమ్
విశ్వేశానం విశ్వదేహం పురాణం
భావాతీతం తం వరేణ్యం నమామి ॥ 53

అన్యశ్చాసీదేక ఏవాఖిలాత్మా
నానారూప_స్త్వం పరం చాసహాయః
తస్మా_త్త్వం వై కారణం కార్యరూపం
సర్వేషాం త్వం వాచకానాం స వాచ్యః ॥ 54

సర్వస్య జంతోర్హృదిస_న్తమేవ
జాన_న్తి న త్వాం తవ మాయయాన్ధాః
కేచిద్విజాన_న్తి విశుద్ధః 55

ఆనాటనుండియు సంశయమునుపీడిన మహాఋషులును బ్రహ్మవాదులగు నితరులును శ్రీమహావిష్ణునే త్రిమూర్తులందుత్తమునిగ నిర్ణయించి ఆరాధించుచువచ్చిరి. 45

అంతట పశ్చాత్తప్తుడగు భృగువు భగవానుని తనపాదముతో తన్నిన యపచారమునకు పరితప్తుడై ఖాదిరీక్షేత్రమందలి యర్జున నదీతీరమందు శ్రీనరసింహమహాప్రభుని విమానచ్ఛాయందొక్క ప్రదేశమున అనేక దివ్యవర్షసహస్రకాలము భగవదపచారమునకు ప్రాయశ్చిత్తముగ వైష్ణవమంత్రమును నిరంతరముగ జపించుచు జితేంద్రియుడై నిరాహారుడై ఘోరమగు తపంబాచరించెను. ఆతపంబునకు తుష్టుడైన భగవానుడు శంఖచక్రగదాపాణియు పీతాంబరపరీతాంగుడును కౌస్తుభోద్భాసితవక్షంబుగలవాడును వనమాలియునై మహామాయియు మాయారూపుడును శేషశాయియు మహాభాగుడును భూతభావనుడునగు భగవానుడు సాక్షాత్కరింపగా త్రైలోక్యనాథుడగు శ్రీమహావిష్ణుని సందర్శించి భృగుమౌనీంద్రుడానందసాగర నిమగ్నుడై భగవానునెదుటసాగిలబడి సాష్టాంగముగ దండప్రణామంబులనేకమారులాచరించుచు బహువిధముల స్తుతియింప నారంభించెను. ఆస్తోత్రమును అనేకమారులావృత్తిచేసెను. ఓమహాత్మా నీవు విశ్వాత్మకుడవు. విశ్రుతమగు నౌదార్యముచే కీర్తిచెందినవాడవు. విశ్వమునకాధారమవు. విశ్వమే నీకు శ్రోత్రములును పాదములునై బరగువాడవు. విశ్వమును నీవు అంతఃప్రవిష్టుడవై శాసించెదవు. నీవువిశ్వరూపుడవు. పురాణపురుషుడవు. మానసమునకగోచరుడవు. నీవు వరిష్ఠుడవు. దాననిన్ను శరణము వేడెదను. (46-53)

నీవు అఖిలాత్మకుడవయ్యు అఖిలపదార్థములకు విలక్షణుడవై వేరైయుందువు. నీరూపమే ప్రపంచమంతయును. నీవు అసహాయుడవై ప్రపంచమును నిర్వాహముచేయుదువు. నీవేకారణరూపమును కార్యరూపమునైయుందువు. సర్వవాచకములకు నీవే వాచ్యమవు. 54

త్వం దృష్ట్వా ప్రలయే భ్రాన్తాన్ జడకల్పాన్ కృపాన్వితః
శరీరాది సమాయుక్తాన్ కృత్వైవం పునరేవ చ ॥ 56

సన్మార్గజ్ఞాపకాన్ వేదాన్ అసన్మార్గనివర్తకాన్
ప్రకాశయిత్వా స్వాతంత్ర్యం దత్వా తత్రోక్తకర్మసు 57

తేషాం ఫలప్రదస్త్వం వై విధివత్కర్మ కుర్వతామ్
ఏవం విధం పరాత్మానమగుణం సద్గుణాలయమ్ ॥ 58

అజ్ఞాత్వా మూఢధిషణాః త్వాం చ తాపత్రయాకులే
సంసారే నిపతన్త్యద్ధా జనాస్తే వై స్వచేష్టయా ॥ 59

భక్తియుక్తా జనాః కేచిత్త్వాం జ్ఞాత్వా సకలప్రదమ్
త్వత్ప్రసాదాద్ధృషీకేశ ఘోరసంసారబంధనాత్ ॥ 60

విముక్తాస్త్వత్పదం యాన్తి పునరావృత్తివర్జితమ్
తస్మాత్పరః సుహృత్స్వామీ పితా మాతా త్వమచ్యుత 61

త్వామేవ శరణం ప్రాప్తో గతిస్త్వం మే జనార్దన
ఇత్యుక్త్వా దీనయా వాచా పునరేవ భృగుస్తదా ॥ 62

పపాత దండవద్భూమౌ మునిం నిశ్చేష్టతాంగతమ్
సముద్ధాప్య తతో విష్ణుర్జగాద మునిపుంగవమ్ ॥ 63

వరం దదామి తేఽభీష్టముచ్యతామితి సాదరమ్
ఇత్యేవముక్తః స భృగుః ప్రోవాచ మునిపుంగవః ॥ 64

త్వత్పాదభక్తిం సతతం దేహి మే పురుషోత్తమ
నాన్యద్వరం తు కాంక్షేఽహం త్వత్పాదస్మరణం వినా ॥ 65

తపసః కారణం వక్ష్యే మురాన్తక జనార్దన
పాదేన తాడితో యస్తే దివ్యమంగలవిగ్రహః ॥ 66

తస్మాదస్మ్యపరాధానాం భాజనం మధుసూదన
మహాతాప్యనుతాపేన త్వాముద్దిశ్య జనార్దన ॥ 67

సమస్తప్రాణులయందును నీవు హృదయకుహరమందంతర్యామివై జాగరూకుడవైయున్నను నీమాయచే ముగ్ధులగు ప్రాకృతజనులు నీసత్తనెరుంగజాలకున్నారు. శుద్ధసత్త్వసంపన్నులగు మహానుభావులు లక్షకు కోటికి యెవ్వరో ఒక్కరు నీయనుగ్రహముచే ప్రబుద్ధులై ధ్యానసమాధులందు నిన్నే నీనిజస్వరూపమును తెలియగలుగుచున్నారు. 55

మహాప్రలయకాలమందు స్థావరజంగమములు నష్టములై చేతనులు కరణకళేబరములను విడచి అచేతనప్రాయులై యుండ వారలయందు పరమకృపచే పునః సృష్టిని సంకల్పించి అచిదవిశిష్టములగు నాచేతనులకు శరీరములను సంకల్పించి వారలు మంచిచెడ్డలను తెలిసికొని ధర్మానుష్ఠానపరులై తరించుటకై వేదశాస్త్రములను ప్రవర్తింపజేసి యాచేతనులు కర్మానుష్ఠానము చేయుటకు వలయు స్వాతంత్ర్యమును వారలకొసంగి వారికర్మానుష్ఠానము వ్యాజముగ జేసికొని విహితకర్మానుష్ఠానపరులకు నీవు శుభఫలప్రదాతవై వెలయుచుందువు. ఇట్లు మహోపకారమొనరించి తరింపజేయు నీమహిమమును యెరుగజాలని మూఢమతులగు మానవులు దురస్తమగు నీసంసారమున విషయప్రవణమగు చిత్తవృత్తికలవారలై అందేపడుచులేచుచు అహంకారహతులై జననమరణములకు నిరంతరవశులోనై నశించెదరు. (56-59)

నీయనుగ్రహముచే నీపాదపద్మములయందు భక్తిని అలవరచికొనినమహానుభావులు మాత్రము విషమమగు నీసంసారబంధమునుండి విముక్తులరై పునరావృత్తిరహితమగు నీపరమపదమును పొందెదరు. నీవు మోక్షప్రదుడవగుటచే భక్తకోటులకు స్నేహితుడవు తండ్రివి తల్లివి యునై యున్నావు. ఓఅచ్యుతా నిన్నే నేను శరణమునొందితిని. ఓజనార్దనా! నీవు నాకు గమ్యస్థానమవు అని పొరలుచు గద్గదమగు కంఠముతో మరి మరి వేడుచు సాష్టాంగముగ భూమియందు వ్రాలెను.

తపస్తప్తం మహాఘోరం ధ్యాత్వా త్వాం లోకపావనమ్
శరణాగతగోప్తారం ప్రణిపాతప్రసాదకమ్ ॥ 68

తస్మాద్దాసకృతం స్వామిన్ అపరాధం మహత్తరమ్
క్షమస్వ కరుణాపూర్వం వాత్సల్యజలధేఽచ్యుత ॥ 69

ఇత్యుక్తస్తేన భృగుణా పునః ప్రోవాచ మాధవః
తిర్యగూర్ధ్వమధశ్చైతన్మయా వ్యాప్తమిదం జగత్ ॥ 70

వస్తుమాత్రం హి మాం విద్ధి మద్వినా నాస్తి కించన
పాదేన తాడితం యత్తు న పక్తవ్యం త్వయాఽధునా ॥ 71

తస్మాన్నాస్త్యపరాధానాం సంచయస్త్వయ్యసంశయః
మద్భక్తోఽసి మునిశ్రేష్ఠ తస్మాత్త్వం నిర్భయో భవ ॥ 72

అపరాధసహస్రం వై జ్ఞానతోఽజ్ఞానతః కృతమ్
క్షమామి సతతం యస్మాన్మద్భక్తానాం న సంశయః ॥ 73

తతో భృగుర్మునిశ్రేష్ఠో భగవన్తమువాచ హ
జనార్దన మహాయోగిన్ విజ్ఞాపనమిదం శృణు ॥ 74

సదా త్వద్దర్శనం మేఽస్తు త్వదర్చా చ విశేషతః
త్వత్పాదసలిలం చాపి త్వద్భక్తిః త్వత్కథాశ్రవః ॥ 75

ఇత్యేవం భాషమాణం తమబ్రవీన్నృహరిర్మునిమ్
హృష్టరోమా మహాబాహుః వినయేన సమన్వితమ్ ॥ 76

తవ ప్రతికృతిం మేఽద్య దధామి మునిపుంగవ
శ్రీభూమిసహితా యా తాం గృహాణ త్వం మహామునే ॥ 77

వసన్తసమయే యత్త్వం మదర్చామిచ్ఛసి స్వయమ్
తతో వసన్తనాథేతి మాధవేతి జనార్దనః ॥ 78

పరవశుడగు మునిని కటాక్షించిన భగవానుడు మహర్షి నాశ్వాసించి లేవదీసి ఇట్లనెను. (59-63)

'ఓమునీంద్రా! నీతపస్సుకు మెచ్చితిని. నీకు వలయుకోరికెను చెప్పుము. వలయువరము నీయువాడ' నని సాదరముగపలికిన భగవానుని జూచి మహర్షి వినయావనతుడై ఇట్లనెను. 64

'ఓపురుషోత్తమా! నాకు వేరువరమక్కరలేదు. నిరంతరము నీ పాదభక్తి నాయందు తరుగకుండ నుండునట్లు అనుగ్రహింపుము. నీపాదస్మరణముకంటె నాకు కావలసిన వరము వేరొకటియుండదు. 65

ఓమురారీ! జనార్దనా! నేను తపముచేయుటకు కారణమును విజ్ఞాపించెదను. నీదివ్యమంగళవిగ్రహమును అజ్ఞానినై నాకఠోరపాదముతో తన్నితిని. ఆయసహ్యాపచారము నామనసును దహించుచున్నది. అట్టి యపచారమునకు నేను పాత్రమైతిని. ఈయపచారమునకు ప్రాయశ్చిత్తముగ నేనీతపమాచరించితిని. లోకపావనుడవగు నీయనుగ్రహము నుద్దేశించి నాపాపోపశమనమునకై తపమాచరించితిని. నీవుశరణాగత రక్షకుడ వగుటచే ఆయాశతో నిన్ను శరణముచెందుటుపాయము తపంబని నేను తలచితిని. నీవు ప్రణిపాతులకు ప్రసన్నుడవని నేను వింటిని. దాసుడనగు నాయపచారమును నీవు క్షమింపగలవు. హే అచ్యుతా! నీవువాత్సల్య జలధివి. నాయపరాధములను క్షమింపుము' అనివేడెను. 69

ఇట్లని ప్రార్థించెడి భృగుమునుజూచిన మాధవుడు 'ఓ మునీంద్రా! నాచే సకలదిక్కులు వ్యాపించబడినవి. నాచే వ్యాపింపబడని పదార్థమొక్క యణువైనను ఉండదు. నీపాదముచే నావక్షంబును తన్నుట యననేమి? నేనువ్యాపించని ప్రదేశముకలదా? నీవునాయందుచేసిన అపచారము యెద్దియులేదు. నీవునాయందు భక్తిప్రవణమగు మనముగల్గినవాడవగుటచే నీకెట్టిభయమునులేదు. ఒక్కయపచారముకాదు. నాభక్తులొనరించెడి

ఇతి ప్రథా చ లోకేఽస్మిన్ కలావిహ యుగే మునే
అస్త్వితి త్యక్త్వా హరి స్సప్తకార్తస్వర విభూషితః ॥ 79

నవరత్నసమాయుక్తాం మంజుచిత్రోపరంజితామ్
మంజూషామష్టచక్రాం తాం సార్చారూపశిలాయుతామ్ 80

దివ్యసుందరరూపాం చ ప్రతిమాత్రయసంయుతామ్
దత్వా తస్మై స మునయే భృగవే భగవాన్ హరిః 81

యస్యాస్తీరే తపస్సమ్యక్ సరిత స్సాధితం మునేః
భృగుతీర్థమితి ఖ్యాతం తీర్థమేతత్ భవిష్యతి 82

ఇత్యేవముక్త్వా భగవాన్ విష్ణురన్తర్దధే మునే
భృగు స్తతో హృష్టమనాః తాం గృహీత్వా చ విష్ణునా 83

ప్రదత్తాం తు మహాభాగః స్వాశ్రమం ప్రాప్తవాన్ భృశమ్
ఛాత్రైరనేకైః సంసేవ్యః శుద్ధసత్త్వగుణైర్వృతః 84

యే విష్ణోరపకుర్వన్తి మహాత్మానోఽపి యే నరాః
తే సర్వే భృగుతీర్థేఽస్మిన్ యుజ్యన్తే స్నానతః శుభైః 85

దేవక్షే భృగుతీర్థేఽస్మిన్ పితౄణాం తిలతర్పణమ్
పిండదానం ప్రశస్తం స్యాత్త్రేతకార్యం విశేషతః 86

విప్రాయ యో దదాత్యస్మిన్ తిలాన్ ప్రసృతిమాత్రకాన్
తిలపర్వతదానస్య యత్ఫలం తత్సమాప్నుయాత్ 87

యత్రైకో దీయతే ధేనుః విప్రాయ కులశీలినే
సర్వత్రాలంకృతం తేన దత్తం స్యాద్గోసహస్రకమ్ 88

ఇతి భృగుమునితీర్థవైభవం యో
భృగుమహితేన యుతం శృణోతి మర్త్యః

లక్షలాది యపచారములనుకూడ నేను క్షమియింతును. అది నాస్వభావము, స్వరూపమును. సంశయింపవద్దు'. (70-72)

అంతట నిర్భయుడగు భృగువు భగవంతునకిట్లని విజ్ఞాపించెను. ఓజనార్దనా! మహాయోగీశ్వరా! సంతతము నిన్ను నేను దర్శించుట కనుకూలముగ నీయర్చాబింబము నాకు కావలయును. ఆదివ్యమంగళ విగ్రహము నారాధించి తత్పాద్యసలిలమును నేను స్వీకరించి తరింతును. నీభక్తినే నీకథలను నేను వినునట్లనుగ్రహింపుము'. (73-75)

ఇట్లని ప్రార్థించెడి మహర్షియందు కరుణించిన భగవానుడు పరమప్రీతియుతుడై 'ఓమునివర్యా! నీవుకోరిన రీతిగ నాయర్చావిగ్రహమును నీకనుగ్రహింతును. ఇదిగో శ్రీదేవితోడను భూమిదేవితోడను కూడిన నాదివ్యమంగళవిగ్రహము. దీనిని నీవు ఆరాధింపుము. (76-77)

నీవు నన్ను సాక్షాత్కారమునొందినది వసంతకాలమగుటచే ఈకలియుగాంతముపరకు నేను నీకుసాక్షాత్కరించిన ఈదివ్యరూపమునకు వసంతనాథుడనియు మాధవుడనియు పేరు ప్రసిద్ధియందుండును'. అని యనుగ్రహించిన హరి పుటపాకపరిష్కృతమగు మేలిమిబంగారముచే నిర్మితమగు భూషణములచే యలంకృతుడై తన దివ్యమహిషులచే పరివృతుడై యెనిమిదిచక్రములతోగూడిన యొక్క యపూర్వమగు పెట్టెలో ప్రవేశించి ఆపెట్టెను మహర్షిచేతికిచ్చి యాపెట్టెను తెరచి అందలి మూడు దివ్యమంగళవిగ్రహములను నిత్యమారాధించు కొనుచుండుమని యనుగ్రహించి భగవానుడు మహర్షికి ప్రత్యక్షమై తన యర్చాబింబములనిచ్చిన కారణమున నానదీతీరమందలి సరోవరమునకు భృగుతీర్థమను వ్యవహారముకల్గి అట్లే ప్రసిద్ధిజెందుగాక యనిచెప్పి యంతర్హితుడాయెను. (78-81)

మధురిపురిహ తస్య చాపవర్గం
సుఖమపి దాస్యతి నిశ్చలాం చ కీర్తిమ్ 89

యః పుమాన్ భువి సద్భక్త్యా పఠత్యేకమనాః పరమ్
ఏతన్మాహాత్మ్యమత్యర్థం చిరాయురారోగ్యమాప్నుయాత్ 90

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఖాద్రీమాహాత్మ్యే
భృగుతీర్థవైభవవర్ణనం షష్ఠోऽధ్యాయః

అంతట భృగువు సంతుష్టుడై యాపెట్టెను మహాప్రసాదముగ స్వీకరించినవాడై తనయాశ్రమమునకుచేరి సుఖముండెను. ఈవిశేష మును తెలిసికొనిన మహర్షియొక్క శిష్యులును పలువురు మహాభాగ్య మని మహర్షిని పరివారించి భగవదారాధనమునందు పాల్గొనిరి.

ఇచ్చటి శ్రీమహావిష్ణుని యర్చాబింబమును సందర్శించెడి వారలును ఈభృగుతీర్థమందు భక్తియుక్తులై స్నానమాచరించెడి వారలును సకల శుభములను పొందుదురు. 85

దేవర్షియగు భృగుమహర్షిచే ప్రవర్తింపబడి వారిదివ్యనామ ముచే ప్రసిద్ధమగు ఈపుణ్యతీర్థమందు స్నానముచేయుట పితరులనుద్దేశించి తిలతర్పణముచేయుట ఈప్రదేశమందు మృతిజెందినవారల నుద్దేశించి ప్రేతకార్యములజేయుట మంచిది. కృశవృత్తులగు విప్రశ్రేష్ఠులకు చారె డైనను తిలలను దానముచేయుట తిలపర్వతదానముచేసిన ఫలమునిచ్చును కులశీలవృత్తిసంపన్నుడగు బ్రాహ్మణశ్రేష్ఠునకీక్షేత్రమందు గోదానము చేయుట ప్రశస్తము ఒక్కగోదానముచేసిన ఫలము క్షేత్రాంతరమందు స్వర్ణశృంగాద్యలంకృతగోసహస్రదానముచేసిన ఫలమునకుగూడ నతి శయించును. (83-88)

ఇట్లని భృగుతీర్థమాహాత్మ్యమును విశదముగ తెల్పియువారలకు శ్రియఃపతియై మాలౌకిక పారలౌకిక సంపదలనన్నిటిని అపారితముగ ననుగ్రహించును. ఈమాహాత్మ్యమును శ్రద్ధాభక్తులతో పఠియుంచు వారలకాయురారోగ్యసంపదలు సంపదలు సిద్ధించును. (89-90)

ఇది శ్రీబ్రహ్మాండ పురాణమున భృగుతీర్థ వైభవవర్ణనము ఖాదిరీమాహాత్మ్య గ్రంథమునందలి ఆరవయధ్యాయము.

శ్రీ నృసింహాయ నమః

అథ సప్తమోऽధ్యాయః

శ్రీశంకర ఉవాచ:-

ఉత్తరే నృహరేర్ధామ్నః శ్రీతీర్థం పావనం స్మృతమ్
సర్వకామప్రదం నృణామస్తి తద్వర్ణ్యతేऽధునా 1

చంపకాశోకమన్దారైః క్రముకైస్తిలకద్రుమైః
నాలికేరైశ్చ పున్నాగైరంకోలైశ్చ ప్రియాలకైః 2

కర్ణికారైః కురవకైః మాకందైః పనసైరపి
సిందువారైస్తమాలైః శ్రీద్రుమైః కుబ్జకేసరైః 3

కింశుకైః సప్తపర్ణైశ్చ నారంగైః కుందతిందుకైః
ఏవమాద్యైః బహువిధైః శ్రీతీర్థం వేష్టితం ద్రుమైః 4

సర్వర్తుపుష్పశబలైః మాలతీమల్లికాదిభిః
కుందమందారసురభిద్రుమైః కాంచనభూరుహైః 5

విరాజితం తత్తటేషు చంచద్బాణాసనార్జునైః
కల్హారేన్దీవరాంభోజైరామోదితమహోచ్ఛ్రకైః 6

తత్తీర్థం పావనతరం లక్ష్మీప్రీతికరం మునే
నరసింహః శ్రియా సార్ధం తత్తీరే జలకేలికామ్ 7

ఆతనోతి సుగంధాఢ్యే మందవాయుచలోర్మికే
తస్మిన్ లక్ష్మీః మహాభాగా సాన్నిధ్యం కురుతే మునే 8

సర్వసంపత్కరం నృణాం శ్రీతీర్థమితి కీర్తితమ్
శ్రీతీర్థే విధివత్స్నాత్వా శ్రియమభ్యర్చ్య మానవః 9

గోభూహిరణ్యదానాని వాసాంసి వివిధాని చ
భూషణాని విచిత్రాణి యస్తు భక్త్యా ప్రయచ్ఛతి 10

శ్రీనృసింహాయ నమః

## ఏడవ యధ్యాయము.

శంకరుడు చెప్పుచున్నాడు.

ఓ నారదా! భగవానుని దివ్యాలయమునకు ఉత్తరభాగమందు సర్వకామప్రదమగు శ్రీతీర్థము కలదు. చంపకములు అశోకములు మందారములు క్రముకములు తిలకములు నాళికేరళములు పున్నాగములు అంకోలములు ప్రియాలములు వర్ణికారములు కురవకములు మాకందములు పనసలు సింధువారములు తమాలములు శ్రీద్రుమములు కుటజములు కేసరములు కింశుకములు సప్తపర్ణములు నారంగములు కుందములు తింధుకములు మొదలగు బహువిధములగు వృక్షరాజములచే నీ శ్రీతీర్థము పరివృతమై యున్నది. సకలఋతువులందును పుష్కలముగా పుష్పించెడి మాలతీమల్లీకుందమందారకాంచనభూరుహములచే నీ సరిత్తటము పరిష్కరింపబడియున్నది. వికసించెడి బాణవృక్షములు అర్జున వృక్షములెన్నియో అచ్చట కలవు. తెల్లకలువలు యెఱ్ఱకలువలు తామరలాదిగాగల పుణ్యపుష్పములీతీర్థమందు కలవు. ఆపుష్పములతావి దశదిశలు ప్రసరించును. ఇట్టి కారణములచే నీతీర్థము శ్రీమహాలక్ష్మికత్యంతము ప్రీతిసంజననమై యున్నది. మహాలక్ష్మికి ప్రియకరమగుటచే నాయమతోకూడి శ్రీనారసింహప్రభువు సర్వకాలములందును ఈసరోవరమున జలక్రీడాసుఖము ననుభవించుచుండును. ఈదివ్యసరోవరమందు శ్రీమహాలక్ష్మి నిత్యసాన్నిధ్యము జెందియుండును. (1-8)

సర్వసంపదలనిచ్చుటచేగూడ నీతీర్థమునకుశ్రీతీర్థమను వ్యవహారమొప్పియున్నది. ఈసరోవరతీరమందు గోభూహిరణ్యాదానములు వస్త్రాభరణదానములు మొదలగు దానములను భక్తితో బ్రాహ్మణశ్రేష్ఠుల

అతులాం శ్రియమాప్నోతి ఇహ లోకే పరత్ర చ
అనపత్యో నరస్స్నాయాదస్మిన్ తీర్థే శుభావహే 11
ధ్యాయన్ లక్ష్మీమవాప్నోతి వత్సరాన్తే సుతం వరమ్
లక్ష్మీర్దిశతి సర్వస్మిన్ కాలే తస్య సుసంపదమ్ 12
లక్ష్మీతీర్థం వర్ణితం యత్ర భవ్యం
లక్ష్మీం ధ్యాత్వా స్నాయినో పుణ్యభాజామ్
నృణాం సంపద్వర్ధతే శశ్వదగ్ర్యా
గంగాతీర్థం వర్ణ్యతే శృణ్వదానీమ్ 13

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఘాద్రీమాహాత్మ్యే
శ్రీతీర్థ కథనం నామ సప్తమోఽధ్యాయః

కొనంగు వారలకు మితిలేని శ్రేయస్సును ఈలోకమునందును పరలోకము నందునుగూడ మహాలక్ష్మియనుగ్రహించును. శ్రీమహాలక్ష్మిని మనసున భక్తిపురస్సరముగ ధ్యానించుచు శుభాశ్రయమగు నీసరోవరమున స్నానముచేయు ననపత్యునకు ఒక్కసంవత్సరకాలమునకు వంశవర్ధను డగు సత్పుత్రుడు జన్మించును. ఎల్లకాలమునను ఎల్లయెడలను శ్రీమహాలక్ష్మి అట్టిభక్తునకు సకలసంపదలననుగ్రహించును. (9-12)

లక్ష్మీప్రదమగు లక్ష్మీతీర్థవైభవము నిప్పుడుచెప్పితిని. గంగాతీర్థ వైభవమును చెప్పెదవినుమని శంకరుడు లక్ష్మీతీర్థమాహాత్మ్యవర్ణనమును పసంహరించెను,

ఇది శ్రీబ్రహ్మాండ పురాణమున శ్రీతీర్థ వైభవ కథనమనునది
ఖాదిరీ మాహాత్మ్య గ్రంథమునందలి ఏడవయధ్యాయము.

శ్రీ నృసింహాయ నమః

## అథాష్టమోఽధ్యాయః

శ్రీశంకర ఉవాచ:-

విమానాదగ్నిదిగ్భాగే గంగాతీర్థమితి స్మృతమ్
యత్రోపదిష్టవాన్ వేదాన్ శిష్యేభ్యో బాదరాయణః ॥ 1

తత్తీర్థస్య చ మాహాత్మ్యం వక్ష్యేఽహం మునిపుంగవ
ద్వాపరస్య యుగస్యాన్తే వేదమార్గే ఖిలీకృతే ॥ 2

సందిగ్ధమతయో దేవా బ్రహ్మాద్యా మునయస్తథా
క్షీరాబ్ధేరుత్తరం తీరం గత్వా తుష్టువురచ్యుతమ్ ॥ 3

ఆవిర్భూతోఽథ భగవాన్ ప్రాహ దేవానిదం వచః
విదితం మే సురగణా భవదాగమకారణమ్ ॥ 4

ప్రవర్తనాయ వేదానాం ఖిలానాం సంగ్రహాయ చ
అహం ప్రాదుర్భవిష్యామి సత్యవత్యాం పరాశరాత్ ॥ 5

ఇత్యుక్త్వాన్తర్దధే విష్ణుః జగ్ముర్దేవా యథాగతమ్
తథైవావిరభూత్కాలే కృష్ణద్వైపాయనో మునిః ॥ 6

బోధాయనాద్యైర్మునిభిః సహితో బదరీవనే
వేదాన్ వ్యస్తాన్ సమస్తాంశ్చ చకార మునిపుంగవః ॥ 7

శిష్యేభ్యోఽధ్యాపయామాస శతశోఽథ సహస్రధా
పురాణసంహితాశ్చైవ సూతాయ ప్రదదౌ మునిః ॥ 8

అత్రాన్తరే హి దైతేయాన్ మునివేషసమాకృతీన్
ఆగతాన్ భగవాన్ వ్యాసః శ్రుతీనాం గ్రహణాయ వై ॥ 9

తాన్ వంచయిత్వా మతిమాన్ కృష్ణద్వైపాయనో మునిః
తత ఆగత్య గూఢం వై దేవేభ్యోఽజ్ఞాననిమ్నగామ్ ॥ 10

శ్రీ నృసింహాయ నమః

## ఎనిమిదవ అధ్యాయము.

శంకరుడు చెప్పుచున్నాడు.

శ్రీభగవానుని దివ్యాలయమున కగ్నిదిశను [illegible]గాతీర్థమను పేరిట నొకసరోవరము కలదు. ఈసరోవరతీరమున వ్యాసభగవానుడు తనశిష్యులకు వేదాధ్యయనము చెప్పెను. ఆతీర్థముయొక్క మహత్త్వమును నేను నీకుపదేశింతును వినుము. ఒకానొక ద్వాపరయుగముయొక్క యవసానమందు వేదమార్గము కృశించగా దేవతలు సంశయావిష్టులై బ్రహ్మను పురస్కరించికొని సర్వశక్తుడగు శ్రీమహావిష్ణుని వెదకికొని క్షీరసాగరమునకు ఉత్తరపార్శ్వమునకు చనిరి. (1-3)

భక్తరక్షకుడగు భగవానుడు వారలరాకను తెలిసికొని దేవతల నుద్దేశించి 'ఓదేవతలారా! మీరలు వచ్చినగతమును నేనెరింగితిని. ఖిలములగు వేదములనుద్ధరించి పూర్వమువలె వానిని తదుక్తధర్మములను ప్రవర్తింపజేయుటకై మీరు నాసాయమును కోరి వచ్చితిరి. అనతిచిరముగ నేను దాశకన్యయగు సత్యవతియందు పరాశరమౌనీంద్రుని తేజమువలన వ్యాసరూపినై యవతరించగలను, అనిచెప్పి యప్పటినే అంతర్ధానము నందగా దేవతలు తుష్టులై తమ తమ నెలవులకేగిరి. అట్లే సకాలమున భగవానుడు తనప్రతిజ్ఞను పూర్తిగావించి కృష్ణద్వైపాయనుడను నన్వర్థనామముచే యవతరించి వృద్ధిజెందెను. (4-6)

ఆపల జైమిని మొదలుగాగల శిష్యబృందము తననమసరించిరాగా కృష్ణద్వైపాయనులు సమస్తములగు వేదములను అధికారానుగుణము ను సుబోధముగను ఉండుటకై నాలుగుగా విభజించి వేనవేలుసంఖ్యగ

ప్రాప్యేమం దేశమాసాద్య సుస్థితః సర్వపావనమ్
అత్రోపదిష్టవాన్ వేదాన్ సరహస్యాన్ యథోచితాన్ 11
తతః ప్రధావాద్వ్యాసస్య వ్యోమగంగా సమంచితా
ప్రవిశ్య తత్ర గూఢం వై నిర్గచ్ఛతి చ భూతలాత్ 12
సౌమ్యగంగాజలం తత్ర వేదారణ్యమహీతలే
వ్యాసస్యానుగ్రహాదేవ దృశ్యతేఽద్యాపి పావనమ్ 13
అస్మిన్ గుహ్యతమే క్షేత్రే కృష్ణద్వైపాయనో మునిః
శిష్యేభ్యః ప్రోక్తవాన్ వేదాన్ సరహస్యాన్ సహాగమాన్ 14
తస్మాత్పుణ్యతమం క్షేత్రం వ్యోమగంగాజలాప్లుతమ్
వేదారణ్యమితి ఖ్యాతం విద్ధి శ్రేష్ఠతమం మునే 15
ఉపదిష్టాస్తథా మన్త్రాః రహస్యాని చ భూతలే
నిర్విఘ్నేన ప్రసిద్ధ్యన్తి శీఘ్రమేవ న సంశయః 16
కశ్యపస్య పురా భార్యా వినతా నామ సువ్రతా
పుత్రార్థినీ స్వభర్తారం ప్రోవాచేతి రహో మునిమ్ 17
పుత్రో మే లప్స్యతే యస్మాద్విష్ణుతుల్యపరాక్రమః
తద్వదస్వేతి భర్తారం వినతా ప్రాహ సువ్రతా 18
ఉక్తస్తయేత్థమవదత్కశ్యపోఽథ ప్రజాపతిః
సాధు పృష్టం హి సుశ్రోణి తథైవ ప్రాప్స్యసి ప్రియే 19
తేజస్వీ సత్త్వవాన్ పుత్రో విష్ణుతుల్యపరాక్రమః
కిం తు త్వయైవమధునా కార్యం పంకజలోచనే 20
విష్ణుమన్త్రం గృహీత్వా తు త్వం రహో గచ్ఛ భూభృతమ్
స్తోత్రాద్రిరితి విఖ్యాతో విష్ణుపాదాంకితోఽహి యః 21
తస్మిన్ పశ్చిమదిగ్భాగే వనషండవిరాజితే
పద్మకల్హారగర్భాఢ్యా విద్యతే విమలా నదీ 22

శిష్యుల కధ్యాపనముచేసెను. అట్లే అష్టాదశ మహాపురాణములను అష్టాదశ ఉపపురాణములను సూతపౌరాణికున కుపదేశించెను. (7-8)

ఆసమయమున నసురులు కొంతమంది మాయామునివేషమును ధరించి వైదికధర్మములనుపదేశమందుటకై వ్యాసుని వంచింపవచ్చుటను దివ్యదృష్టిచే జూచిన వేదవ్యాసుడు వారల మాయలకు లోనుగాకుండుటకై తానును మాయావేషధారియై ఖాదిరీక్షేత్రమునకు విజయముచేసి పావనతమమగు నర్జున నిమ్నగయొక్క తీరమందు వాసమేర్పరచుకుని యచ్చట వసియించుచు యథాప్రకారము శిష్యసంతతిని అధ్యాపనముచేయుచుండెను. (9-11)

వ్యాసభగవానుడు హిమవత్పర్వతమునుండి ఖాదిరీక్షేత్రమునకు వచ్చుటచే వారియందలి భక్త్యతిశయముచే గంగానదియు గూఢవాహినియై వేదారణ్యమను ఖాదిరీక్షేత్రమున ప్రత్యక్షమై భగవద్వ్యాసుని యనుగ్రహముచే నేటికిని మనబోటులను పవిత్రముచేయుచు వచ్చుచున్నది. (12-13)

ఈక్షేత్రమందే వ్యాసుడు శిష్యులకు వేదరహస్యముల నుపదేశించెను. 14

ఈనదీపరిసరమందలి వనప్రదేశమే వేదారణ్యమని వ్యవహరింపబడి సర్వకామఫలప్రదమై యొప్పుచున్నది. 15

ఈవేదారణ్యమున నుపదేశింపబడియెడి రహస్య మంత్రోపదేశములు వీర్యవత్తరములై సాధకులకు శీఘ్రకాలములో సిద్ధినిచ్చుచున్నవి. పూర్వకాలమందు కశ్యపప్రజాపతికి పతివ్రతాలలామమగు వినతయను భార్యకలదు. ఆమె పుత్రార్థినియై భర్తకు తనయభీష్టమును నివేదించుచు తనకు విష్ణుతుల్యపరాక్రమసంపన్నుడగు పుత్రునను గ్రహింపుమని వేడెను.

కశ్యపుడు వినతనాశ్వాసముజేసి 'ఓ పతివ్రతాలలామమా! నీకు తేజస్సంపన్నుడును బలసంపన్నుడును విష్ణువుతో తుల్యమగు పరాక్రమము

తత్తీరం త్వం సమాసాద్య విష్ణుమన్త్రం జపానఘే
తతః ప్రసన్నో భగవాన్ ప్రదాస్యతి తవేప్సితమ్ 23

ఇత్యుక్తా వినతా తేన కశ్యపేన మహర్షిణా
విష్ణుమన్త్రం తతః ప్రాప్య క్షేత్రేఽస్మిన్ తపసి స్థితా 24

అచిరేణైవ కాలేన ప్రసన్నోఽభూద్గదాధరః
ఉవాచ వినతాం వాచం వాంఛితం ప్రియతామితి 25

ప్రణమ్య వినతా స్తుత్వా నమ్రా వచనమబ్రవీత్
త్వయి కామదుఘే సాక్షాద్దృష్టే కిం దుర్లభం మమ 26

అహం త్వత్సదృశం పుత్రమిచ్ఛామీతరదుర్లభమ్
భర్త్రాజ్ఞయా కాంక్షమాణా త్వద్భక్త్యా తపసి స్థితా 27

మత్కాంక్షితమిదం వేత్తి సర్వజ్ఞోఽసి యతో భవాన్
శ్రుత్వేతి వినతావాక్యం జగాద గరుడధ్వజః 28

మత్కల్పః తనయః కాలే భవిష్యతి తవానఘే
ఇత్యుక్త్వాఽన్తర్దధే విష్ణుః సర్వలోకేశ్వరో హరిః 29

సంప్రాప్య వినతా భర్తుః కశ్యపస్యాన్తికం తదా
సమ్యఙ్నివేద్య వృత్తాన్తం తం వై పరిచచార హ 30

తతోఽచిరేణ గరుడో జన్మ తస్యామవాప్తవాన్
తేజస్వీ బలవాన్ శూరః పవనాధికవేగవాన్ 31

దాసీత్వమోక్షణాయాశు స్వమాతుర్యత్నమాస్థితః
అమృతాహరణాయైవ సమాసక్తమతిర్బలీ 32

మాతుర్దాస్యవిమోక్షార్థం గత్వా చ త్రిదశాలయమ్
జిత్వా సురేన్ద్రప్రముఖాన్ సురానతి మహాజవః 33

ఆహృత్యామృతకుంభం వై సర్వం మాత్రే న్యవేదయత్
తతః ప్రీతిరభూత్పుత్రే సుధాం దృష్ట్వాఽతివిస్మితా 34

కలవాడునునగు పుత్రుడు జన్మించగలడు. నీవుఏకాన్తముగ స్తోత్రాద్రి యను ఖాదిరీక్షేత్రమునకేగి యచ్చట యష్టాక్షర మహామంత్రమును నియమముండి జపియింపుము. స్తోత్రాద్రియనునది విష్ణుపాదాంకితమగు దివ్యక్షేత్రము. విమలోదకపూరితమగు నదియచ్చటకలదు. (19-22)

ఆనదీతీరమునకు వెళ్ళి యచ్చట నియతవ్రతవై యష్టాక్షర మహా మంత్రమును జపియింపుము, అంతట తపస్సంతుష్టుడగు భగవానుని యనుగ్రహముచే నీకోరికె ఫలించును. 23

ఈ యుపదేశమున శ్రద్ధలో పరిపాలించిన వినతయు ఖాదిరీక్షేత్ర మునుజేరి శ్రీమహావిష్ణుని దివ్యతారకమంత్రమును నష్టాక్షరమును ఘోరతపముననుండి పురశ్చరణముచేసెను. వినతయొక్క తపస్సుచే సంతు ష్టుడై భగవానుడు అతిశీఘ్రమునవే ప్రసన్నుడై 'ఓ వినతా ! నీతపస్సుకు ప్రసన్నుడనైతిని. నీకోరికెను చెప్పు'మని యడిగెను. (24-25)

ఆమాటలువినిన వినతయు భగవానుని నమస్కరించి స్తోత్రము చేయుచు ఇట్లని తనయభీష్టమును చెప్పెను. ఓ మహానుభావా ! గదాధరా ! భక్తకల్పద్రుమమవగు నీవు ప్రసన్నుడవైనంతట నాకు కావలసినదేము న్నది, నాకేమికొరత, నీతో తుల్యుడగు పుత్రుడు కావలయునను నాశతో నేను తపంబాచరించితిని. ఈకోరికెయు తత్ఫలదానమును ఇతరులందు లభింపరానిది. ఈనాకోరికెను నాభర్తకు నివేదించి వారిదివ్యాజ్ఞను శిరసావహించి నేనీతపస్సున కారంభించితిని. నీవు సర్వజ్ఞుడవగుటచే నాకోరికెను నీవెరింగియే యున్నావు. నేను నిన్నిపుడు ప్రార్థించి నీవు తెలిసికొనదగిన విశేషములేమి కదా, అని కోరెను. వినతయొక్క వాక్యములను వినిన గరుడవాహనుడు సంతసించి "నాతో తుల్యుడగు పుత్రుడు సకాలమున నీకుదయింపగలడు, నీవు ధన్యురాలవు" అనిచెప్పి యంతర్హితుడాయెను. (26-29)

విముక్తాఽస్మి త్వయా దాస్యాదితి పుత్రమువాచ చ
తతః ప్రసన్నవదనో మాత్రా సార్ధం గృహం యయౌ 35
ఇంద్రోఽపి గూఢవృత్త్యైవ సమాగమ్య చ దానవాన్
వంచయిత్వా సుధాకుంభం జహారాఽశు సురాధిపః 36
త్వరయా స్వర్గలోకం వై స జగామ విహాయసా
అనన్యదుర్లభాం ప్రాప్తిం ప్రాప్య కౌతూహలాన్వితః 37
తతః పరమసన్తుష్టా వినతా సూనునా తదా
భగవద్ధ్యానసౌభాగ్యయుక్తా కాలమథాక్షిపత్ 38
యస్యాస్తీరే మహాభాగా వినతావినతాననా
విష్ణోః ప్రసాదాత్పుత్రం సా లబ్ధా సర్వగుణాన్వితమ్ 39
తత్రైవ యః పుమాన్వాపిఽపి నారీ వా సరసాత్మనా
స్నాత్వా విధివదభ్యర్చేత్తత్తీరే పక్షినాయకమ్ 40
అపుత్రః పుత్రవాన్ రోగీ నీరోగో భవతి ధ్రువమ్
సంపత్కామో దరిద్రోఽపి విద్యావాన్ భవతి ధ్రువమ్ 41
దినే దినే చ యః కుర్యాత్తత్తీర్థే స్నానముచ్చకైః
కుష్ఠరోగాద్విముచ్యేత సోఽపి తత్ర న సంశయః 42
వత్సరాన్తే విశుద్ధాత్మా తతః సారూప్యమాప్నుయాత్
గరుడస్య మహత్త్వేన విష్ణుదాసత్వమేవ చ 43
యస్మిన్ తీర్థే మహాపుణ్యే మంత్రం గారుత్మతం పుమాన్
సాంగన్యాసం విశుద్ధాత్మా జపేత్స్నాతా యథావిధి 44
తస్య స్వప్నే గరుత్మాన్వై ప్రసన్నో భవతి ధ్రువమ్
తస్మై చ వాంఛితం సౌమ్యో దదాతి కరుణాలయః 45
గోభూతిలహిరణ్యాది విప్రాయ శ్రుతశాలినే
యద్యద్దదాతి తత్తీర్థే తత్ కోటిగుణితం భవేత్ 46

భగవానునిచే వరమును పొందిన వినతయు భర్తయొక్క సన్నిధి కేగి జరిగిన వృత్తాంతమునంతను సవిస్తారముగ నివేదించి భర్తృపరిచర్య చేయుచుండెను. 30

అచిరకాలముననే వినత గర్భమును ధరించి తేజోబలసంపన్నుడగు గరుడుని కనెను. ఆతడు తేజోబలసమన్వితుడై శూరుడై వాయుదేవుని కంటె వేగముగలవాడై వృద్ధిజెందెను. తనతల్లికి కద్రువయను సవతిచే కల్గిన పరిభవముచే యేర్పడిన దాస్యభావమునుండి యామెకు మోక్షము కల్గించుటకై యాయమ నిర్ణయించిన ట్లమృతాహరణము చేయుటకుద్యుక్తుడై మహాబలసంపత్తిచే దేవేంద్రభవనమునకేగి దేవతలను దేవేంద్రుని యుద్ధమందు జయించి అమృతకుంభమును దెచ్చి తల్లికిచ్చి తల్లి పంపున పెదతల్లికి నివేదించి తల్లిదాస్యమును తప్పించెను. వినతయు విస్మయముతో కుమారుని సామర్థ్యమునకు మెచ్చి తనదాస్యవిమోచనమునకు సంతసించి పుత్రునిజూచి 'తండ్రీ! నీచే నాదాస్యము వీడినది. నాతపస్సు ఫలించినది. నీవుధన్యుడవైతివి' అనిచెప్పెను. కుమారునితో కలసి తల్లియు దాస్యవిముక్తురాలై సంతోషముతో స్వనిలయమునకేగెను.

ఇంద్రుడును అమృతాపహరణఖిన్నుడై గరుడుని వెంటాడి పాతాలమునకువచ్చి గరుడుని యనుమతితో దాయాదులను వంచించి తిరిగి అమృతకలశమును దేవలోకమునకు కొనిపోయెను. మహాయుద్ధమందు గరుడునిచే పరాజయమంది కోల్పోయిన యమృతకుంభముయొక్క పునలాభము వలన నింద్రుడు పరమానందభరితుడై గరుడుని వినతను వేవిధముల నుతించెను. (36–37)

ఈపుణ్యనదియొక్కతీరమందు తపమాచరించి వినతాదేవి లోకోత్తరశక్తి సంపన్నుడై సర్వేశ్వరుని వాహనముగ నుండెడి పరమభాగ్యసంపత్తి గల్గినట్టి కుమారుని గనెనో ఆనదీతీరమహిమము నేమని చెప్పగలము.

గరుత్మన్తం వారియుక్తం స్వర్ణరూపం పుమాన్ బుధః
వేదాన్తవేదినే యో వై విష్ణుభక్తాయ సాదరమ్ 47
దదాతి సోఽత్ర ధర్మాత్మా సర్వలోకేషు గీయతే
చరత్యవిరతం లోకాన్ విమానేన సుపూజితః 48
శ్రుతినిచయరహస్యం వ్యాప్య తిష్ఠేత యస్మిన్
అకథయదథ గాంగం వారి యస్య ప్రభావాత్
ప్రవసతి చ తదానీం క్షేత్రముక్తిః సురషేన్
భవతి చ హి సువాసం తస్య వాసం మహేశ్చ 49

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఘాద్రీమాహాత్మ్యే
గంగాతీర్థమాహాత్మ్యకీర్తనం నామ అష్టమోఽధ్యాయః

అట్టిప్రదేశమున నీతీర్థమందు భక్తియుక్తులై స్నానమాచరించి గరుత్మాను నారాధించెడి పురుషులుగాని స్త్రీలుగాని ఇష్టఫలములనందుదురు. పుత్ర సంతతిలేనివారు సత్సంతతిని బడయుదురు. రోగులగువారు నీరోగులును సంతాకాములు సంపన్నులును విద్యాకాములు విద్వాంసులు నగుదురు.

ఈతీర్థమందు భక్తిశ్రద్ధలతో ప్రతిదినము స్నానముచేసినయెడల కుష్ఠరోగులకు కుష్ఠరోగముమానును. ఇందుసంశయలేశము లేదు. 42

ఒకసంవత్సరకాలము భక్తిశ్రద్ధలతో స్నానముచేయుభక్తులు ఇహ లోకసుఖముల ననుభవించి దేహాంతమందు భగవత్సారూప్యము నొందుదురు. గరుడుని యనుగ్రహముచే పరమవైష్ణవత్వమునుగూడ పొందుదురు. ఈదివ్యక్షేత్రమందు స్నానముచేసి యథావిధిగ గారుడ మహామంత్రమును పురశ్చరణము చేయువారలకు శ్రీగరుడభగవానుడు స్వప్నమందు సౌమ్యమూర్తియై సాక్షాత్కరించి సకలాభీష్టములను పరమ ప్రీతితో ననుగ్రహించుచున్నాడు. (42-45)

శీలవృత్తశ్రుతసంపన్నులగు బ్రాహ్మణుల నుద్దేశించి ఈదివ్య క్షేత్రమందు దశదానములను కన్యాదానాది ఇతరమహాదానములను జేయు వారలు కోటియజ్ఞములు చేసిన మహాఫలమును పొందుదురు. 46

బంగారముతో గరుత్మానుని విగ్రహమునుగాని ప్రతిమనుగాని చేసి విష్ణుభక్తునకు దానము చేయువారలకీర్తి స్వర్గమువరకు వ్యాపించి సుఖి యింతురు. (47-48)

వ్యాసునిమహిమచే వ్యోమగంగయే స్వయముగ నావిర్భవించి పవిత్రముచేసిన ఖాదిరీక్షేత్రమందు వాసముచేయువారలు వైష్ణవలోకవాస సుఖమునను భవింతురు.

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారద సంవాదమునందలి ఖాదిరీమాహాత్మ్య గ్రంథమునందు ఎనిమిదవ యధ్యాయము.

శ్రీ నృసింహాయ నమః

## అథ నవమోఽధ్యాయః

శ్రీశంకర ఉవాచ:-

ధామ్నోఽస్య నిరృతేః ప్రాంచద్దిగ్భాగే నృహరేర్మునే
అర్జునాఖ్యం తీర్థమస్తి విమలం పాపనాశనమ్ 1
వనవాసే కదాచిత్తు ధర్మపుత్రేణ చోదితః
అర్జునస్తీర్థయాత్రాయామిమం దేశముపాగమత్ 2
నద్యాస్తీరే సురమనే విద్యతేఽర్జునపాదపః
శాఖాశతసమాకీర్ణో నానావృక్షసమావృతః 3
సంప్రాప్య తత్తరోర్మూలమర్జునోఽనన్యమానసః
తస్మిన్ స్నాత్వా హృషీకేశం స్మరన్ నిశ్చలమానసః 4
దేవాన్ ఋషీన్ పితౄంశ్చైవ తర్పయిత్వా యథాక్రమమ్
సమాప్య మునిశార్దూల కర్మ నిర్జితమానసః 5
నృసింహమందిరంగత్వాకృత్వా చాపి ప్రదక్షిణమ్
ప్రణనామ నృసింహం తం దైత్యారిం భక్తవత్సలమ్ 6
తతో నిర్గత్య నిర్ద్వంద్వః స్థిత్వాఽర్జునతరోరధః
సమ్యక్పద్మాసనం బద్ధ్వా ప్రాణాయామపురస్సరమ్ 7
ప్రత్యాహృత్యేంద్రియగ్రామం ధ్యాత్వా ధారణయాఽన్వితః
హృత్పద్మకర్ణికామధ్యే దధ్యౌ నరహరిం మునే 8
తతః కదాచిన్నృహరిః రావిర్భూయాగ్రతోఽర్జునమ్ .
వరేణ ఛందయామాస పార్థ శత్రువినాశనః 9
తతః సమాప్య నియమం సమారాధ్య జనార్దనమ్
పుణ్యైః సుగంధిపుష్పాద్యైః దీపైః ధూపైర్మనోరమైః 10

శ్రీ నృసింహాయ నమః

## తొమ్మిదవ అధ్యాయము

శంకరుడు చెప్పుచున్నాడు:—

భగవానుని దివ్యాలయముయొక్క నైరృతి దిగ్భాగమున విమలోదకములుగల అర్జునతీర్థము కలదు. ఈతీర్థము సకల పాపహర మైనది. పాండవులు వనవాసావసరమునందు ధర్మపుత్రునిచే నిదేశింప బడిన భగ్గునుడు తీర్థయాత్రకై వెడలి ఈదివ్యక్షేత్రమునకు వచ్చెను. ఇచ్చటి గంగాతీర్థతీరమున విశాలమగు నొక్క ఖాదిరీవృక్షము కలదు. అర్జునుడావృక్షమూలమునాశ్రయించి యచ్చటి సరోవరమున స్నానముచేసి భగవానుని ధ్యానించుచు నిత్యకృత్యముల నిర్వర్తించుకొని దేవర్షి పితరుల తృప్తిపరచి పైతృక కర్మానుష్ఠానములను పూర్తిగావించుకొని, జితేంద్రియుడై భగవానుని మందిరమునకేగి ధామప్రదక్షిణమాచరించి దైత్యారియు భక్తవత్సలుడునగు శ్రీనరసింహమహాప్రభువును యథావిధిగ అర్చించి ప్రణామవందనాదుల చేయుచుండెను. (1-6)

భగవత్సన్నిధానమునుండి మరలివచ్చి పూర్వము తానాశ్రయించిన యర్జునవృక్షమూలమునుజేరి యథోక్తాసనమున పద్మాసనాసీనుడై యోగ మార్గమున ప్రాణాయామముజేసి ఇంద్రియములను ప్రత్యాహారమార్గముచే నియమించి ప్రాణధారముజేసి హృత్పద్మకర్ణికయందు శ్రీనరసింహ భగవానుని ధ్యానించుచు భగవానునియందు స్వాత్మార్పణముజేసి భగవదానందానుభవమున కాలము గడుపుచుండెను. (7-8)

ఇట్లుండ కొంతకాలమునకు భగవానుడు ప్రీతుడై యర్జునునకు సాక్షాత్కరించి వరము నడుగుమని యడుగగా శత్రుతాపనుడగు పార్థుడు

ఉవాచ ప్రణతః శూరం నృహరిం దేవవల్లభమ్
ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి దర్శనాద్భవతః ప్రభో 11
అద్య మే సఫలం జన్మ దర్శనాత్తవ పాదయోః
పాపనాశోఽభవచ్ఛత్రునాశో హ్యద్య న సంశయః 12
ఇతి సంవదతో స్తత్ర నృసింహార్జునయోర్మనే
తత్రత్యశ్చార్జునో వృక్షః మునిపుత్రస్తదాఽభవత్ 13
స తూర్ణం నృహరిం దృష్ట్వా నత్వాఽనన్దరసాప్లుతః
ప్రాంజలిః ప్రణతో వాక్యమువాచేతి ముహుర్ముహుః 14
పుత్రం మాం భగవన్ విద్ధి మౌద్గల్యస్యమహామునేః
పుణ్యశ్రవణనామానం గురుశుశ్రూషణే రతమ్ 15
కదాచిత్పితరం సమ్యగపృచ్ఛం వినయాన్వితః
స్వామిన్ ఇష్టార్థదాతా యః సంపదస్య కృపానిధే 16
యమాశ్రిత్య నరో నైతి పునః సంసారబన్ధనమ్
ఇతి పృష్టో మహాప్రాజ్ఞో మౌద్గల్యః కృపయాఽన్వితః 17
మామువాదీత్పురాణజ్ఞో వేదవిత్సత్యవాక్శుచిః
రే రేఽర్భక మహాబాహుర్దగతామీశ్వరః ప్రభుః 18
దయాలుః శ్రీపతిః సాక్షాచ్ఛరణాగతరక్షణః
ఉత్పత్తిస్థితిసంహారకర్తా తం భజపావనమ్ 19
నృహరిం దైత్యహన్తారం ప్రహ్లాదవరదం పరమ్
ప్రణతార్తిహరం దేవం కల్యాణగుణసంవృతమ్ 20
తమిత్యుక్త్వా మునిః ప్రీతో నృసింహామన్త్రం మనుమ్
అంగైరుపాంగైః సహితం కృపయోపదిదేశ హ 21
తతోఽబ్రవీన్మహాజా స్తతో మాం విష్ణుసేవినమ్
స్తోత్రాద్రేః పశ్చిమాశాయాం విద్యతే తటినీ శుభా 22

భగవదనుగ్రహమునకు సంతుష్టుడై ఘోరతపమును మాని వినయావన తుడై భగవానునెదుట సాష్టాంగముగ నమస్కరించి పుష్పగంధ ధూప దీప పాద్యార్ఘ్యాచమనాదులచే యర్చించి ప్రణతుడై దేవవల్లభుడగు నారసింహున కిట్లని విజ్ఞాపించెను. ఓశూరాగ్రేసరా! మహాప్రభూ! నీదివ్య దర్శనమువలన నేను ధన్యుడనైతిని. నీయనుగ్రహమమోఘము. నేడు నాజన్మము పావనమైనది. నీపాదకమలదర్శనము సంప్రాప్తించినది. నాపాపములు నశించినవి. బాహ్యాభ్యంతరశత్రువులు నశించిరి. సందియము లేదు. ఇట్లని నృసింహభగవానునితో అర్జునుడు సంభాషించుచుండగా సమీపమందలి యష్టసవృక్షము మునిపుత్రుడై యావిర్భవించెను. (9-13)

ఆమునికుమారుడు ఆనందబాష్పములు ప్రాలుచుండగా భగవానుని యెదుట సాగిలబడి నమస్కరించి ప్రాంజలియై ప్రసన్నుడవుకమ్మని పలుమారు భగవానునికి విన్నవించుచు నిట్లనెను. ఓశరణ్యా! నేను మౌద్గల్యమునియొక్క పుత్రుడను. నాపేరు పుణ్యశ్రవణుడందురు. బాల్యమునుండియు గురుశుశ్రూషణము చేయుచు కాలక్షేపము చేయు చుంటిని. నేనొకనాడు వినయావనతుడనై నాతండ్రిచెంతకేగి 'ఓతండ్రీ! సకలాభీష్టప్రదాతయగు దైవతమెద్ది' యని ప్రశ్నించితిని. "ఆదైవము పునరావృత్తి రహితమగు పరమపదము నిచ్చువాడుగకూడ నుండ వలయును." అని యడుగగా మహానుభావుడగు నాంతండ్రి మౌద్గల్యుడు కృపాపరవశుడై ఇట్లనెను. నాతండ్రి సర్వజ్ఞుడు. అనృతము తెలియని వాడు. వారుచెప్పినది 'ఓకుమారకా! దయావశంవదుడును శరణాగతత్రాణ పరాయణుడును జగదుత్పత్తిస్థితిసంహారకారణమునగువాడు శ్రీమన్నా రాయణుడు ఆతడు భజనీయుడు. శ్రీనాథుని యవతార విశేషమగు నృసింహదేవుడు సర్వదేవోత్తముడు. ఆతడు దైత్యసంహారి ప్రహ్లాద వరదుడు. ప్రణతార్తిహరుడు. కల్యాణగుణగణసంపన్నుడు. లీలామానుష విగ్రహుడు'. అనిచెప్పి ఆదేవుని మహామంత్రమగు నృసింహానుష్టుభ

నృసింహధామ్నో నికటే తాం నదీం గచ్ఛ మాచిరమ్
ఇత్యాకర్ణ్య పితుర్వాక్యం తేనైవానుమత స్తదా 23
సోఽహం గత్వా నదీతీరం శుచౌ దేశే ప్రసన్నధీః
స్థిత్వా జజాప తన్మన్త్రం నిశ్చలజ్ఞానసంవృతః 24
సంస్థాప్య హృదయే విష్ణుం నృసింహం జగతాం పతిమ్
చరాచరం జగత్సర్వం తన్మయం చావలోకయన్ 25
ఏవం ప్రతిదినం చాత్ర చరతో దుశ్చరం తపః
అతీతశ్చ మహాన్ కాలః త త్తీరే మమ మాధవ 26
కదాచిదాగత స్తత్ర కశ్చిద్విద్యాధరేశ్వరః
విద్యాధరీభిః సహితో రామాభిర్జలకేళిభిః 27
రమ్యాభిరకరో త్తస్మిన్ తీర్థే చ జలకేళికామ్
తత్రాపశ్యమహం దైవాత్ సమాధినిరత స్తదా 28
వివస్త్రాభిశ్చ నారీభిర్విహరన్తం నృపోత్తమమ్
నిర్మలే తటినీతోయే నవనోత్పలగంధిని 29
చిరం విహృత్య తటినీతటం ప్రాప్య చ తత్ర హి
జలకేళిపరిశ్రాన్తః స మన్మథశరార్దితః 30
స బాహ్యసురతాసక్తః తాభిః సంవేష్టితోఽభవత్
కాచిచ్చుంబతి నిర్లజ్జా కాచిదాలింగతి స్ఫుటమ్ 31
కాచిత్ప్రియం సమాసాద్య గాఢాలింగనముచ్చకైః
కరోతి కాచిదధరసుధాం పిబతి సాదరమ్ 32
స్తనమండలమధ్యే తు ప్రియం తముపగూహతి
ప్రియోఽపి సాదరం ప్రేమ్ణా కాంచిదాలింగ్య వై దృఢమ్ 33
ఏవం బహువిధైర్బంధైః కామతః ప్రపంచితైః
తాభిః విద్యాధరీభిః స రమతి స్మ సహోత్సవైః 34

మంత్రమును సాంగోపాంగముగ నుపదేశించి పెండియునిట్లనియె. 'ఓకుమారా! ప్రొత్రాద్రియందు ఖాదిరీ నృసింహక్షేత్రమున భగవన్మందిర మునకు పశ్చిమదిశను పరమపావనియగు నదీలలామముకలదు. ఆనది శ్రీనృసింహుని మందిరప్రాంతమున ప్రవహించుచున్నది'. అని తండ్రి చెప్పిన మాటలనువినిన నేను పరమానందభరితుడనై ఖాదిరీక్షేత్రమునకేగి తండ్రియుపదేశించిన ప్రకారమానదీప్రదేశమునుజేరి యచ్చట ఒకానొక పవిత్రతపస్థలమందు ప్రసన్నమానసుడనై నిలచి నాహృదయ కమల మున జగత్పతియగు శ్రీనృసింహభగవానునిలిపి చరాచరాత్మకమగు సమస్తజగంబును విష్ణుమయముగ జూచుచు చిరకాలము తపమాచరించు చుంటిని. (14-25)

ఇట్లు యీశ్వరమగు తపమాచరించెడి నాకు తెలియకనే ఎంతో కాలము గడచెను. నేనా నదీతీరమునందే నాతపస్సును నిర్విఘ్నముగ కొన సాగించుకొనుచుంటిని. అట్టియెడ అపరిచితుడగు నొక్క విద్యాధర చక్రవర్తి తనరాణులతోకూడి నేను వసించెడి నదియందే విలాసా ర్థమై జలక్రీడలాడుటకువచ్చి క్రీడించుచుండెను. నేనును సమాధియం దుండియు దైవదుర్విలసితముగ నావిద్యాధరపతి అనుకూలురగు తన రాణులతో విహరించెడి దృశ్యమును చూచుట తటస్థించెను. నిర్మల మగు నదీజలములందా విద్యాధర ప్రభువు చిరకాలము విచిత్రక్రీడల నొనరించి కొంతతడవుకు ఆక్రీడలనుండి యుపరతుడై మదనశరాహతు డగుట చుంబనాశ్లేష నఖదంతక్షతాది బాహ్యసురతమందాసక్తుడ వాడై ఉదకములనుండి వెలుపలకువచ్చి విశ్రమించుచుండెను. అంతలో నానియనుభావమునకు శతగుణమగు నుత్సాహముతో పరవశలైన యాతని రాణులు పలువిధములగు కామోద్దీపనచేష్టితములతో నాతని పరివారించి ఉపచరించుచుండిరి. ఆతడును వారల క్రీడలలో పరవశుడై బహుప్రకారములుగ ఏకకాలమున నందరతో సుఖించుచుండెను. ఇట్లు

విహరన్తం చ తం దృష్ట్వా కామబాధహతోఽన్మ్యహమ్
విలాసవత్యాం కస్యాం చిద్దృష్టిర్విద్యాధరస్త్రియామ్ 35
గాఢం పపాత మే ప్రేమరసార్ద్రాం కనకత్విషి
తతో నిమీలయన్నేత్రే తాం విద్యాధర సుందరీమ్ 36
అద్రాక్షం చిత్తజాతేన చిత్రే విలిఖితామివ
ఉన్మీలయన్ పునర్దృష్ట్వా ప్రాప్త్యుపాయం విచిన్తయన్ 37
నిలజ్జో మృగశాబాక్ష్యామభూవం మదనాతురః
తతః సమీపం గత్వాఽహం విద్యాధరపతేర్ద్రుతమ్ 38
తస్యాః సంగమమాకాంక్షన్ తమేవ శరణం గతః
యాచ్ఞాభయాచ్చ దీనోఽహం వాచం గద్గదయాఽవదమ్ 39
విద్యాధరేన్ద్రః భద్రం తే త్వామహం శరణం గతః
ఇయం విద్యాధరీ మహ్యం దీయతాం దీనవత్సల 40
ఇత్యేవముక్తస్తు మయా స తాం విద్యాధరస్త్రియమ్
దత్వా మహ్యం యయౌ శ్రీమాన్ స్వగృహం త్వరయాఽన్వితః 41
తదా విద్యాధరీభిశ్చ విద్యయా దివ్యయా సహ
తతస్తస్మిన్ గతే దేవే విద్యాధరపతౌ దివమ్ 42
తాం సమాలింగ్య గాఢం వై విద్యాధరసతీం శుభామ్
హస్తేన చుబుకం గృహ్ణన్ అపరేణ కరేణ చ 43
వేణీం మధుకరశ్రేణీవేణీమివ చ సుందరామ్
అచుంబం తన్ముఖాంభోజమధురామృతలోలుపః 44
రతేన మృగశాబాక్ష్యా నిర్వృతో భ్రాన్తమానసః
ఉన్మత్తవదహంత్యక్తనిత్యనైమిత్తిక క్రియః 45
అచరం తత్సహాచరః తస్యా విరహాదుస్పహః
ఏవం విహరతో మేఽత్ర సుమహాన్ సమయోఽత్యగాత్ 46
తదంకన్యస్తచిత్తస్య కృతార్థేతరవర్త్మనః
గచ్ఛ బహవో మాసా మమ దుష్కృతకారిణః 47

బాహ్యాసురతములందు తృప్తుడై యాభ్యంతర సురతమున తన కామ శాస్త్ర పరిచయము ప్రాభవించు రీతిని క్రీడించుచు సుఖియించెడి విద్యాధరచక్రవర్తిని సాసూయముగజూచిన నాకు మనసున హఠాత్తుగ చాపల్యముదయించెను. నేనును విలాసవతులతో నట్లెప్పుడు కామసుఖము ననుభవింతునా యని యారాటము కలుగగా ఆవిలాసవతులలో నొక్క సుందరియందు నాకాస జనించెను. (26-35)

నాకాయమయందొక్క యన్యాదృశమగు ప్రీతిజనించి యాముగ్ధ నెట్లైన కలియవలయునను నుద్రేకము గాఢముగ నేర్పడి తదేకతానుడనై మైమరచి కొంతతడవుండి కన్ను దెరచి చూచునంతలో నావలెనే ఆవిద్యాధర సుందరియు పరవశయై చిత్రార్పిత ప్రతిమవలె నిలిచి నన్నే చూచుచు నిలిచియుండెను. అంతలో ద్విగుణీకృతోత్సాహముతో ఆమె సంగమము తప్పక నాకు లభియించి తీరునని చింతింప దొడగితిని. (36-37)

కామబాణాభిహతుడనగు నేను లజ్జావిరహితుడనై క్రమముగ సంజ్వరాద్యవస్థలకులోనై గత్యంతరముగానక అవిద్యాధర చక్రవర్తినే శరణము చెంద నిశ్చయించి యాతని సన్నిధికి వెళ్ళితిని. 38

ఆవిద్యాధరసుందరి పొందునుగోరిన కారణమున యాచనమందలి దైన్యదోషమును తెలిసినవాడనగుటచే అట్టి యాచనము ప్రత్యాఖ్యాతమైనంతట కలుగబోయెడి దుఃఖమును స్మరించి భీతుడనయ్యు సాహసించి యాతనినిట్లని వేడితిని. 39

'ఓవిద్యాధరేశ్వరా! నీకు మంగళమగుగాక. నిన్ను శరణము వేడినీ సన్నిధికిప్పుడు కార్యార్థినై నేనువచ్చియుంటిని. నీప్రియయగు నీవిద్యాధరసుందరిని నేను ప్రేమించితిని. ఈమెనా నాకిమ్ము' అని నేను పల్కినంతట నాయందు కరుణించి దీనవత్సలుడగు నావిద్యాధరపతి నేను వలచిన వనితను ప్రీతిపురస్సరముగ నాకర్పించెను. తానును ఇతర విద్యా

కదాచిదహమవ్యగ్రః త్యక్తవస్త్రతయా తయా
భూత్వా దిగమ్బరః సార్ధం పర్యటన్ పృథివీమిమామ్ 48
నిర్లజ్జోఽహం గ్రీష్మకాలే జలకేళిం సమారభమ్
విద్యాధర్యా గుణౌదార్యచర్యయా మాన్యయా తయా 49
అత్రాన్తరే స భగవాన్ దుర్వాసాః సముపాగతః
కామాన్ధోఽహం న పశ్యామి తం మునిం సముపాగతమ్ 50
సా పశ్యన్తీ మునీన్ద్రం తం హఠాద్వస్త్రావృతాఽభవత్
అతిలోలుపమత్యర్థమాక్షిపన్తం తదంశుకమ్ 51
వివస్త్రం మాం మునిశ్రేష్ఠః కోపనోఽపశ్యదత్రపమ్
శశాప చ తదా క్రుద్ధో దుర్వాసా మాం విలోకయన్ 52
కోపశీలో మునివరో దృష్ట్వా మాం నిర్దహన్నివ
రే రే! దుశ్శీల యత్త్వం మాం దుర్వాససమిహాగతమ్ 53
తిరస్కృత్య తు సంమూఢవృత్త్యా త్వనవలోకయన్
యస్మాదిచ్ఛసి దుర్మేధః విస్త్రాంకర్తుమంగనామ్ 54
కామాన్ధస్త్వం మత్పురతః యతస్త్వదతిలోలుపః
తతో భవార్జునో వృక్షః ప్రవన్త్యాశ్చాత్ర రోధసి 55
శప్తోఽహం మునినాథేన భయవిహ్వలమానసః
పాదయోరపతం తస్య ప్రసీదేతి వదన్ ముహుః 56
శాసితస్తేన మునినా క్రుద్ధేన బహుధా హ్యహమ్
నాత్యజం పాదయోర్మూలం శాపాన్తం పరిపాలయన్ 57
తతః ప్రసన్నః స మునిః శాపస్యాన్తమువాచ మే
ఆగమిష్యతి పార్థోఽత్ర తీర్థయాత్రాం సమాచరన్ 58
యత్ర త్వం వృక్షరూపేణ మమ శాపవశంగతః
జాయేథాః తత్తరోర్మూలే పార్థః స్థాస్యతి యోగవిత్ 59
సమాధిస్థేవ మనసా నృహరిం చిన్తయిష్యతి
అచిరేణైవ కాలేన ప్రార్థితో నరకేసరీ 60

ధరస్త్రీలచే పరివృతుడనై నిమేషాంతరమాత్రమున తనస్థానమునకేగెను. అవల నేనావిద్యాధరసుందరిని పరిగ్రహించి ఆయమతో వివిధములగు సురత క్రీడలననుభవించుచు క్షణకాలమైనను ఆమెవిరహమునోర్వక చాలకాలము గడిపితిని. (40-46)

నిత్యానుష్ఠానాదుల బరిత్యజించి చెప్పరాని దుష్కృత్యముల నాచరించితిని. 47

ఒకానొకసమయమందామెతో కలసి దిగంబరుడనై జలాశయమందొక్కచోట జలక్రీడాసుఖముననుభవించు చుంటిని. (48-49)

అప్పుడు మహాతపస్వియగు దుర్వాసముని యాదృచ్ఛికముగనా ప్రదేశమునకు విజయముచేయగా కామాంధతచే నేను మహర్షిని సరకు చేయక ప్రమత్తుడనై యుండుట జూచి భయపడి యావిద్యాధరాంగనలజ్జా భయసంభ్రమయై తన చీరను ధరించబోయెను. నేను లజ్జలేక పోవుటయేగాక ఆమె వస్త్రమునుకూడ ఈడ్చుచుండగా చూచి నాయందు కోపించిన దుర్వాసుడు నన్ను ఘోరముగ ఇట్లు శపించెను. (50-53)

'ఓ దురాత్మా! నీవు ప్రమత్తుడవై స్వైరముగ సంచరించుచు నీ చెంతకు వచ్చియుండిన నన్ను దుర్వాసుడనని యెరిగియు యెరుగనట్లు ప్రవర్తించుచున్నావు, భయరహితుడవై ఒడలెరుంగక లజ్జావనతయగు విద్యాధరాంగనను సైతము వివస్త్రనుగ జేసి ఆమెతో క్రీడింపదలబడితివి. కావున నీవు ఈ సెలయేటి తీరమందు జ్ఞానశూన్యమగు మద్దివృక్షమవై పుట్టెదవుగాక' యని శపించెను. (54-55)

ఈశాపమును తెలిసికొనిన నేను భయచకితుడనై మునిపాదముల కొరగి యాతని ప్రసాదమునకై వేడితిని. క్రోధావిష్టుడగు మహర్షి ననునయించి శాపాంతమును ప్రార్థించగోరి మునిపాదముల పైబడి యాత నుగ్రహించునంత తదుపాదములయందు లేవక పడియుంటిని. (56-57)

తస్య ప్రసన్నో భగవాన్ తత్ర ప్రాదుర్భవిష్యతి
తస్య దర్శనమాత్రేణ వాంఛితం ప్రాప్స్యసి ధ్రువమ్ 61
ఇత్యుక్త్వా స మునిః ప్రాయాదిహం చ కకుభోఽభవమ్
సా తు విద్యాధరీ భూయో యయౌ వ్యోమ్నః స్వమాలయమ్ 62
అనుభూయ చిరం శాపాత్ స్థావరత్వమహం మునేః
ప్రాప్తవానస్మి దేవేశ స్వం రూపం కృపయాఽద్య తే 63
సర్వథా త్వత్పదద్వంద్వం శరణం మే నృకేసరిన్
అజ్ఞానాన్మదనార్తేన యద్యదాచరితం మయా 64
జ్ఞానాద్వా యది వాఽజ్ఞానాత్ స్వామిన్ తత్ క్షన్తుమర్హసి
త్వత్పదం ప్రాప్తుకామోఽహం తపస్తప్తుమిహాగతః 65
అపరాధసహస్రాణాం భాజనం క్రూరకర్మకృత్
నృహరే దేవదేవేశ క్వాహమత్యన్తదుర్మతిః 66
త్వత్పదం యోగిభిః ధ్యాతుమశక్యం క్వ మహాప్రభో
తస్మాత్కారుణ్యవాత్సల్యసౌశీల్యజలధేఽచ్యుత 67
రక్ష మాం పుండరీకాక్ష ఘోరసంసారబన్ధనాత్
ఇత్యుక్తస్తేన నృహరిర్మునిపుత్రేణ ధీమతా 68
ప్రత్యువాచ మహాబాహుర్మునిపుత్రమిదం స్ఫుటమ్
మునిపుత్ర శృణుష్వేదం రహస్యం శ్రద్ధయాఽన్వితః 69
సర్వేషామేవ జన్తూనాం త్రివిధం పాతకం స్మృతమ్
ప్రారబ్ధఫలదం త్వేతదపరం పూర్వసంచితమ్ 70
తథోత్తరారబ్ధమితి సర్వజన్తుషు సంస్థితమ్
తత్ర పూర్వోత్తరాంశౌ ద్వే భక్తియోగేన యోగినామ్ 71
సమ్యక్ జ్ఞానేన ప్రణశ్యేత్ ప్రారబ్ధం చ న నశ్యతి
కిన్తు ప్రారబ్ధికం కర్మ ఫలం దత్త్వా వినశ్యతి 72
తస్మాత్తే కించిదారబ్ధం పుణ్యం పాపమితి స్ఫుటమ్
పుణ్యం విద్యాధరీభోగాత్పాపం స్థావరభావతః 73

నా దీనదశకు కరుణించిన మహర్షి కొంతతడవుకు శాపాస్త్ర మునను గ్రహించి ఇట్లనెను. 'ద్వాపరమందు పాండవమధ్యముడు తీర్థ యాత్ర చేయుచు ఇచ్చటకు రాగలడు. ఆసమయమున నాతడు నీవు శాప దగ్ధుడవై జన్మించియుండిన యర్జునవృక్షమూలమున తపమాచరించగలడు. ఆతనితపమునకు నరకేసరి ప్రసన్నుడై ఆవృక్షమూలమందు సాక్షాత్క రించును. అప్పుడు నీకు శాపమోక్షము కలుగును' అనిచెప్పిదుర్వాసు డంతర్హితుడుకాగా నే నీవృక్షమునైతిని. ఆవిద్యాధరియు నిజలోకమున కేగెను. (58-62)

చిరకాలము దుర్వాసశాపముయొక్క దుష్ఫలితము ననుభవించి నీయనుగ్రహముచే స్వస్వరూపము నొందగల్గితిని. నీపాదపద్మములే నాకు శరణము. పూర్వమందు తెలిసియు తెలియకను నేచేసిన యపరాధములను క్షమించ వేడెదను. నీ యనుగ్రహము పొందగోరి నేనీయెడ తప మాచరింప వచ్చితిని. అపరాధ సహస్రముల కాటపట్టునై యసహ్యాపచార పర్యంతములను నపచారములను చేసిన నేను నీకరుణను ప్రార్థించుటకు కూడ ఎంతమాత్రము అర్హుడను కాను. నీ పరమపదమును పొందుటకు యత్నించుట పరమయోగులకుకూడ సంభావితము కానిది. నే నెంతటి వాడను. సౌశీల్యసాగరమవగు నీవు నీ నిర్హేతుక కరుణచేతనే నన్నుద్ధ రింపవలయును. నన్ను సంసారమునుండి పునరావృత్తిలేకుండ కాపాడవే యని వేడగా భగవానుడిట్లనెను. (63-69)

'ఓ మునికుమారా ! నేను చెప్పెడిరహస్యమును శ్రద్ధతో వినుము. మానవులకు అందరకు పాపమనునది ప్రారబ్ధము సంచితము ఆగామి యని త్రివిధముగనుండును. భక్తి యోగసిద్ధులగు భాగవతులకు సంచితా గామి పాతకములు రెండును ఉపాసనబలముచే నశించి వారలకు ప్రతిబంధ ములు కాకుండును. ప్రారబ్ధమను పాతకము మాత్రము తన యనుభవ మును పూర్తికావించియే నశించును. (70-72)

నష్టమిత్యభిధాయాశు తస్మై మోక్షమదాత్ప్రభుః
యోగాగ్నిదగ్ధదేహేఽస్మిన్ మోక్షం ప్రాప్తే మునేః సుతే 74

అర్జునో విస్మయం ప్రాప్య జయశబ్దముదీరయన్
స ప్రాంజలిః మునిం ప్రాహేత్యానతో నృహరిం తథా 75

పాదపస్య చ నద్యాశ్చ సంబంధోఽస్తు మయా సహ
మమ నామ్నా నదీ చేయం తథార్జునమహీరుహః 76

నామ్నార్జుననదీత్యేవం ఖ్యాతా భూయాత్ నృకేసరిన్
ఇత్యుక్తస్తేన దేవేశః తథాస్త్విత్యభిధాయ వై 77

తత్రైవాన్తర్దధే దేవస్తస్య పార్థస్య పశ్యతః
అర్జునోఽపి చ తం దేశం త్యక్త్వా దేశాన్తరం యయౌ 78

తస్మాదర్జున తీర్థేఽస్మిన్ స్నాతో యో హరిమర్చయన్
విధివత్సతతం భుంక్తే తస్య ముక్తిః కరే స్థితా 79

గోభూతిలహిరణ్యాదిదానం యద్దీయతే నరైః
అర్జునాహ్వయతీర్థేఽస్మిన్ తదానన్త్యం సమశ్నుతే 80

గురూపదిష్టం మన్త్రం యః పురశ్చరణమాచరేత్
ఏతత్తీర్థతటే తస్య మంత్రసిద్ధిర్న సంశయః 81

సర్వకామఫలావాప్తిర్భవత్యేవాచిరాద్ధ్రువమ్
ఇత్యర్జునాఖ్యస్య మహత్త్వముత్తమం
పాపఘ్నముచ్చైః శుభదాయకం వరమ్
జహర్ష శంభోః కథితం వినిర్మలం
సురర్షివర్యః పరమార్థవేదితా 82

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఖాద్రీమాహాత్మ్యే
అర్జునతీర్థమాహాత్మ్యకథనం నామ నవమోఽధ్యాయః

నీకు పూర్వజన్మమందలి పుణ్యపాపములఫలానుభవమున కేర్పడిన కర్మము ఫలదాయియై ప్రారంభించినది. అందు పుణ్యఫలశేషము విద్యాధరీభోగమువలనను పాపఫలశేషము స్థావరభావానుభవమువలనను నశించినది. నీవు భయపడనక్కరలేదు' అని యోదార్చి నరకేసరి యామునికుమారు నను[గ]హింపగా నాతడు యోగాగ్నిచే దగ్ధశరీరుడై మోక్షమందెను. పాండవమధ్యముడును ఈయాశ్చర్యసంఘటనమునుచూచి మిక్కిలి సంతసించి భగవానునిజూచి 'ఓదేవా! నేను తపస్సుచేసిన ఈవృక్షమూలము ఈనదియు ఈరెండును నాపేరిట పిలువబడునట్లు అనుగ్రహింపు' మని ప్రార్థించగా భగవానుడును అట్లే కానిమ్మని ఆవృక్షమున కర్జునవృక్షమనియు నదికి అర్జునతీర్థమనియు వ్యవహారము కలుగునట్లనుగ్రహించి యంతర్హితుడాయెను. అర్జునుడును మరియొక చోటికి పోయెను

కావున మహామహిమమహితమగు నీయర్జునతీర్థమున విధ్యుక్తముగ స్నానముచేసి నరసింహాని సేవించుచు సేవచేయువారలకు మోక్షము సిద్ధమైయుండును. ఈతీర్థతీరమున ఆచరింపబడెడి గోభూతిల హిరణ్యాది దానములు అణుమాత్రమైనను అనన్తఫలము నొసంగగలవు.

యథావిధిగ గురూపదేశము పొందిన మంత్రరాజమును ఈతీర్థతీరమునందు నియమముతో పురశ్చరణము చేయువారలకు మంత్రసిద్ధి త్వరలో చేకూరగలదు. సమస్తకామములును చేకూరును. 81

ఇట్లు పరమశివునిచే చెప్పబడినట్టియు సకలపాపహారియు శుభప్రదమునునగు నర్జునతీర్థమాహాత్మ్యమును సావధానముగ వినిన నారదమౌనీంద్రుడు పరమార్థమునెరిగినవాడై యానందించెను.

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారదసంవాదమందు
ఖాదిరీమాహాత్మ్యగ్రంథమందలి తొమ్మిదవ అధ్యాయము

శ్రీ నృసింహాయ నమః

అథ దశమోఽధ్యాయః

శంకర ఉవాచ:-

భూయోఽపి శృణు దేవర్షే నృసింహస్య మహాత్మనః
ధామ తన్నికటే తీర్థరాజశ్చ భవనాశినీ
కమలోత్పలకల్హారరాజత్పుష్కరిణీ శుభా
విద్యతే తస్య తస్యాశ్చ మాహాత్మ్యం వర్ణ్యతేఽధునా
తత్తీర్థం పావనతరం ప్రాప్తే నరహరేః శుచి
భవబంధాపహం దివ్యం శుద్ధం జ్ఞానప్రదాయకమ్
పాతకాని క్షణాద్యాన్తి విలయం స్నానమాత్రతః
అపవర్గఫలస్యాపి యత్పాపం ప్రతిబన్ధకమ్
వినశ్యత్యేకదా తస్మిన్నాప్లవాత్కిముతాసకృత్
తస్య తీర్థస్య మాహాత్మ్యం వర్ణితుం దేవతాజనైః
అశక్యం తజ్జలం పుణ్యం పావనం పాపనాశనమ్
బ్రహ్మహత్యాదిదోషఘ్నం సర్వసంపత్ప్రదాయకమ్
పురా భూరిశ్రవా నామ శారద్వాజకులోద్భవః
విప్రో ముముక్షుర్నియతః తీర్థయాత్రాం సమాచరన్
తీర్థే తీర్థే చ విధివత్ స్నాత్వాఽభ్యర్చ్య జనార్దనమ్
త్రిరాత్రవాసీ తత్రైకః యాతి తీర్థాన్తరం పునః
ఏవం వర్షసహస్రం వై తీర్థయాత్రాం చ కుర్వతః
అతీతం యతచిత్తస్య స్వకర్మ నిరతస్య చ
కదాచిదపి గంగాయాం దదర్శ మునిపుంగవః
కృష్ణద్వైపాయనం వ్యాసం మునిభిః పరివేష్టితమ్

శ్రీ నృసింహాయ నమః

## పదవ అధ్యాయము

శంకరుడు చెప్పుచున్నాడు.

ఓ నారదమహాసేంద్రా! ఇంకను చెప్పెద వినుము. ఖాదిరిక్షేత్రమున శ్రీనృసింహదేవుని మందిరమును ఆమందిరముప్రక్క భవనాశిని యను తీర్థమును కలవు. వానిమహత్త్వమును చెప్పెదను. (1-2)

భవనాశినియను పుష్కరిణియందలి తీర్థమందుస్నానముచేయుట వలన సంసారబంధమువీడి జ్ఞానోదయమగును. ఒక్కతూరి ఆపుష్కరిణి యందు స్నానముచేయువారలకు సమస్తపాపములు నశించి మోక్షప్రతి బంధములు తొలగును. నిరంతరము స్నానముచేయువారల ఫలమెట్టిదని యనవచ్చును? ఆతీర్థమహత్త్వమును వర్ణించుటకు ముక్కోటిదేవతలు శక్తులు కారు. ఆతీర్థస్నానము బ్రహ్మహత్యాది దోషములను పోగొట్టి సకలసంపదల నొసంగును. (3-6)

దీనికొక ఇతిహాసము కలదు. పూర్వకాలమందొకప్పుడు భారద్వాజ గోత్రోత్పన్నుడగు భూరిశ్రవుడను విప్రుడు మోక్షార్థియై తీర్థయాత్ర కారంభించి భారతభూమియందలి పుణ్యతీర్థములను సేవించి ఒక్కొక్క చోట మూడురాత్రములు వసియించుచు భగవత్పరుడై తిరుగుచుండెను. ఇట్లాతనికి వేయిసంవత్సరములకాలము గడచియు మనసుకు సమా ధానము కలుగలేదు. ఒకానొకసమయమున నాతడు గంగాతీరమున భగ వానుడగు వేదవ్యాసుని యాశ్రమమునకు బోయి శిష్యపరివృతుడగు మహర్షిని సేవించి వినయనమ్రుడై యెదుటనిలువగా వ్యాసభగవానుడు కుశలప్రశ్నమడిగినంత తనవృత్తాంతము నాతడు వ్యాసభగవానునకిట్లని నివేదించెను. 'ఓమహాత్మా! మోక్షార్థినై నేను వేయిసంవత్సరములనుండి

తస్యాశ్రమపదం గత్వా ప్రణమ్య విధివద్ద్విజః
ప్రాంజలిః ప్రణతః తస్థౌ వివక్షుర్వినయాన్వితః 11
వ్యాసేన పృష్టః ప్రోవాచ స్వవృత్తాన్తమితి ద్విజః
మోక్షార్థ్యహం మునిశ్రేష్ఠ తీర్థయాత్రాపరోఽభవమ్ 12
ఏవం సంచరతో మేఽద్య దివ్యం వర్షసహస్రకమ్
మోక్షోపాయో న విజ్ఞాతః కుతః పాపాత్మనః శుభమ్ 13
ఇత్యుదీరితమాకర్ణ్య వ్యాసః ప్రోవాచ ధర్మవిత్
శృణు బ్రాహ్మణ మద్వాక్యం శ్రద్ధయాఽతిసమాహితః 14
స్తోత్రాద్రేః పశ్చిమాశాయాం అస్త్యర్జుననదీ శుభా
విఖ్యాతా తత్తటే రమ్యే పూర్వస్మిన్ తటమండపే 15
విద్యతే నరసింహస్య దివ్యం ధామ మనోరమమ్
తద్ధామ్న ఈశదిగ్భాగే భవనాశినిసంజ్ఞితమ్ 16
ప్రతిబన్ధకపాపఘ్నమస్తి దివ్యం సరోరుహమ్
తత్ర స్నానం త్వయా విప్ర కార్యం శుద్ధచేతసా 17
యతో నిహన్యసే విఘ్నైః అపవర్గనివారకైః
తత్ర గత్వైవ విధివత్ స్నాత్వాఽభ్యర్చ్య శ్రీహరిమ్ 18
తతః సమీహితం యత్తే తత్ప్రాప్నోషి న సంశయః
ఇత్యుక్తస్తేన మునినా యయౌ స ద్విజపుంగవః 19
యత్ర తన్నృహరేర్ధామ సరో యత్ర చ పావనమ్
భూరిశ్రవాస్తత్ర గత్వా నృహరేర్ధామ దీపితమ్ 20
అపశ్యదాగత్య తతో భుక్తిముక్తిప్రదం నృణామ్
సంప్రాప్య తీర్థమమలం భవనాశినిసంజ్ఞితమ్ 21
తత్ర స్నాత్వా చ విధివన్నియతాత్మా కృతక్రియః
ప్రదక్షిణం తతః కృత్వా నృహరేర్మందిరం వశీ 22
గత్వా తం నృహరిం పశ్యన్ ప్రణనామ చ దండవత్
ఉత్థాయ స్తుతిభిర్విప్రః స్తుత్వా భక్తిసమన్వితః 23

తీర్థయాత్రలసేయుచుంటిని. మహాపాపినగు నాకు నేటివరకును భగవదనుగ్రహము కలుగలేదు. నాకు మోక్షమార్గమునకు త్రోవకనుబడుట లేదు' అని పలికెను. (7-13)

ఈమాటలనువినిన వ్యాసుడును విప్రునాదరించి ఇట్లని హితము చెప్పుచుండెను. 'ఓవిప్రోత్తమా! సావధానుడవై విని అట్లాచరింపుము. స్తోత్రాద్రిక్షేత్రము (ఖాదిరిక్షేత్రము) నకు పడమటిదిశను అర్జుననదియను నది కలదు. దానికి పూర్వదిక్కున తీరమందు శ్రీనృసింహుని ఆలయము కలదు. ఆమందిరమున కీశానభాగమున భవనాశినియను దివ్యపుష్కరిణి కలదు. ఆయుదకము సకలపాపహరము. మోక్షద్వారమును ప్రతిబంధించునట్టి పాతకములన్నియు నిన్ను తత్క్షణమే విడచిపోగలవు. నీవాతీర్థమునకుపోయి అచ్చట స్నానముచేసి అచ్చట సాన్నిధ్యముచెందిన నరసింహదేవుని సేవింపుము. నీకోరికె తప్పకఫలించును' అనిచెప్పగా నా విప్రవరుడు చింతించి త్వరితగతిని ఖాదిరీక్షేత్రమునకుపోయి నారసింహుని దివ్యాలయమును చూచెను. ఆమందిరము దివ్యకాంతియుతమై ప్రకాశించెను. ఆవెనుక నాతడు భవనాశినీపుష్కరిణికి పోయి అందు నియతవ్రతుడై స్నానముచేసి నిత్యకృత్యములదీర్చుకొని ఆలయమునకు వచ్చి శ్రీనరసింహదేవుని సేవించి ధ్యానించెను. అనన్యవేశము అనుభవించి తృప్తుడగుబ్రాహ్మణుడు జితేంద్రియుడును జితాహారుడును రాగద్వేషవివర్జితుడునై దైవీసంపత్తి దినదినాభివృద్ధి చెందగా చిరకాలమచ్చటనే భవనాశినియందు స్నానసంధ్యాదుల జేసికొనుచు భగవానునారాధించుకొనుచు కాలముగడచినవిధమునుగూడ తెలియక కాలక్షేపము చేయుచుండెను. (14-25)

ఇట్లుచాలకాలముగడచినంత అతని మనఃపరిపాకమును పరీక్షింపదలచిన నరహరి యాతని మోక్షకాంక్షను తీర్చకనే చూచుచుండెను. ఇట్లుండ భగవానుడొకనాడు విప్రుని పరీక్షించుటకై తానొక కామినీవేషమును

నృసింహం మనసా ధ్యాయన్ స్థితః సస్మితమానసః
ఏవం ప్రతిదినం తత్ర కృతవాసః కృతవ్రతః 24
జితేంద్రియో జితాహారో రాగద్వేషవివర్జితః
స్నానం త్రిషవణం కుర్వం స్తత్రైవ భవనాశిని 25
సేవతే నృహరిం నిత్యం శ్రద్ధాభక్తిసమన్వితః
చిరం తత్రావసద్విప్రో ముక్తికామో దృఢవ్రతః 26
కదాచిన్నృహరి స్తస్య మానసం పరిశోధితుమ్
కృత్వా వరాంగనారూపం సర్వావయవశోభితమ్ 27
విచచార చ తత్పార్శ్వే లావణ్యైకనికేతనమ్
సా చాథ వనితా రమ్యా పురత స్తస్య నారద 28
సందర్శయ న్తీ వ్యాజేన బాహూ ఆస్ఫాల్య నిశ్చలమ్
తప్తకాంచనసంకాశమపకృత్సుమనోహరమ్ 29
బిభ ర్తి మధురం రూపం గానం చ కురుతే తథా
సమీక్షతే సాభిలాషం విలాసాన్ కురుతే భృశమ్ 30
ఏవం ప్రకారం బహుధా దర్శయన్తీ ముహుర్ముహుః
కరే జగ్రాహ త విప్రం రహో దూతీవ సస్మితా 31
ధున్వన్ విప్రః కరతలం ధైర్యముత్సృజ్య చేపలమ్
ప్రదధ్యౌ నృహరిం శాన్తో మనసా నాన్యగామినా 32
తతో భూరిశ్రవాః శ్రీమాన్ జ్వలన్మణికుండలమ్
దదర్శ నరసింహస్య దివ్యమంగలవిగ్రహమ్ 33
తతః ప్రసన్నో నరసింహరూపభృత్
విహాయ రూపం వరదస్సుయోషితః
సంత్యక్తవ న్తం మునిమాబభాషే
భుజా స్తరోద్భాసితకౌస్తుభద్యుతిః 34

ధరించినవాడై యాతనియెదుట సాక్షాత్కరించెను. భగవానుడు కార్యార్థియై సృష్టించికొనిన రూపమగుటచే నయ్యది నిష్కాములకు నైతము కామోద్రేకమును కల్పించుటకు సమర్థమై యుండగలదనుటలో సందియము లేదు. ఆవనిత తన రూపయౌవనలావణ్యసంపదను తనశక్తి కొలదిని తీరుగ వినియోగించి విప్రుని చిత్తము నాకర్షించి తపోవిఘ్నముచేయుటకై తలపడెను. ఆకారము ఇంగితము చేష్టితములచేత నాతని నాకర్షింప యత్నించెను. ఆయత్నములు విఫలము కాగా ఒకానొక రహస్యసమయమున నాతని సమీపించి చేనగపుతో నాతని కరమును తనకరముచే బలాత్కారముగ పట్టెను. (26-31)

బ్రాహ్మణుడును ధైర్యము పీడక భగవదనుగ్రహాయత్తచిత్తముతో నాయంగన కరమును మహాప్రయత్నముతో విడిపించుకుని తనకు సంభవించిన పరిభవమునకు దుఃఖించుచుండగా జ్వలనార్కప్రతీకాశములగు మణికుండలములను ధరించిన శ్రీనరసింహదేవుని దివ్యమంగళవిగ్రహము మాత్రమే యాతనికట్టెదుట సాక్షాత్కరించెను. ఆయంగనలేదు.

భక్తశిఖామణియగు భూరిశ్రవునియందు ప్రసన్నుడగు భగవానుడు అంగనారూపమును విడచి నరసింహరూపియై వెలసి యాతని నాదరించి 'ఓభూరిశ్రవా! నీతపమునకు సంతసించితిని. బ్రహ్మాదులకును అలభ్యమగు నాపరమపదమును నీకనుగ్రహించితిని. మోక్షప్రతిబంధమగు నాసంకల్పరూపమైన నీపాపము భవనాశిని తీర్థస్నానమువలన నశించినది' అని వరమిచ్చెను. (34-35)

ఇట్లని యనుగ్రహముజేసినట్టియు దివ్యపీతాంబరాలంకృతుడును అప్రతిమాన కాంతివిలసితుండును నగు నరసింహదేవుని సేవించి పులకితగాత్రుడైన భూరిశ్రవుడు భక్తితో నమస్కరించి ఇట్లని ప్రార్థించెను. 36

భూరిశ్రవో వత్స వరం వృణీష్వ
విరించముఖ్యైరపి దుర్లభం చ యత్
దదామి తత్తే ప్రతిబంధకం చ తత్
అంహో వినష్టం భవనాశినః ప్లవాత్ 35
ఇతి బ్రువంతం ధృతపీతవాససం
నృసింహముద్యజ్జ్వలదోజసం హరిమ్
నిరీక్ష్య విప్రః పులకాంకితాంగకః
ప్రణమ్య భక్త్యా పరయాఽభ్యభాషత 36
వరం తు మే మాఽస్తు యతః పునర్భవో
జ్వలన్మహావహ్నిశిఖాకృతిర్భవేత్
వరం తదేవాస్తు యతః పదాబ్జయోః
తదాఽచ్యుత స్యాం పరిచారకః సదా 37
ఇతి బ్రువాణే ధరణీసురే తదా
నృసింహమూర్తిర్భగవాన్ కృపాంబుధిః
వితీర్య తస్మై స్వపదం సుదుర్లభం
తన్మజ్జనస్యాపి మహాప్రకాశనమ్ 38
జగామ విష్ణుః నృహరిః పరాత్పరః
భక్తప్రపన్నార్తిహరోఽవ్యయాత్మా
స్వీయం మహార్హం మణిరత్నకల్పితం
స్థానం విశుద్ధం విమలం మనోహరమ్ 39
భూరిశ్రవాశ్చ తీర్థేఽస్మిన్ స్నానాద్బ్రహ్మాదిదుర్లభమ్
ప్రాప విష్ణోః పదం యోగీ సద్యో విగతకల్మషః 40
భవనాశనతీర్థస్య మాహాత్మ్యం కథితం మయా
యః శృణోతి నరో భక్త్యా సర్వపాపైః ప్రముచ్యతే 41
ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఖాద్రీమాహాత్మ్యే
భవనాశినీతీర్థమాహాత్మ్యకథనం నామ దశమోఽధ్యాయః

'ఓదేవా! అనుగ్రహింపుము. దవదావమునకు మించిన దుఃఖమును కలిగించెడి ఈసంసారమందు నాకు మరుజన్మములేకుండునట్లు చేయుము ఏజన్మమునందెచ్చట యెప్పుడు జన్మించినను నీపాదపద్మములందు నిరంతరమగుభక్తి నాకు అనువర్తించునట్లు వరమునొసంగుము. నీకు సర్వకాలసర్వావస్థలందును కింకరుడనై యుందునుగాక' యని ప్రార్థింపగా కరుణావరుణాలయమగు భగవానుడు వల్లెయని భూరిశ్రవునకు ఇతర దురవాపమగు శ్రీవైకుంఠపదమునిచ్చి భవనాశినీతీర్థస్నానమహిమమును ప్రకాశింపజేసెను. (32-38)

భక్తులను ప్రపన్నులను కంటికిరెప్పవలె కాపాడెడి అవ్యయాత్మకుడును పరాత్పరుడునగు శ్రీనారసింహభగవానుడంతట స్వస్థుడై మణిరత్న కల్పితమును మహోఘణమును విమలమును మనోహారియునగు తన దివ్యాలయమునకు విజయముచేసెను. 39

భూరిశ్రవుండును ఖాదిరీక్షేత్రమందలి భవనాశినీపుష్కరిణియందు స్నానముచేసిన పుణ్యవిశేషమువలన పాపవిముక్తుడై బ్రహ్మాదులకును దులభమగు పరమపదమును చేరెను. 40

నేను నీకు వివరించిన భవనాశినీతీర్థముయొక్క మహిమను యేనరులు భక్తిశ్రద్ధలతో వినెదరో వారలును సర్వపాపములనుండి విముక్తులగుదురు. 41

ఇది బ్రహ్మాండపురాణమున రుద్రనారద సంవాదరూపమగు ఖాద్రీమాహాత్మ్యమునందు భవనాశినీతీర్థమహిమానువర్ణనము పదియవ అధ్యాయము.

శ్రీనృసింహాయ నమః

అథైకాదశోఽధ్యాయః

నారద ఉవాచ:—

పురీ ఖాదిరినామ్నా తు విఖ్యాతా కేన హేతునా
శ్రోతుమిచ్ఛామ్యహం దేవ పరం కౌతూహలం హి మే
ఇత్యుక్తవన్తం భగవాన్ ప్రత్యువాచ సదాశివః
అవధారయ దేవర్షే నామ్నః కారణముత్తమమ్
ఖాదిరస్య యుగస్యాన్తే ద్వాపరస్య హరిః స్వరాట్
అవతీర్య యదోర్వంశే భువో భారాపనుత్తయే
కాలనేమిముఖాన్ దైత్యాన్ క్షయం నీత్వా మహాయశాః
దిశాసు దశసు స్థాప్య యశః స్వీయం దివం గతః
ద్రౌపద్యా సహితాః సర్వే తదా పాండుతనూభవాః
శరణ్యం శరణం జగ్ముః కృష్ణం జిష్ణుం జగద్గురుమ్
శత్రూణాం విజయార్థం చ తత్పదస్యాప్యవాప్తయే
తథైవ పాండవాస్తస్య సాహాయ్యం లేభిరే మహత్
కృష్ణశ్చాపి మహాబాహుః సహితః పాండుసూనుభిః
దుర్యోధనాదీన్ సమరే హత్వా దుష్టాన్ దురాసదాన్
స్వకులం చోపసంహృత్య కృతకృత్య ఇవ స్వయమ్
స్వీయం ధామ జగామాశు సత్యసంధో జితేంద్రియః
కలిప్రవేశభీతా యే మునయః సంశితవ్రతాః
రాజర్షయో మహాత్మానస్తే హిమవన్తం ప్రపేదిరే
కలౌ యుగే తు సంప్రాప్తే బలినో యవనాదయః
అరాజకే జనపదే పీడాం చక్రుర్విశేషతః
దేశం దేశమనుప్రాప్య తురగోత్తమసాధనాః
సమాక్రమ్య చ దుర్గాణి ప్రజాక్షోభం ప్రచక్రిరే

శ్రీ నృసింహాయ నమః

## పదునొకండవ అధ్యాయము.

నారదుడు అడుగుచున్నాడు.

'ఓమహాదేవా! ఈపురమునకు భాద్రిపురమను వ్యవహారము కలుగుటకు కారణమెట్టిదో విన నాశకల్గుచున్నది. దయతో నాకెరింగింపు' మని యడిగిన నారదునకు సదాశివుడిట్లని యుత్తరమీయసాగెను. 'నారదా! చతుర్యుగముల పరివర్తనము నీవెరుగుదువు. ఒకానొక ద్వాపరయుగము యొక్క అవసానమందు శ్రీమహావిష్ణువు భూభారమును తగ్గించుటకై యదువంశమున శ్రీకృష్ణుడుగ నవతరించి కాలనేమి మొదలగు దానవుల ననేకుల నట్లేసంహరించి ధర్మసంస్థాపనముచేసి తనమహిమను భూమియందు వ్యాపింపజేసి పరమపదమలంకరించెను. ఆయవతారోద్దేశ నిర్వహణమునకై సహకరింప నవతరించిన పంచపాండవులు ద్రౌపదీసహితులై శ్రీకృష్ణపరమాత్మనికృపచే శత్రువులనుజయించి రాజ్యప్రాప్తిని పొందిరి. మహాభారతయుద్ధానంతరమనతికాలమునకే శ్రీకృష్ణుడు యాదవకులమును కూడ నుపసహరించిపోయెను. కలియుగారంభముకాగా ధర్మనాశమేర్పడుననియు తమ ఉనికికి సంశయమేర్పడుననియు దిగులుతో నాటి తపోధనులగు రాజర్షులు దేవర్షులు హిమాలయమందలి గహనప్రదేశములకు పారిపోయిరి. (1-9)

కాలవశమున కలియుగమారంభించినది. రాజ్యములవిడచి రాజులు పారిపోయిరి. మ్లేచ్ఛజాతులవారు బలవంతులై వైదికులను ఆస్తికులను బాధింపసాగిరి. ఒక్కొక్క జనపదముపై దండయాత్రలనుచేసి అచ్చటి మర్గములను లోబరచుకొని క్రూరులగు మ్లేచ్ఛులు గుఱ్ఱములు మొదలగు బలిష్ఠములగు వాహనములనెక్కి పౌరులను క్షోభింపసాగిరి. వారలు కట్టుబాట్లు మీరినవారలై భగవన్మందిరములను యజ్ఞవాటములను

ఉన్మూలయ న్త్యమర్యాదా దేవతాయనాని చ
తదా శ్రుత్వా జనాః సర్వే ఖాదిరా న్తరవాసినః 12
మహారణ్యం ప్రవివిశుః కిరాతపతిభిః సహ
పురం నిర్మమిరే రమ్యం సర్వైశ్వర్యసమృద్ధిమత్ 13
సుదీర్ఘాభిర్విచిత్రాభిర్వీథిభిః సమలంకృతమ్
సరోవరై ర్బహువిధైః శోభితం నిర్మలాంబుభిః 14
ప్రాసాదై ర్గోపురై శ్చత్రైః సమన్తాత్సుపరిష్కృతమ్
యతః క్షేత్రమిదం దివ్యం క్షేత్రాణాము త్తమో త్తమమ్ 15
దేవయోనివిశేషాణామావాస స్తత్ర కల్పితః
బ్రహ్మరాక్షసభూతాదిః పురశ్చరణమాత్రతః 16
అపయాతి న సందేహో మహారోగో దరిద్రతా
అత్రాపమృత్యుర్నైవ స్యాత్ పౌరాణాం తు కదాచన 17
విదేశవాసినో యేఽపి శ్రుత్వా తత్కీ ర్తిమాయతామ్
అత్రాగత్యావసన్ ప్రీత్యా స్వర్గాచ్చ త్రిదివౌకసః 18
ఇంద్రాద్యా లోకపాలాశ్చ విజహ్రు స్తత్ర సంగతాః
యద్యద్వస్తు నృణాం భోగ్యం శక్యం భో క్తుం తదాఽత్ర తత్ 19
తత్రానుభవసంతుష్టాః న స్వదేశం వ్రజ న్తి తే
అథ తానబ్రవీద్బ్రహ్మా దేవాం స్తత్రాగతాన్ స్వయమ్ 20
ఖాదిరీ నామ్న నగరీ కాచిదస్తి మనోహరా
అస్మాకమావాసయోగ్యా గచ్ఛామోఽత్ర దివౌకసః 21
ఇత్యుదీరితమాకర్ణ్య స్రష్టు స్తద్వాక్యము త్తమమ్
వాసం చక్రుర్దేవగణా స్తత్రైవ మునిపుంగవ 22
ఇతీశేరితమాకర్ణ్య సంతుష్టోఽభూచ్చ నారదః
పునః పృష్టశ్చ తేనైవ మృడో మునిమథాఽబ్రవీత్ 23

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఖాద్రీమాహాత్మ్యే
త ఖాదిరోత్పత్తికథనం నామైకాదశోఽధ్యాయః

నిర్మూలించి అందలియైశ్వర్యమును కొల్లగొట్టసాగిరి. ఆయెడ ఇచ్చటి ఖదిరవనపరిసరములందలి ప్రజలు మ్లేచ్ఛులబారికి గురికాకుండునంతటి ఘోరారణ్యమును ప్రవేశించి యందొక సర్వసంపత్సమృద్ధమగునట్టియు సుదీర్ఘములై యలంకృతములగు వీథులు కలట్టియు విమలాంబు పూరితనదనవిశోభితమగునట్టియు ఆకాశమునంటిన సౌధరాజములు కలట్టియు క్షేత్రరాజమనదగిన ఈపురమును నిర్మించిరి. దాననిది ఖాదిరీ క్షేత్రమని పిలువబడినది. దీనిదైవీశింపత్తిచే దేవతలునైతమిచ్చట కాపురముండనారంభించిరి. ఈక్షేత్రమున మంత్రోచ్చారణ మాత్రమున భూతబాధల నివృత్తియై కుష్ఠాదిరోగములు దారిద్ర్యముకూడ నశించును. ఇచ్చటనుండువారల కపమృత్యుభయముండదు. దేశదేశములనుండియు మానవులుగాక దేవతలును ఈదివ్యక్షేత్రమహిమను వినివచ్చి ఇచ్చటనే స్థిరనివాసములను కల్పించుకొనసాగిరి. ఇంద్రాదిలోకపాలురును ఈ యానందము ననుభవించుటకు తరుచుగ నిచ్చటకు వచ్చుచు పోవుచుండిరి. వేయేల! మనుష్యానందమునకు వలయు భోగ్యభోగోపకరణభోగస్థానము లన్నియు పరమపదమందువలె నిచ్చట నమరియుండెను. ఇక్కడకొక్క మారువచ్చి చూచినవారలు స్వదేశములకుమరలి పోవుటయుండెడిది కాదు. అదేయవస్థ చతుర్ముఖునికిని సంభవించెను. ఆతడొక్కనాడు దేవతా గణమునుచూచి ఖాదిరీనగరమును వర్ణించి యచ్చట తమకునివాసము ఉద్దేశ్యమని యానతీయగా దేవతలందరును వల్లెయని తమతమ నెలవుల నుండి తరలివచ్చి ఖాద్రీనగరమున విడిసిరి. (10-22)

ఇట్లని పరమశివుడు చెప్పిన ఖాద్రీనగరవ్యవహార ప్రవృత్తి నిమిత్తమును వినిన నారదుడు సంతసించెను. మరియు నారదుడడిగిన ప్రశ్నమునకు రుద్రుడు బదులు చెప్పనారంభించెను.

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారద సంవాదరూపమగు ఖాద్రీ మాహాత్మ్యగ్రంథమున ఖాదిరోత్పత్తికథనముపదునొకండవఅధ్యాయము

శ్రీనృసింహాయ నమః

అథ ద్వాదశోఽధ్యాయః

నారద ఉవాచ:-

త్వయా ఖాదిరనామత్వముక్తం కారణపూర్వకమ్
యథా పురస్య గౌరీశ శ్రుతమిష్యే విశేషతః

భూయో వదస్వ దేవేశ పృచ్ఛతో విస్తరేణ మే
కథం ఖాదిరనామత్వం నృహరేః సమజాయత

యత్ర కుత్రాఽపి నాస్తీదం విచిత్రం నామ సుస్థిరమ్
ప్రార్థితం మే సమాకర్ణ్య తన్నిమిత్తం వద ప్రభో

శంకర ఉవాచ:-

సావధానేన దేవర్షే శృణు సమ్యక్ సమాహితః
విష్ణుశర్మకథాగర్భమితిహాసం వదామి తే

దుర్వాసశ్శాపదోషాద్ధతమునిసుతకం స్థావరత్వం ప్రపన్నం
ప్రీత్యా సంమోచ్య శాపాదనితరసులభాం ముక్తిమస్మై వితీర్య
వేదారణ్యే వశిష్ఠే మునిగణ మహితే పార్థనద్యాస్తు కూలే
లక్ష్మీనాథః పరేశః స్వవసతిమకరోత్తాపసైః స్తూయమానః

తతో నరహరిః శ్రీమాన్ ప్రాక్తటీం సమరోచయత్
కలికల్మషనాశాయ పరమవ్యోమ్న ఆగతః

తతః ఖాదిరనామ్నస్తు పురస్యోత్పాదనం పునః
వదామి మునిశార్దూల శృణు సమ్యగ్వచో మమ

పురా బ్రహ్మసుతః కశ్చిద్వేదవేదాంతపారగః
మునిర్వైఖానసో నామ సర్వవిద్యావిశారదః

శ్రీ నృసింహాయ నమః

## పంద్రెండవ అధ్యాయము

నారదుడు అడుగుచున్నాడు:-

'ఓ గౌరీరమణా! నీవు ఖాద్రీనగరమున కాపేరు కలిగిన కారణమును చెప్పితివి. అచ్చటి భగవానునకు ఆ పేరుకల్గుటకు కారణమును తెలియజెప్ప వేడెదను. ఈ పేరు క్రొత్తగను వింతగను ఉన్నది. ఆవివరమును తెలియ బలుకు' మని కోరినంతట శంకరుడు చెప్పుచున్నాడు. (1-3)

ఓ నారదమౌనీంద్రా! నీప్రశ్నముకు సమాధానమును చెప్పెదను. సావధానముగవిని జ్ఞాపకముంచుకొనకోరెదను. పూర్వకాలమందు జరిగిన విష్ణుశర్మయను బ్రాహ్మణోత్తముని చరిత్రమందు నీప్రశ్నకు సమాధానము తెలియగలదు. వినుము. 4

పూర్వము దుర్వాసునిశాపముచే వృక్షమై జనించిన మునికుమారుని శాపమును పోగొట్టి అనితరసులభమగు మోక్షమును సైతమాతని కనుగ్రహించి మునిజనావాసమగు వేదారణ్యమను ఖాదిరీక్షేత్రమందు అర్జుననదీతీరమున లోకోజ్జీవనమును సంకల్పించి శ్రియఃపతి నరసింహ రూపమున నర్చారూపియై వెలసియున్నాడుగదా. అప్పుడు భగవానుడు తనయావాసమును నదియొక్క తూర్పుఒడ్డున సంకల్పించికొనెను. అప్రాకృతమగు పరమపదమునుండి ప్రాకృతమగు భూమికి దిగుట కృపాకార్యముకాక వేరేమున్నది? ఆవల వారిదివ్యాలయమానమనుసరించి నగరము నిర్మింపబడినది. (5-7)

పూర్వకాలమందు బ్రహ్మమానసపుత్రుడగు వైఖానసుడను ముని కలడు. ఆతడు సకలకళాపారీణుడు ఆచారసంపన్నుడు జ్ఞాతృజ్ఞానజ్ఞేయముల నెరిగినవాడు. విచక్షణుడు. ఆతనికి తపస్సంపన్నుడగు విష్ణుశర్మ

ఆసీదాచారనిరతః తత్త్వవేదీ విచక్షణః
తస్య పుత్రోఽస్తి భగవాన్ విష్ణుశర్మా తపోనిధిః 9
అధ్యాపితః స్వపిత్రా వై సోఽభవద్వేదపారగః
కదాచిత్స్వసుతం దృష్ట్వా పితా విద్యావిశారదమ్ 10
పితామహం త్వం గచ్ఛేతి ప్రేషయామాస నారద
విష్ణుశర్మా తథా గత్వా ప్రణనామ చతుర్ముఖమ్ 11
ప్రణమన్తం స బాహుభ్యాముత్థాప్యాలింగ్య పద్మభూః
కిమధీతం త్వయా బాల కస్మింస్తిష్ఠతి తే మతిః 12
నిశ్చితం బ్రూహి వత్సేతి ప్రహసన్ వాక్యమబ్రవీత్
విష్ణుశర్మా ప్రత్యువాచ పితామహమతంద్రితః 13
యదధీతం తు తత్సర్వం సకాశాత్స్వపితుః ప్రభో
వదామ్యనుగృహాణేతి తస్మై సర్వం న్యవేదయత్ 14
విష్ణుశర్మా పునః ప్రాహ స్రష్టారం వినయానతః
భగవన్నస్తి మనసి మమ కశ్చిన్మనోరథః 15
చతుర్షు తవ వక్త్రేషు వేదా యే స్యుర్వినిస్సృతాః
సంప్రదాయాగతం సారం తేషు గూఢం వదస్వ మే 16
తచ్ఛ్రుత్వా పద్మజః ప్రీత్యా ప్రార్థితం విష్ణుశర్మణః
ప్రశశంస తదుద్యోగం వివిధాభిః స్వసూక్తిభిః 17
పస్పర్శ పాణినా తస్య దేహమాశిషమూచివాన్
వరేణ ఛందయామాస కాంక్షితేన కుమారకమ్ 18
విష్ణుశర్మా చ సంతుష్టః ప్రోవాచ చతురాననమ్
న కార్యమస్తి మే బ్రహ్మన్ లోకే మోక్షే మమాఽస్తి ధీః 19
తత్ప్రాప్త్యుపాయం నాపశ్యం తం మమోపదిశ ప్రభో
తమువాచాబ్జజః పుత్ర కథం తే బుద్ధిరీదృశీ 20

యను పుత్రుడు కలడు. ఒకానొకప్పుడు తండ్రి సకల విద్యాపారంగతుడగు కుమారునిజూచి తత్త్వజ్ఞానోపదేశము నొందుటకై పితామహుని చెంత కాతని పంపెను. అట్లే విష్ణుశర్మ పితామహునియొద్దకుపోయి నమస్కరించగా బ్రహ్మ యాతని నోదార్చి తనచేతులతో లేవనెత్తి కుశలప్రశ్న మడుగుచు తాను వచ్చిన కారణమును విశదముగ నెరింగింపుమని స్మితపూర్వముగ నడిగెను. విష్ణుశర్మయు సంతుష్టుడై తడబాటులేకుండ ఇట్లని ప్రత్యుత్తరమొసంగెను. (8-13)

'నేను నాంతండ్రి సన్నిధిలో నేర్చిన విద్యనంతయు విన్నవించెద' నని చెప్పి అట్లేవినిపించి వినయముతో వెండియు నిట్లని ప్రార్థించెను 'మహానుభావా! నాకొకకోరికె కలదు. నీవు నీనాల్గుముఖములతో నాల్గువేదములను అధ్యయనము చేయుచున్నావు. చేయించుచును ఉన్నావు. ఆవేదములు అనంతములు. అల్పజ్ఞులమగు మాబోటులకు దురధిగమములు. ఆవేదములందు ఇమిడియుండిన సత్సంప్రదాయసిద్ధమగు సారమును నాకుపదేశింప వేడెదను' అనియడుగగా చతుర్ముఖుడు ప్రీతుడై విష్ణుశర్మను పలువిధములుగ ప్రశంసించి వరము నడుగుమని చెప్పెను. వరప్రదుడగు పితామహునిసమక్షమున విష్ణుశర్మయు భయము విడచి తనకు మోక్షము కావలయునని యు ఏ ఇతరేచ్ఛగాని లేదనియు మోక్షమునకుమార్గము నుపదేశింపుమనియు వేడెను. అందుకు పితామహుడచ్చెరువొంది 'ఓకుమారా! నీవు పసివాడవు. సర్వేశ్వరుని లీలావిభూతియందు చేతనులకు కర్మమూలముగ సుఖదుఃఖానుభవము ప్రాప్తమైయున్నది. చిరకాలము భగవదాజ్ఞారూపము అగు కర్మల ననుష్ఠించి సంసారమందలి సుఖదుఃఖములను అనుభవించిన గాని మోక్షము లభింపదు. మోక్షమనగా భగవదనుగ్రహమే. ఈపసితనముననే నీవాకోరికెను కోరకుము' అనిచెప్పగా ప్రవృత్తి ధర్మస్వరూపమును దానిననుష్ఠించువారల కపవర్గము ననుగ్రహించెడి పరమపురుషుని వివేకమును తనకానతీయుమని విష్ణుశర్మ వెండియు పితామహునడిగెను. (14-24)

సంసారే సుఖదుఃఖాదిమనుభూయ యథావిధి
వర్ణాశ్రమోక్తమాచారం కృత్స్నం సమనుతిష్ఠసి 21
యోగినామేవసులభః మోక్షః తత్ప్రాపకో హరిః
స త్వం ప్రవృత్తిమార్గేణ కేవలం మోక్షమాప్స్యసి 22
తతః సోఽబ్జభవం ప్రాహ విష్ణుశర్మా వినీతవత్
కీదృక్ ప్రవృత్తిధర్మశ్చ కోఽపవర్గం ప్రదాస్యతి 23
కః సంసారార్ణవే మగ్నానుద్ధరిష్యతి పాపినః
కస్మిన్ క్షేత్రే స్థితో దేవః తపసా పరితుష్యతి 24
శీఘ్రసిద్ధికరం క్షేత్రం కిమిత్యపి వద ప్రభో
వేదారణ్యం జగత్యస్మిన్నస్తి క్షేత్రం సుపావనమ్ 25
పార్థాపగాపూర్వతటే ఖదిరద్రుమభూషితమ్
తత్ర గత్వా సునియతః తపశ్చర మహామతే 26
ఇత్యుక్త్వాన్తర్దధే బ్రహ్మా తపసే ప్రత్యగాన్మునిః
స్తోత్రాద్రేః పశ్చిమే భాగే అర్జునాఖ్యాం నదీవరామ్ 27
గత్వా మునివరో మేనే తపసః స్థానముత్తమమ్
నద్యాం స్నాత్వా చ విధివత్సంసేవ్య చ జనార్దనమ్ 28
సోఽహంభావేన వై ధ్యాత్వా నిర్విఘ్నమచరత్తపః
సూచీకుంజాగ్రతః స్థిత్వా సోర్ధ్వం ప్రాణాన్ నిబోధయన్ 29
ఏకాగ్రేణైవ మనసా విష్ణుశర్మా తపోనిధిః
విష్ణుమన్త్రం జపన్నిత్యం ధ్యాయన్ విష్ణుం పరాత్పరమ్ 30
దేహాభిమానముత్సృజ్య తపశ్చక్రే సుదారుణమ్
కాలేఽతీతే చ మహతి దుర్వాసా భగవాన్ ఋషిః 31
ఆగత్యాత్ర మునిం దృష్ట్వా విష్ణుశర్మాణమన్తికే
మౌనముద్రావశం మేనే స్వాత్మానమవమానితమ్ 32

అందుకు పితామహుడును 'దక్షిణాపథమందు వేదారణ్యమను భూభాగము కలదు. అదిపవిత్రమైనచోటు. అందు అర్జునతీర్థమను నొక్కనది కలదు. ఆనదికి ప్రాక్తటమందు మద్దివృక్షములుగల వన మున్నది. ఆప్రదేశమునకేగి నీవుతపమొనరించు' మని చెప్పి యంత ర్హితుడుకాగా విప్రకుమారుడు బ్రహ్మచెప్పిన స్తోత్రాదియందు పశ్చిమ భాగమున వేదారణ్యమునకువచ్చి అర్జుననదీతీరమును చూచి తుష్టుడై నదియందుస్నానానుష్ఠానముల జేసికొని భగవానుని ధ్యానించి 'సోఽహం' భావనతో నిర్విఘ్నముగ తపస్సును సాగించుకొనుచుండెను. మండ్లపై నిలచి ప్రాణాయామనిష్ఠుడై అష్టాక్షరమహామంత్రమును జపియించుచు దేహాభిమానమును విడచినవాడై ఏకాగ్రచిత్తముకలిగి తపస్సుచేయు చుండెను. (25-31)

ఇట్లు చాలకాలము గడచినవెనుక తపస్సంపన్నుడగు దుర్వాస మహాసేంద్రుడు విష్ణుశర్మయుండు ప్రదేశమునకు వచ్చెను. విష్ణుశర్మ సమాధియందుండి దుర్వాసుని రాక తెలియక పోవుటచే మౌనమున నుండెను. దుర్వాసుడాయంశమును పరామర్శింపక విప్రకుమారుడు తనరాకనెరిగియు తనకు స్వాగతము చెప్పక అవమానించెనని యెంచి కోపించినవాడై నేత్రములందుండి క్రోధాగ్నిని వెడలగ్రక్కుచు విష్ణు శర్మను వృక్షమవు కమ్మని శపించెను. మరల పరామర్శించి చూచి దగ్గరకువచ్చి 'ఓవిప్రకుమారా! నీవుతపస్సు చేయుచున్నట్లున్నదే' అని పరిహసించెను. విష్ణుశర్మయు ప్రజ్ఞదెచ్చికొని మహర్షిశాపమును తెలిసికొని భయముచెంది భగవన్నామమును స్మరించుచు సమాధినుండి లేచి దుర్వాసుని ప్రత్యుత్థానాభివాదనములచే గౌరవించి 'ఓమహానుభావా! నేను నాహృదయమందు భగవానుని ధ్యానించుచు పరవశుడనై నీరాకను గుర్తించలేక పోయినందుకు నన్ను మన్నింపుము. భాగవతాపచారము సహ్యముకానిది. నేను సమర్పించెడి పాద్యమును అర్ఘ్యమును యథా

కథమేష న మాం ద్రష్టా కిమసౌ మాం న సత్క్రియాత్
ఇతి కోపవశం యాతో దుర్వాసా రక్తలోచనః 33
శశాప విష్ణుశర్మాణం భజ స్థావరతామితి
పునః సమీపమాగత్య పరామృశ్య చ తం మునిమ్ 34
కిం తపః కురుషే బ్రహ్మన్నిత్యువాచ హసన్నివ
తం వీక్ష్య విష్ణుశర్మా తు శ్రుత్వా శాపం చ భీషణమ్ 35
వాచం వాచంయమశ్రేష్ఠః కంపమానోఽతివిహ్వలః
ఉద్భ్రాన్తచిత్తః సమయే ధ్యాయన్ నారాయణం విభుమ్ 36
ఉత్థాయ చాసనాచ్ఛీఘ్రం దుర్వాససమువాచ హ
భగవన్ భగవద్ధ్యానపరత్వాత్త్వామిహాగతమ్ 37
నాపశ్యం మందధిషణః క్షమ్యతాం మే వ్యతిక్రమః
గృహాణ పాద్యమర్ఘ్యం చ దాస్యమానం మయాఽధునా 38
ఇత్యుదీరితమాకర్ణ్య త్యక్తరోషో దయాపరః
అనుతప్తః స దుర్వాసాః కృపయా తముదైక్షత 39
విష్ణుశర్మా సమాశ్వస్తః దుర్వాససమరిందమమ్
శాపాన్తం ప్రార్థయామాస దీనదీనేన చేతసా 40
తం పాదయోర్నిపతితం ధ్యాయమానం మహామునిః
ఉత్థాప్యాంకముపానీయ భస్మం తస్య వ్యపోహయన్ 41
హర్షగద్గదయా వాచా విష్ణుశర్మాణమబ్రవీత్
మాభీస్త్వం స్థావరో భూత్వా శీఘ్రమేవ విమోక్ష్యసే 42
న మే వాగనృతా భూయాత్ శాపాన్తం కథయామి తే
యత్ర త్వం పాదపో భూత్వా పుణ్యభూమౌ భవిష్యసి 43
తత్ర భక్తహృదావాసః శ్రీవత్సకృతలాంఛనః
పీతాంబరధరః స్రగ్వీ శంఖచక్రగదాధరః 44

శక్తిగ చేయు నుపచారములను దయతో స్వీకరింపుము' అనివేడెను. దయామయుడగు దుర్వాసుడును పశ్చాత్తాపముతో విష్ణుశర్మప్రార్థనను ఆలకించి ప్రసన్నుడాయెను. (32-39)

అంత విష్ణుశర్మ ధైర్యముజెంది దుర్వాసముని పాదములపై బడి దీనమానసముతో తనకు శాపాంతము ననుగ్రహింపుమని కోరెను. దుర్వాసుడాతని చేతులలో లేవనెత్తి నిమిరి యంకమందు చేర్చుకొని యాశ్వాసపరచి యానందబాష్పములు వ్రాలుచుండగా ఇట్లనెను. 'ఓకుమారకా! భయపడకుము. నీవువృక్షమైపుట్టినను త్వరలో శాపమోక్షము కలుగ గలదు. నాశాపము వ్యర్థము కాజాలదు. నీవు వృక్షమై జన్మించక తప్పదు. నీవొక పుణ్యక్షేత్రమందు వృక్షజన్మమును పొందెదవు. అది ప్రథమలాభము. అప్రదేశమునకు భక్తవత్సలుడు శ్రీవత్సలాంఛనుడు పీతాంబరాలంకృతుడు వనమాలావిరాజితుడు శంఖచక్రగదాపద్మధరుడు శ్రీభూనాయకుడు గరుడవాహనుడునగు భగవానుడు నీపూర్వజన్మ సుకృతముచే ప్రసన్నుడై త్వరితముననే స్వయముగ రాగలడు. (40-45)

ఆయనరాక సకలలోక క్షేమంకరముకూడ కాగలదు. ఆప్రదేశముననగూడ చెట్టుపై నిలచిన నీమూలముననే యాతడునరసింహరూపముతో సాన్నిధ్యము చెంది నీశాపవిమోచనము చేయగలడు. శాపవిముక్తుడవై నీవు నీయభీష్టమును పొందగలవు' అనిచెప్పుచుండగనే దుర్వాసుడంత హితుడుకాగా విప్రకుమారుడు వృక్షరూపమునొందెను. ఇట్లు స్వల్ప కాలము గడచెను. భగవానుడు గరుడారూఢుడై వృక్షమగు విష్ణుశర్మ చెంతకు వచ్చెను, (46-48)

వెంటనే వెనుక చెప్పబడిన వృక్షము సమూలముగ కదలుట కారంభించి మరుక్షణమున నావృక్షము వృక్షరూపమును వీడి విలక్షణమగు మునికుమారకుని రూపముదాల్చి యెదుట సాక్షాత్కరించిన భగవానుని

భూమీశః సర్వలోకేశః శ్రీశః పతగవాహనః
త్వద్భక్త్యా పూర్వకృతయా సుప్రసన్నః కృపానిధిః 45
ఆగమిష్యతి శీఘ్రేణ లోకానాం హితకామ్యయా
తవ పాదపభూతస్య మూలే స్థాస్యతి స స్వరాట్ 46
నరకేసరిరూపోఽసౌ శాపాత్త్వాం మోక్షయిష్యతి
త్వం చ శాపవినిర్ముక్తః ప్రాప్స్యసి స్వామభీప్సితమ్ 47
ఇత్యుక్త్వా స మునిః ప్రాయాద్ద్విజః స్థాపరతామియాత్
ఇత్థం వ్యతీతే కాలే తు కదాచిత్ శ్రీసహాయవాఞ్ 48
నృహరిర్గరుఢారూఢః ప్రాదురాసీద్ద్విజాన్తికే

తదా కంపం వృక్షోఽవహదథ తరుత్వం చ విజహౌ
మునిశ్రేష్ఠో భూత్వా హరిచరణయోః ప్రాపతదరమ్
మురారే పూజ్యస్త్వం విధిశివముఖాద్యైః సురవరైః
త్వయి స్యాద్భక్తిర్మే సతతమితి వవ్రే గురువరమ్ 49

ఉచ్చైరేవం మునిః ప్రార్థ్య కృత్వా స్తుతినమస్క్రియాః
పునరేవాస్తువద్విప్రః స్తోత్రేణానేన మాధవమ్ 50

వామే భాగే స్థితశ్రీభుజనిహితకరం దివ్యభాస్వత్ప్రకాశం
దీవ్యత్పద్మాసనస్థం ప్రసృతపదమహం శుద్ధయజ్ఞోపవీతమ్
స్నిగ్ధోద్యత్పీతవస్త్రం మణిమయమకుటం కౌస్తుభోదారహారం
వందే వామాంకదృష్టిం స్మితముఖమనిశం ఖాదిరీశ్రీనృసింహమ్

నమో నమస్తేఽఖిల కారణాయ
నమో నమస్తే విధిశర్వసేవిత
నమో నమస్తే కలిదోషనాశినే
నమో నమస్తే మునిసేవితాయ 52

ప్రపద్యే త్వాం నరహరే తపస్తమివ భాస్కరమ్
ప్రణతార్తిహరం దేవం పుండరీకాక్షమవ్యయమ్ 53

పాదములకొరగి యాతని యనన్తనామములను వేరువేరుగ నర్థానుసంధాన ముతో స్తుతించుచు తనకాతని పావకమలములయందు దృఢభక్తి నిరం తరముగను నిరవధికముగను నుండునట్లనుగ్రహింపుమని ప్రార్థించెను.

వెండియు నీదిగువురీతి నాతడు స్తోత్రము చేసెను. 50

'వామపార్శ్వముననున్న శ్రీమహాలక్ష్మియొక్క భుజముపై నుంచిన హస్తముకల్గి దివ్యకాంతియుతుడై పద్మాసనమున నొక్కపాదమును చాచియు వేరొక్కపాదమును కుంచితముగనుంచియు నాసీనుడై యజ్ఞోప వీతమును దివ్యపీతాంబరమును మణిమయమగు దివ్యకిరీటమును కౌస్తుభ మణితో చేరిన హారములను ధరించి భక్తులను ప్రసన్నదృష్టితో చూచెడి స్మితవదనముతో సాక్షాత్కరించిన శ్రీఖాదిరీనారసింహునకు నాజోహారులు

ఓ దేవా! నీవు చరాచర రూపమగు నిఖిలప్రపంచమునకు కారణ మవు. నీకు బ్రహ్మరుద్రులు కింకరులు. నిన్నుకీర్తించువారలకు కలి యుగము విరోధముకాదు. మహర్షులు నిన్ను సేవించి ధన్యత జెందెదరు. సూర్యునకు నీవు తేజస్సునిచ్చువాడవు. శరణాగతరక్షకుడవు. పుండరీక విశాలనేత్రుడవు. అవ్యయుడవు. చతుర్భుజములు కలవాడవు. శంఖ చక్రముల ధరించెదవు. పీతాంబరధారివి. మకరకుండలకేయూరముక్తా హారకాంచీగుణమణిపాదుకములచే నీదివ్యమంగళవిగ్రహమలంకరింప బడినది. శ్రీదేవియు భూమిదేవియు నీరాణులు. నీకు పక్షీంద్రుడు వాహనము. నూతన వసంతోత్సవము నవధరించి విజయముచేసిన నిన్ను నేను శరణము వేడెదను. నన్ననుగ్రహించి ఇదే రూపముతో నీవిచ్చటనే నిత్యవాసము సంకల్పింపుము. నీపాదపద్మములను నాశిరముననుంచుము నేనును నావంశీయులును వైఖానస శాస్త్రముచే నిన్నారాధింతుము. మేము చేయునట్టినిత్యములు నైమిత్తికములు కామ్యములగు నారాధన మును ఉపచారములను కృపతో స్వీకరింపుము' అనిప్రార్థింపగా భగవాను డచ్చట సాక్షాత్కరించిన నరసింహరూపముతో నట్లే యర్చకపరాధీన

చతుర్భుజం శంఖచక్రధరం పీతాంబరావృతమ్
నక్రకుండలకేయూరముక్తాదామసుశోభితమ్ 54
క్వణత్కాంచీదామఘోషం మణిరంజితపాదుకమ్
శ్రీభూమి సహితం దేవం గరుడోపరి సంస్థితమ్ 55
వసంతోత్సవసంపన్నసుషమం త్వాం భజే హరిమ్
స త్వం మమానుగ్రహార్థమత్ర తిష్ఠ నృకేసరిన్ 56
త్వత్పాదం మూర్ధ్ని మే దత్వా కృపాం కురు మయి ప్రభో
మద్వంశ్యైరర్చనం సమ్యక్ విధ్యుక్తేన సదా పథా 57
నిత్యం నైమిత్తికం కామ్యం కర్మ స్వీకురు మాధవ
ఇతి చాభ్యర్థయద్దేవోఽప్యాశ్రుత్య ప్రార్థితం మునేః 58
ఖాదిరే నరసింహత్వమాప్య తస్థౌ రమాపతిః
తస్మాత్ ఖాదిరినామాసౌ ప్రఖ్యాతా భూతలే పురీ 59

విష్ణుశర్మా:- వంశజోద్భవ వంద్యం త్వాం వనజాయతలోచనమ్
వనజారమణం వందే ఖాదిరీ నృహరిం విభుమ్ 60
సురభూసురపాలం త్వామసురాధిపభేదినమ్
ఖాదిరీన్నృహరిం వందే మోక్షమార్గప్రదాయినమ్ 61
సర్వేశం సర్వలోకేశం సర్వభూతహితే రతమ్
ఖాదిరీన్నృహరిం వందే దుష్టామయనివారణమ్ 62
ప్రహ్లాదవరదం ప్రాజ్ఞం ప్రద్యోతన్నయనాంబుజమ్
వందే ఖాద్రీనరహరిమపమృత్యునివారణమ్ 63
తీక్ష్ణదంష్ట్రం మహాభీమం సుతీక్ష్ణనఖరోజ్జ్వలమ్
ఖాదిరీన్నృహరిం వందే కాలమృత్యునివారణమ్ 64
జ్వలదర్కేందునయనం విద్యోతత్కుటిలభ్రువమ్
ఖాదిరీన్నృహరిం వందే సర్వసంపత్ప్రదాయకమ్ 65

మగు నర్చాస్వరూపము నవధరించి సుప్రష్ఠితుడై నిలచెను. ఆకారణముచే ఖాద్రినరసింహుడను వ్యవహారము కల్గెను. (52-59)

చతుర్ముఖునిచే యారాధింపబడి ప్రసన్నవదనారవిందము కలవాడైన లక్ష్మీపతియగు శ్రీఖాద్రి నరసింహదేవుని నమస్కరించెదను.

దేవతలను బ్రాహ్మణులను సంరక్షించు వ్యాజమున రాక్షససంహారముచేసి సకలలోకసంక్షేమమును కల్పించెడి శ్రీ ఖాద్రినరసింహదేవుని నమస్కరించెదను. 61

సర్వేశ్వరుడై లోకములను వ్యష్టిసృష్టిచే పరిపాలించెడి ఆయా లోకేశులకంతర్యామియై సర్వచేతనాచేతనములకు హితైకచింతనము చేయు ఖాద్రినరసింహదేవుని దుష్టములగు నాధివ్యాధుల నివారించు వైద్యుడని నమస్కరించెదను. 63

ప్రహ్లాదుని రక్షించుటచే ప్రాజ్ఞుడై ప్రసిద్ధిజెంది యానందించెడి ఖాద్రినరసింహదేవుని నపమృత్యునివారకుడని నమస్కరించెదను. 64

తీక్ష్ణములగు కోరపండ్లు నఖములుకల్గి మహాభయంకరరూపము గల ఖాద్రినరసింహదేవుని కాలమృత్యునివారకుడని నమస్కరించెదను.

దివ్యతేజస్సుతో ప్రకాశించెడి చంద్రసూర్యులే నేత్రములై వంకరలగు కనుబొమలుగల ఖాద్రినరసింహదేవుని సర్వసంపత్ప్రదాతయని నమస్కరించెదను, 66

రాక్షసశ్రేష్ఠుడగు హిరణ్యాసురుని వక్షంబు ఛేదించిన ఖాద్రి నరసింహదేవుని దుష్టేంద్రియశిక్షకుడని నమస్కరించెదను. 67

దేవతలకు మందారవృక్షమై చిరునగవుతో భక్తులకు స్వాగతము చెప్పెడి ఖాద్రినరసింహదేవుని నానందదాతయని నమస్కరించెదను'. 68

రక్షోవరహిరణ్యాక్షవక్షఃస్థలవిదారిణమ్
శిక్షితాక్షం మహాబాహుం ఖాదిరీనృహరిం భజే 66

వందే వందారుమందారం కుందహాసప్రకాశినమ్
ఖాదిరీ నృహరిం వందే మందహాసశుభాననమ్ 67

ఖాదిరీనృహరిస్తోత్రం త్రిసంధ్యం య ఇదం పఠేత్
నాపమృత్యుభయం తస్య కాలమృత్యుభయం న చ 68

కరోమి త్వదీయాం సపర్యాం సుపూర్ణాం
సదాzహం విధానేన వైఖానసేన
న బాహ్యాగమైస్తేzస్తు పూజా కదాపి
ప్రసీద ప్రభో ఖాదిరీశ ప్రసీద 69

సురేశానమౌలిస్ఫురద్రత్నసంఘ -
ప్రభారాజి నీరాజితాంఘ్రే నృసింహ
సమస్తాఘహారిస్ఫురత్పాద విష్ణో
ప్రసీద ప్రభో హే హరే ఖాదిరీశ 70

పురా దన్తిరాజస్య శాపానుభూత్యై
మహాకాలదుర్వక్త్రినక్రగ్రహోzభూత్
భవద్దివ్యనామ స్మృతేరేవ ముక్తః
ప్రసీద ప్రభో ఖాదిరీశ్రీనృసింహ 71

అహల్యా శిలాభావమేత్య త్వదంఘ్రేః
రజఃస్పర్శనాదేవ హిత్వా శిలాత్వమ్
క్షణాదాప్తయోషానువేషా రరాజ
ప్రసీద ప్రభో ఖాదిరీశ ప్రసీద 72

యదా ద్రౌపదీ పుష్పవత్యార్తరూపా
సభాయాం తు క్రుష్టా బలాచ్ఛత్రుపక్షైః

ఇట్లని విష్ణుశర్మచే చెప్పబడిన ఖాద్రినృసింహదేవుని స్తోత్ర పద్యములను త్రికాలములందు భక్తితో ననుసంధించువారలకు అపమృత్యువు వలనను కాలమృత్యువు వలనను భయము లేదు. 69

మరియు విష్ణుశర్మ ఇట్లని స్తుతించెను. నిన్ను వైఖానసశాస్త్ర రీతిని నేనును నావంశీయులును పూజింతుము. ఇతరాగమములను నీవు పరిగ్రహింపవు. హే ఖాదిరీశా! ప్రసన్నుడవు కమ్ము. 70

నీపాదములకు మ్రొక్కినపుడు దేవేంద్రుని కిరీటమందలి రత్నముల కాంతి నీకు నీరాజనమైయుండును. అట్టి దివ్యవైభవముగలదేవా! మాపాపములను పోగొట్టుము. ప్రసన్నుడవు కమ్ము. 71

పూర్వము గజేంద్రుడు దుర్వాసుని శాపఫలమును చిరకాలమనుభవించి శాపాంతమున నొక్క బలసంపన్నుడగు నక్రరాజుచే ఇంద్రద్యుమ్నసరస్సున పట్టుబడి చిరకాలము క్లేశమును పొంది తన పౌరుషము సర్వవిధముల వ్యర్థముకాగా నీనామమును స్మరియించిన మాత్రమున నక్రవక్త్రమునుండి విడిపింపబడి భగవానుడవగు నీపరివారములోచేర్చబడుట ప్రమాణప్రమితము. ప్రసన్నుడవై సంసారబద్ధులమగు మమ్ములను ఈబంధమునుండి రక్షింపుము. 72

పూర్వమందు గౌతమపత్ని భర్తృశాపముచే శిలయై పడియుండి శ్రీరామావతారమందు నీపాదరజంబుసోకి నిజరూపము నొందెను. అట్టి నీపాదరజమును మాకనుగ్రహించి ప్రసన్నుడవు కమ్ము. 73

పూర్వము పాండవుల ధర్మపత్నియగు ద్రౌపది రజస్వలయై యుండగా క్రూరులగు కౌరవులామెను సభకీడ్చినప్పుడాయమకు నీనామ స్మరణము వలన రక్షణము కలిగెను. మమ్ములను విషయములలోని కీడ్చెడి దుష్టేంద్రియముల బారినుండి రక్షింపుము. ప్రసన్నుడవు కమ్ము.

తవైవ స్మృతేర్దేవ నష్టాధిరాసీత్
ప్రభో ఖాదిరీశ ప్రసీద ప్రసీద 73

పురా క్రూరదైత్యాన్ నిహత్య ప్రహృష్ట -
ప్రతాపాద్భవానాదితేయానరక్షీః
పురార్యబ్జజాతాదిభూతాన్తరాత్మన్
ప్రసీద ప్రభో ఖాదిరీశ ప్రసీద 74

నమస్తే నమస్తే జగన్నాథ విష్ణో
నమస్తే నమస్తే ప్రభో ఖాదిరీశ
నమస్తే నమస్తే ప్రపన్నార్తిహారిన్
నమస్తే నమస్తే గదాపద్మపాణే 75

క్రుద్ధ్యద్దుర్మౌనిశాపాదభవమహమిహ స్థాపరః కంటకాత్తః
దీవ్యత్త్వత్పాదపద్మప్రసరణఫలతో వృక్షభావాద్విముక్తః
ముక్తోఽహం ముక్తగణ్యః సపది నరహరే ఖాదిరీశ ప్రసీద
శ్రీనాథ త్రస్తభక్తాభయద వరద భో పాహి మాం పాహి విష్ణో 76

భుజంగప్రయాతస్తుతిం యస్తు భక్త్యా
పఠేద్విష్ణుశర్మప్రణీతాం మహార్థామ్
పునర్జన్మ నాస్త్యేవ నాస్త్యేవ గచ్ఛేత్
స వై విష్ణులోకం నృసింహప్రసాదాత్ 77

నృసింహస్మరణాదేవ ముక్తిభాగ్వీతకల్మషః
భవేన్నరవరః ఖాద్రీనృహరేర్దర్శనాత్కిము 78

విష్ణుశర్మా తతః శ్రీమాన్ స్వాశ్రమం పరమం యయౌ
ఇతి తే ఖాదిరోత్పత్తిః కథితా నృహరేర్మునే 79

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే శ్రీఖాదిరీమాహాత్మ్యే
నృసింహస్య ఖాదిరీత్వప్రాప్తికథనం నామ ద్వాదశోఽధ్యాయః

పూర్వము క్రూరరాక్షసుల బాధలనుండి దేవతలను రక్షించితివి. నీవు సర్వాంతర్యామివి. అంతరదృష్టిలేని మేము నీయంతర్యామిత్వము నెఱుగకున్నాము. నీవే మాకు బుద్ధిప్రదానముచేసి నిన్ను తెలిసికొనునట్లు అనుగ్రహింపుము. ప్రసన్నుడవు కమ్ము. 75

ఓ జగన్నాథా! నీవు సర్వవ్యాపివై యుందువు. మేము ప్రమత్తులమై నిన్ను స్మరియింపక యేమరియున్నను నీవుగా మమ్ములను మేలుకొలిపి హితమును చేతువు. భక్తార్తిశమనమునకై నీవు సకలవిధప్రహరణాయుధములను సర్వదా ధరింతువు. మాయందు ప్రసన్నుడవు కమ్ము. 76

కోపించిన దుర్వాసునిచే శపియింపబడి కంటకావృతమగు వృక్షమై జన్మించిన నాకు నీపాదపద్మముల స్పర్శముచే శాపమోక్షముకల్గి ధన్యుడనైతిని. నీవు భక్తులను కాపాడెడి ప్రభుడవనుటకు నేనే సాక్షినై యనుభవించుచున్నాను. నన్ననుగ్రహింపుము. 77

విష్ణుశర్మచే రచియింపబడిన భుజంగప్రయాతవృత్తరూపమై పరమార్థగర్భితమైన ఈస్తోత్రమును భక్తితో ననుసంధించు వారలకు ఈదేహాంతమున మరల పుట్టుట యనునది కలుగదు. వారలు నరసింహదేవుని ప్రసాదమువలన పరమపదమును చేరుదురు. 78

వేయేల! శ్రీనారసింహుని నామమును స్మరించినమాత్రమున మోక్షముకల్గుట సిద్ధము. నామస్మరణముచేసెడి వారలపుణ్యము అగణ్యము. ఆవల విష్ణుశర్మ భగవదనుగ్రహశ్రీయుక్తుడై పరమానందముతో స్వాశ్రమమున కేగెను. ఇట్లని నృసింహదేవునికి ఖాద్రినృసింహుడను ఖ్యాతికలిగిన విధమెరుంగదగినది.

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున నృసింహదేవునకు ఖాద్రినృసింహుడను వ్యవహారము కల్గుటకు కారణమును నిరూపించినది పంద్రెండవ అధ్యాయము

శ్రీ నృసింహాయ నమః

## అథ త్రయోదశోఽధ్యాయః

నారదః :- నమస్తే పార్వతీకాన్త నమస్తే వృషభధ్వజ
శ్రుతం విస్తరతస్త్వత్తో నరసింహస్య వైభవమ్ 1

శ్రోతుమిచ్ఛామి యే చాఽన్యే విశేషాస్తానహం పునః
ఆప్తవాక్యం త్వదుక్తం మే సత్యం నృణాం హితం భువి 2

మత్ప్రార్థితం సమాదృత్య వక్తుమర్హసి శంకర
వినాయాసేన సర్వేషాం జనానాం భజతాం హరిమ్ 3

భవేదిష్టఫలావాప్తిః కస్మిన్ క్షేత్రవరే శుభే
సర్వేషాముత్తమం క్షేత్రమాఖ్యాహి మమ శంకర 4

లతా సంజీవనీ కాచిదస్తి స్వర్గే న భూతలే
సుధా చ విద్యతేఽత్రైవ మర్త్యానాం దుర్లభా భువి 5

ఇంద్రస్యైవాస్తి నాన్యస్య సదా ధన్వంతరిః భిషక్
అశ్వినౌ దేవతే తౌ హి కామధేనుః సురద్రుమః 6

యద్యత్సద్వస్తు తత్సర్వం స్వర్గ ఏవ ప్రతిష్ఠితమ్
తద్వస్తుజాతం మనుజైః ద్రష్టుమప్యతిదుర్లభమ్ 7

కేషాంచిదేవ మహతా క్లేశేనాప్యభితి శ్రుతమ్
తస్మాద్దివి పృథివ్యాం వా వద కించిత్సుఖాస్పదమ్ 8

సంజీవన్యాః సుధాయా వా శక్తేః శతగుణాధికమ్
యావన్తి పుణ్యతీర్థాని యాని దేవగృహాణి చ 9

తావన్తి పుణ్యతీర్థాని సాగరా గిరయో భువి
పుణ్యాన్యుపవనానీహ శేషాద్రిప్రముఖాని వై 10

శ్రీ నృసింహాయ నమః

## పదిమూడవ అధ్యాయము

నారదుడు అడుగుచున్నాడు :—

ఓ పార్వతీనాథా ! శ్రీ నరసింహుని వైభవమును నీవు చెప్పగా విస్తరించి వినియుంటిని. ఇంకను నాకు చెప్పదగిన విశేషములుండునేని వానిని సైతము వినగోరెదను. నీవుపదేశించినది ఆప్తవాక్యము కావున సత్యమనుటలో సందియము లేదు. అయ్యది సకలలోకములకు హితకరమగును. నాప్రార్థనను ఆదరించి ప్రత్యుత్తరమొసంగుము. భగవన్నామస్మరణము తదారాధనము లోకహితమనుట నిశ్చయమే. ఐనను ఎక్కువ కష్టములేకుండ సులభమార్గముగా తరించుటకు ఏక్షేత్రముత్తమమైనది. దయతో నాకెరిగింపుము. (1-4)

సంజీవనియను నొక్కలత స్వర్గలోకమున నున్నట్లు వినుచున్నాము. అమృతముకూడ దేవలోకమందేయున్నది. స్వర్వైద్యుడగు ధన్వంతరి భగవానుడు దేవేంద్రునికే ఆరోగ్యమును చేకూర్చుచున్నాడు. అట్లే దేవవైద్యులగు నశ్వినీదేవతలు కామధేనువు కల్పవృక్షము ఒక్కటి యననేల యేయేపదార్థము సారవంతమైనదో ఆయాపదార్థము స్వర్గలోకమందే కలదు. మర్త్యులకది దుర్లభమై యున్నది. తపస్సంపన్నులగు యేకొద్ది మనుష్యులకు మాత్రమో బహుప్రయత్నసాధ్యముగ అట్టి శ్రేష్ఠపదార్థములు లభించుననియు వినుచున్నాము. కావున సంజీవనిలత కంటెను అమృతముకంటెనుకూడా దేవతలకును మానవులకును ఈప్సితమగు నుత్తమ పదార్థమును నాకు తెలియజెప్పుము. (5-8)

భారతభూమియందు లెక్కకు మిక్కిలిగ సాగరములు నదులు నదములు సరోవరములు పర్వతములు వనములు ఉపవనములు

తోతాద్రిః నైమిశం పుణ్యం సాలగ్రామశ్చ పుష్కరమ్
శ్రీముష్ణం వేంకటాద్రిశ్చ నరనారాయణాశ్రమః 11

కాశీ గయా ప్రయాగశ్చ శ్రీరంగం చైవమాదయః
శ్రుతాః క్షేత్రవిశేషా మే బహుశో బ్రహ్మణో ముఖాత్ 12

ఉక్తాన్యేతాని క్షేత్రాణి స్యురేకైకఫలాని వై
అభూతోపమమేతేభ్యః గుణైః శతగుణాధికమ్ 13

సర్వోత్తమం తీర్థమాహుః భూమ్యాం సుసులభం పరమ్
బలినామబలానాం చ దేవమానుషయోరపి 14

వర్ణాశ్రమాచారవతామితరేషాం చ పాపినామ్
సర్వేషాం స్నానపానాదియోగ్యం కర్మను పావనమ్ 15

పశ్యతాం స్నాయతాం చైవ పిబతాం స్మరతాం తథా
ఆయురారోగ్యదం కన్యావరయోరానురూప్యకృత్ 16

కుటుంబవృద్ధిదం శ్రీదం నిరన్తరశుభోదయమ్
సర్వపాపావహం విష్ణోః సాయుజ్యప్రదమేవ చ 17

సమ్యక్ జ్ఞానం చ ముక్తిశ్చ తీర్థస్నానాద్భవిష్యతి
అద్భుతం తస్య మాహాత్మ్యం క్షేత్రస్య శ్రూయతే ప్రభో 18

కథం సర్వమిదం ప్రాప్తముపపన్నం మహేశ్వర
శంకర ఉవాచ:- దేవర్షే మహదాఖ్యానం సమ్యగుక్తం త్వయాऽధునా

త్వయోక్తం తీర్థమాహాత్మ్యం సాకల్యేన ప్రకీర్తితుమ్
అశక్యం మే బ్రహ్మణశ్చ సహస్రశిరసోऽపి చ 20

తథాऽపి కించిద్వక్ష్యేऽహం సమాహితమనాః శృణు
ఆసీల్లోకత్రయే ఖ్యాతో భృగుర్నామ్నా మునిః కిల 21

స్థితప్రజ్ఞో గుణాతీతో మహతాం జ్ఞానినాం వరః
వసన్తసమయే పుణ్యే కదాచిత్పుష్పితద్రుమే 22

దేవాలయములు కలవు. తోతాద్రి నైమిశము సాలగ్రామము పుష్కరము కాశి గయ ప్రయాగ శ్రీరంగము శ్రీముష్ణము వేంకటాచలము బదరికాశ్రమము మొదలగు పుణ్యక్షేత్రములున్నను అయ్యవి ఒక్కొక్కటి ఒక్కొక్క ఫలమును మాత్రమే ప్రసాదించుటకు సమర్థములైనవని చతుర్ముఖుడు చెప్పగా వినియుంటిని. ఈ క్షేత్రములన్నియుచేరి ఎంత గొప్పవో అంతకంటె నెక్కువ ఫలము నీయగల క్షేత్రము ఖాదిరీక్షేత్రమొక్కటి కలదనియు వింటిని. స్త్రీలు పురుషులు మనుష్యులు దేవతలు వర్ణాశ్రమాచార సంపన్నులు వర్ణాశ్రమాచారబాహ్యులు పుణ్యాత్ములు పాపులు వీరువారని తారతమ్యములేక సర్వులకు స్నానపానాదులకు అనుష్ఠానాదులకు యోగ్యమైన తీర్థవిశేషములుగలట్టి ఖాదిరీక్షేత్రము సర్వక్షేత్రములలో నుత్తమోత్తమమైనదనియు అందలి జలము త్రాగు వారలకు వేయేల! ఆజలములను కంటితో చూచువారలకు చూడకున్నను మనసులో స్మరించువారలకును ఆయురారోగ్య సంపత్తియు పురుషులకు అనుకూల స్త్రీలాభమును స్త్రీలకు అనుకూలవరలాభమును కల్గి దాంపత్య సుఖము కుటుంబవృద్ధి సంపద్వృద్ధి ఎడతెగని శోభనపరంపర కల్గి సకల పాపములు పోయి వైష్ణవలోకప్రాప్తియు కలుగునని యందురు. ఇంతటి గొప్ప మహిమము కలుగుటకు యెట్టి కారణముండునో తెలియ గోరెదను' అని అడుగగా శంకరుడిట్లని చెప్పెను. (9-16)

ఓ నారదా ! నీవు చెప్పినదంతయు సత్యమే. ఆతీర్థవైభవమును చెప్పుట చేతకాని పని. ఐనను యథాశక్తిగా చెప్పెద వినుము.

పూర్వకాలమున భృగువు అని యొక మహర్షి యుండెను. ఒకానొక వసంతకాలమందు ఖాద్రి నరసింహదేవుని బ్రహ్మోత్సవమును సేవించుటకై నానాదేశములనుండి మహర్షులెందరో విజయముచేసి శ్రీనాథుని యుత్సవమును సేవించుచుండిరి. ఒకనాడు మహర్షుల సదస్సునందు భృగుముని భగవత్కథలను వినిపించుచుండెను. పూర్వ

నృహరేరుత్సవం ద్రష్టుం సంగతా మునయః సురాః
తే చ సంసేవ్య నృహరేరుత్సవం సర్వకామదమ్ 23

ఇష్టాన్ కామానవాప్యాత్ర సుఖమూషురనాకులాః
తానన్తరే సమాహూయ కథాం చక్రే హరేర్భృగుః 24

అథ బ్రహ్మా భృగుం దృష్ట్వా సాఽసూయం వీక్ష్య మామపి
'శప్తావావాం పురా శంభో భృగుణా కిము విస్మృతమ్' 25

ఇత్యుక్త్వా మాం చతుర్వక్త్రో భృగోర్నికటమభ్యగాత్
స్మారితో విధినా శాపమహం భృగుసమీరితమ్ 26

తన్మహిమ్నః పరీక్షార్థం సోఽముచదదహీన్ బహూన్
తే దష్ట్వా తాపసం నష్టవిషా ఆస్యుర్మహాహయః 27

గతస్మయః సుసంమాన్య బ్రహ్మా భృగుమథాబ్రవీత్
శప్తస్త్వయా పురా బ్రహ్మన్ త్వన్మహత్త్వం బుభుత్సితుమ్

త్వాం దష్టుం ప్రేష్య చ వ్యాలాన్ పునరప్యవమానితః
త్వం చ సర్వే మునివరా యం ప్రాహుః శ్రేష్ఠమచ్యుతమ్ 29

స విష్ణురేవ లోకేశః స ఏవ జగతాం పితా
జగత్స్వామీ సర్వసుహృత్ తం నమామి హరిం ప్రభుమ్ 30

ఇదముక్తం భృగుః శ్రుత్వా బ్రహ్మాణం పునరబ్రవీత్
కిం తేఽభీష్టం వద బ్రహ్మన్ తత్కరిష్యామి తే హితమ్ 31

ఇత్యుక్తస్తేన భృగుణా బ్రహ్మోవాచ భృగుం మునిమ్
అదృశ్యః సర్వగో విష్ణురేవమాహుర్మనీషిణః 32

స కథం దర్శనీయః స్యాద్దివ్యమంగలవిగ్రహః
త్వమద్య పుటకే దేవం లక్ష్మీశం నః ప్రదర్శయ 33

తథేతి భృగురాశ్రుత్య ధ్యాత్వాఽఽహూయ జనార్దనమ్
దర్శయామాస దేవేభ్యః తుష్టువుశ్చ దివౌకసః 34

మొకప్పుడు భృగుమునిచే తానుశపింపబడిన యంశమును స్మరించి చతుర్ముఖుడు మునియందసూయ చెంది నన్ను పిలచి 'ఓశంకరా! మనల నిరువురను ఈభృగువు శపించుటను మరచితివా!' యని హెచ్చరించి భృగుని ప్రక్కకుపోయెను. నేనును 'ఔను'! అని తలయూచితిని. అంతట భృగువు నవమానించదలచిన బ్రహ్మ యాతని గరవుడని సర్పములను ప్రేరేపించెను. సర్పములాతనిగరచి నిర్వీర్యములై పారిపోయెను.

బ్రహ్మయు భగ్నదర్పుడై భృగువుననునయించి తానొనరించిన యపచారమును నివేదించి క్షమాపణమును వేడెను. ఏనాడో పరీక్షించి భృగువు స్థాపించిన విష్ణుసర్వేశ్వరత్వసిద్ధాంతమును బ్రహ్మ స్వయముగ అంగీకరించి విష్ణువే సర్వదేవోత్తముడు సర్వశరీరి సర్వాంతర్యామి సర్వస్వామి సర్వసుహృత్తు అని యుద్ఘోషించి శ్రీమహావిష్ణుని నమస్కరించెను. (29-31)

భృగువు సంతసించి బ్రహ్మయభీష్టమును చెప్పుమని యడుగగా బ్రహ్మ తన యభీష్టము నిట్లని చెప్పెను. 'విష్ణువు వేదాన్తవేద్యమగు పర బ్రహ్మమైనచో పరబ్రహ్మపదార్థము వేదాన్తములందు చక్షువులకు వాక్కుకు మనసుకు అగోచరమని చెప్పబడుటచే యాతనికొక దివ్య మంగళవిగ్రహము కల్గుట యెట్లుసంభవించునను సంశయము నాకు కల్గినది. ఆదివ్యశక్తిని మాకు కనుపింపజేయగోరెదను' అనియడుగగా భృగువు సంతసించి తన హృదయకుహరమందుండి ధ్యానయోగముచే భగవానుని దివ్యమంగళవిగ్రహమును సాక్షాత్కరింపజేసెను. దేవతలంద రును ఆదృశ్యమును చూచి యానందించి స్తుతియించిరి. 'అహా! ఏమి ఈరూపము, ఇట్టి దివ్యమోహనరూపము స్వర్గమర్త్య పాతాలములం దెచ్చటను కనుబడలేదు. అని పరమాశ్చర్యముతో చెప్పుకొనిరి. (29-37)

అచ్చట చేరినది సాధారణగోష్ఠి కాదు. బ్రహ్మను ఆరంభము చేసికొని శాండిల్యుడు జహ్ను జాబాలి విశ్వామిత్రుడు అత్రి గౌతముడు

సత్యలోకే తపోలోకే స్వర్లోకే వాऽథ భూతలే
పాతాలేऽన్యత్ర కుత్రాపి న దృష్టం రూపమీదృశమ్ 35

ఇతి విస్మయమాపన్నా బ్రహ్మాద్యామునయశ్చ యే
సంభూయ మహాత్మానః సతతం బ్రహ్మవాదినః 36

శాండిల్యజహ్నుజాబాలివిశ్వామిత్రాత్రిగౌతమాః
కణ్వగోభిలమాండవ్యా వసిష్ఠాంగిరసావృషీ 37

శాతాతపః శౌనకశ్చ భారద్వాజోऽథ కుండినః
జమదగ్నిః మృకండుశ్చ మార్కండేయోऽథ దత్తిలః 38

దుర్వాసా గాలవో గార్గ్యః పులస్త్యః కపిలస్తథా
హారీతః పులహో దక్షః పుణ్యశ్రుతబహుశ్రుతౌ 39

అహం చ పరమానందభరితో భృగుసన్నిధౌ
అస్తౌషం నృహరిం ప్రీతః స చ మన్నికటం గతః 40

విభుర్విష్ణుః ప్రభుః శ్రీమాన్ భూతాత్మా భూతభావనః
యజ్ఞేశో యజ్ఞభృద్యజ్ఞపాలకో లోకపాలకః 41

గ్రసిష్ణుః ప్రభవిష్ణుశ్చ విశ్వాత్మా విశ్వతోముఖః
విశ్వపాద్విశ్వకుక్షిశ్చ విశ్వసాక్షికర్ణవాన్ 42

సత్పూజ్యః పుండరీకాక్షః దుగ్ధార్ణవనికేతనః
ప్రేరకః సర్వజంతూనాం ఫలదః సర్వకర్మణామ్ 43

భక్తిసేవ్యః పురాణశ్చ ముక్తిదో భక్తవత్సలః
వైకుంఠః కమలావాసః సురసంఘనమస్కృతః 44

త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమోంకారస్తనూనపాత్
త్వం స్వాహా త్వం స్వధా హోతా త్వం హుతం హవ్యమీశ్వర

త్వం బ్రహ్మ త్వమహం రుద్రస్త్వం వాయుస్త్వం యమోऽర్యమా
త్వం తేజస్త్వం మహాకాలో గిరయస్త్వం త్వమాగమాః 46

కణ్వుడు గోభిలుడు మాండవ్యుడు వసిష్ఠుడు అంగిరసు శాతాతపుడు శౌనకుడు భారద్వాజుడు కుండినుడు జమదగ్ని మృకండుడు మార్కండేయుడు దత్తిలుడు దుర్వాసుడు గాలవుడు గార్గ్యుడు పులస్త్యుడు కపిలుడు హారీతుడు పులహుడు దక్షుడు పుణ్యశ్రుతుడు బహుశ్రుతుడు మొదలగు బ్రహ్మవాదులెందరో కలరు. నేనును పైచెప్పిన భాగవతగోష్ఠితోచేరి పరమానందముతో భృగువును పురుషకారముగ జేసికొని భగవానుని స్తుతియించితిని. భగవానుడు నన్ననుగ్రహించి నాచెంతకు కూడవచ్చెను.

'నీవు సర్వవ్యాపివి సర్వాంతర్యామివి ప్రభుడవు లక్ష్మీపతివి భూతాత్మవు భూతభావనుడవు యజ్ఞేశుడవు యజ్ఞభర్తవు యజ్ఞపాలకుడవు లోకపాలకుడవు సంహర్తవు ప్రభవిష్ణుడవు విశ్వాత్మకుడవు విశ్వతోముఖుడవు విశ్వపాదుడవు విశ్వకుక్షివి విశ్వనాసుడవు విశ్వనేత్రుడవు విశ్వశ్రోత్రకుడవు సాధుపూజ్యుడవు పుండరీకాక్షుడవు క్షీరార్ణవనికేతనుడవు సర్వచేతనులకు ప్రేరకుడవు కర్మఫలదాతవు భక్తిసేవ్యుడవు పురాతనుడవు ముక్తిప్రదాతవు భక్తవత్సలుడవు వైకుంఠనాథుడవు లక్ష్మీకావాసమైనవాడవు దేవతాసంఘముల నుద్ధరించువాడవు యజ్ఞమవు వషట్కారమవు ఓంకారమవు తనూనపాత్తువు స్వాహాకారమవు స్వధాకారమవు హోత హుతము హవ్యము నైనవాడవు తేజస్సువు మహాకాలరూపివి పర్వతములు ప్రమాణములు కలాకాష్ఠాముహూర్తపక్షమాసర్తువులునైయున్నవాడవు అఖండకాలమవు కనకాచలమవు కారణము కార్యము నైనవాడవు ఆద్యంతములులేనివాడవు చిద్రూపివి ఆత్మభువుడవు. ధైర్యమున కాటపట్టవు విశ్వభోక్తవు అనన్తుడవు అప్రమేయుడవు సర్వవ్యాపివి గరుడధ్వజుడవు స్తవ్యుడవునగు నీకు నమస్కారము.'

ఇట్లని పలువిధముల స్తోత్రముచేసి పావమానమంత్రములు పురుషసూక్తము వైష్ణవమంత్రములు నారాయణపరములగు ఏకాక్షరాది సూక్త

కలాకాష్ఠాముహూర్తాస్త్వం పక్షమాసర్తుమూర్తిమాన్
కాలస్త్వం కనకాద్రిస్త్వం కారణం కార్యమేవ చ 47

త్వమనాదిరనన్తశ్చ త్వం చిద్రూపస్త్వమాత్మభూః
నమస్తే ధృతధైర్యాయ విశ్వభోక్త్రే నమో నమః 48

అనన్తాయాప్రమేయాయ విష్ణవే విభవే నమః
గరుడధ్వజాయ చ నమో గీయమానాయ తే నమః 49

స్తుత్వేత్థం పావమానీభిః నరసూక్తేన వైష్ణవైః
ఏకాక్షరాదిభిః సూక్తైః నారాయణపరైర్వరైః 50

పారమాత్మికమన్త్రైశ్చ నరకేసరిణం విధిః
అభ్యషించద్విధానేన స్వకమండలువారిణా 51

బ్రహ్మణా నిర్మితం స్తోత్రం పఠతాం శ్రుణ్వతామిదమ్
సర్వసంపత్సమృద్ధిః స్యాత్ ఖాదిరీశప్రసాదతః 52

భృగురారాధ్య విధినా స్తుత్వా వేదాన్తగోచరైః
మంత్రభాగైర్బహువిధైః దత్వా పుష్పాంజలిం క్రమాత్ 53

ప్రణామాంశ్చైవ సాష్టాంగాననేకానకరోత్తథా
అహం బ్రహ్మ చ లక్ష్మీశం నత్వా భృగుమునిం తథా 55

అతిష్ఠావ హరేః పార్శ్వే పురస్కృత్య భృగుం మునిమ్
ప్రసాదకాంక్షిణావావామాలక్ష్య భృగురబ్రవీత్ 55

యదుక్తం ప్రాఙ్మయాకోపాల్లింగరూపం తవాస్త్వితి
తన్మాస్తు సర్వథా తత్త్వం రూపం స్యాత్తే మనోరమమ్ 56

గిరికన్యాయుతం దివ్యముత్సవేషు మహేశ్వర
బ్రహ్మంస్తే సహజం రూపం సత్యలోకే సమర్చ్యతామ్
క్వచిత్క్వచిచ్చ భూభాగే మందిరాణి లసన్తు తే 57

ములు పారమాత్మికమంత్రములు మొదలగు మంత్రములచే తనకమండలు నందలి పుణ్యోదకములచేత చతురాననుడు భగవానుడగు నరసింహ దేవుని కభిషేకము చేసెను. (51-52)

బ్రహ్మచే నిర్మింపడిన పై స్తోత్రమును పఠియించువారలకును విను వారలకును ఖాద్రిప్రభుని ప్రసాదమువలన సకలసంపత్తులు చేకూరును.

భగవానునట్లే భృగుముని యారాధించి ఉపనిషన్మంత్రములతో పుష్పాంజలిని సమర్పించి అనేకమారులు సాష్టాంగప్రణామములాచ రించెను. నేమను బ్రహ్మయుకూడ భగవానుని భృగువును దర్శించుచు ప్రక్కను నిలచితిమి. ఏదో ఆశించుచున్నట్లు మాముఖమై ఖరినిబట్టి చింతిం చిన ఇంగితజ్ఞుడగు భృగువు మమ్ములనుజూచి ఇట్లనెను. (54-56)

'ఓపార్వతీనాథా! ఒకప్పుడు నిన్ను లింగరూపమవసునట్లు నేను శపించితిని. నీమూలరూపమట్లేయుండకతప్పదు. ఉత్సవ అవసరములో పార్వతీదేవితో కలసిన నీదివ్యమంగళవిగ్రహమును భక్తులారాధిం తురుగాక. ఓకమలాసనా! నీయారాధనము యథాపూర్వముగ సత్యలోక మందు జరుగుగాక. భూమండలమందును బహులముగాగాక అక్కడక్కడ నీకాలయములు నిర్మింపబడుగాక. మీకు చేయబడిన నివేదనములు సాల గ్రామతీర్థముతో చేరినపుడు సేవాకాంక్షులకు గ్రాహ్యములగుగాక. మిమ్ము లను పూజించెడి భక్తులకు మీయధికారమునకు లోబడి వారియెడమీకు ఫల దాతృత్వాధికారము లభించుగాక' అనిచెప్పెను. నీ నామస్మరణమువలన భవ (సంసార) మోచనము కల్గుటచే నీకు భవుడను పేరునుగూడ సన్వర్థమగుగాక యని నాకు వరమిచ్చెను. (57-60)

మరియు భృగుముని భగవానుని మరిమరి ఇట్లని స్తుతియించెను 'దేవాధిదేవుడును భక్తాభీష్టప్రదుడును సర్వాంతరాత్మయునగు ఖాద్రి నృసింహునకు మంగళమగుగాక. అనంతుడు అప్రమేయుడు నిత్యుడు

సాలగ్రామశిలావారిసహితం త్వన్నివేదితమ్
గ్రాహ్యమస్తు ద్విజాతీనామితరేషాం చ పావనమ్ 58

త్వత్పూజనపరాణాం చ త్వమిష్టఫలదో భవ
భవనామ తథా తేఽస్తు స్మరతాం భవమోచనమ్ 59

ఇత్యుక్త్వా మాం భృగుర్భూయస్తుష్టావ గరుడధ్వజమ్
నమో దేవాధిదేవాయ భక్తాభీష్టప్రదాయ చ
సర్వాంతరాత్మనే శ్రీమత్ ఖాదిరీశాయ మంగళమ్ 60

అనన్తాయాప్రమేయాయ నిత్యాయానిధనాయ చ
విశ్వేశాయ రమేశాయ ఖాదిరీశాయ మంగళమ్ 61

మనోగ్రాహ్యాయ నయనైరగ్రాహ్యాయాగ్రచక్షుషే
గరుడోపరిసంస్థాయ ఖాదిరీశాయ మంగళమ్ 62

అధోక్షజాయ జగతాం పతయే పతయే మమ
సనాతనాయ సర్వాయ ఖాదిరీశాయ మంగళమ్ 63

పరమాత్మాత్మనే ముక్తపురుషాత్మాత్మనే సతే
చిదానందస్వరూపాయ ఖాదిరీశాయ మంగళమ్ 64

ఇతి స్తుత్వా భృగుర్దేవమభ్యగాదాశ్రమం నిజమ్
మునయోఽన్యే తథా బ్రహ్మ శ్రుత్వా తత్తీర్థవైభవమ్ 65

సాలగ్రామశిలాతీర్థమతిపాతకనాశనమ్
దారిద్ర్యమృత్యుపాపేభ్యః సకృత్పానేన పాతు నః 66

ఇతి మంత్రం సముచ్చార్య పంశుద్ధ్యోదత్కరాంఘ్రయః
గోకర్ణాకృతిహస్తేన కరాంతరగతేన చ 67

గృహీత్వా పావనం తీర్థం శ్రద్ధాభక్తిసమన్వితాః
పీత్వా నరహరిం స్తుత్వా ప్రణమ్య చ పునః పునః 68

నిధనములేనివాడు విశ్వేశ్వరుడు లక్ష్మీపతియునగు ఖాద్రినృసింహునకు మంగళమగుగాక. విశుద్ధమగు మనసుచే తెలియదగినవాడును బాహ్యేంద్రియములకు గోచరముకానివాడును సర్వవ్యాప్తమగు జ్ఞానముకలవాడును గరుత్మానుని వాహనముగ కలవాడును నగు ఖాద్రినృసింహునకు మంగళమగుగాక. అధోక్షజుడును జగత్పతియు విశేషించి నాకు నాథుడును సనాతనుడును సర్వస్వరూపియునగు ఖాద్రినృసింహునకు మంగళమగుగాక. పరమాత్మస్వరూపుడును ముక్తపురుషులకును అంతరాత్మయు సద్రూపియు చిద్రూపియు ఆనందరూపియునగు ఖాద్రినృసింహునకు మంగళమగుగాక. (61-65)

భృగుముని పైవిధముగ భగవానుని స్తోత్రముచేసి తపయాశ్రమమునకు పోయెను. ఇతరఋషులును బ్రహ్మయుభగవానుని మహత్త్వమును విని సంతుష్టులై 'సాలగ్రామమూర్తియొక్క తీర్థము అతిపాతకములను నశింపచేయగలదు. ఈపుణ్యతీర్థము నొక్కమారు త్రాగిన నయ్యది దారిద్ర్యము మృత్యువు పాపములు వీట్లనుండి మమ్ములను కాపాడుగాక' అనుమంత్రమును జపియించుచు ధౌతములగు హస్తపాదములు కలవారలై గోకర్ణాకృతి యగునట్లు కుడిఅరచేతిని యెడమఅరచేతనుంచి పావనమగు నాతీర్థమును శ్రద్ధాభక్తులతో కూడినవారలై త్రాగి శ్రీనారసింహుని పలుమారులు నమస్కరించి భగవానునియొద్ద అనుమతి పొంది తమతమ నెలవులకు పోయిరి. (66-70)

నేనును అచ్చటి దేవతల నుద్దేశించి మనమిచ్చటనే ఉండెదమని చెప్పితిని. లక్ష్మియు భైరవుడు ఈయిరువురు మాత్రము సన్నిధియందు నిలచిపోయిరి లక్ష్మీదేవి యెడమచేతిలో ఒకపండును కుడిచేతిలో పద్మమును ధరించి ద్విహస్తయైనిలిచియున్నది. భైరవుడును నాలుగుహస్తములలో ఖడ్గము డమరుకము త్రిశూలము కపాలము నను నాలుగాయుధములనుధరించి శిరసున రత్నకిరీటము కర్ణములందు కుండలములు కంఠ

నృసింహేనాభ్యనుజ్ఞాతాః ప్రయయుః స్వం స్వమాలయమ్
తథైవాహం సురాన్ దృష్ట్వా పునరప్యబ్రువం వచః 69

ఖాదిరస్య నృసింహస్య హరేరస్య పునః పురమ్
వరం క్షేత్రమితి జ్ఞాత్వా తత్రైవ స్థీయతామితి 70

లక్ష్మీశ్చ భైరవశ్చైవ తస్థతుః సన్నిధౌ హరేః
లక్ష్మీర్దేవీ కరే వామే ఫలం ధృత్వా మనోహరమ్ 71

దక్షిణే తు కరే పద్మం ద్విహస్తా స్థానకాశ్రితా
హస్తేష్వసిం డమరుకం త్రిశూలంచ కపాలకమ్ 72

కరండమకుటం శీర్షిన్ కర్ణయోరపి కుండలే
కపాలమాలికాం కంఠే యజ్ఞసూత్రం చ భాస్వరమ్ 73

పాదయోః నూపురే ధృత్వా హస్తేషు వలయానపి
హృదయే నృహరిం ధ్యాయన్ భైరవో భీమవిక్రమః 74

ఇత్థం త్రిణేత్రో భగవాన్ సురక్షాయే
ఖాద్రేః నృసింహస్య మహత్త్వమద్భుతమ్
తీర్థోత్తమానాం చరితం మహార్థదం
శశంస సంసారభయాపనుత్తయే 75

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే రుద్రనారదసంవాదే ఖాద్రీమాహాత్మ్యే
త్రయోదశోఽధ్యాయః

మందు కపాలమాల ప్రకాశమానమగు యజ్ఞోపవీతము పాదములందు అందెలుహస్తములందు కంకణములుధరించి నిలుచున్నవాడై శ్రీనృసింహదేవుని మనసున ధ్యానించుచు శిఫుభీకరుడై సన్నిధియం దుండిపోయెను.

'వ్యాసో నారాయణో హరిః' 'యని భగవానుని యపరావతారముగ స్తుతియింపబడిన శ్రీవేదవ్యాసునికావాసమగు వేదారణ్యక్షేత్రము, అందు శ్రీకృష్ణపరమాత్మ వసియించిన గోవర్ధనాచలము, విష్ణుపాదాంకనముచే పవిత్రితమగు స్తోత్రాద్రి, చతుర్ముఖుని కమండలునందలి పుణ్యోదకము లచే భగవత్పాదసరసిజముల నభిషేకించినప్పుడేర్పడి ప్రవహించి కారణాంతరమువలన పాండవమధ్యముని పేరిట వ్యవహరింపబడిన అర్జుననది, శ్వేతపుష్కరిణి, భృగుతీర్థము, లక్ష్మితీర్థము, వ్యోమగంగ, గరుడతీర్థము, సర్వపాపహరమగు భవనాశినీతీర్థము, శిష్టరక్షణ వ్యాజమున దుష్టరాక్షస సంహారముజేసిన నృసింహభగవానుడు, శ్రుతిమహితమగు వైఖానసార్చనము, ఇందు ఒక్కొక్కటియు మోక్షసామ్రాజ్యమునకు సాధకమై యున్నవి. ఇవియన్నియుకలసి ఖాద్రిక్షేత్రమందొక్కచోట నమరియుండుటచే ఖాద్రిక్షేత్రము సర్వక్షేత్రములలో నుత్తమమైనది. దాననే ఈపుణ్యక్షేత్రమందు శ్రద్ధాభక్తులతో ఆచరింపబడెడి యజ్ఞము దానము తపము మొదలగు కార్యములన్నియు శీఘ్రకాలమున శతగుణిత ముగను సహస్రగుణితముగను ఫలించి సాధకులకు ఐహలౌకిక సర్వ కామఫలావాప్తిని ప్రసాదించి దేహాంతమున శ్రీనారసింహుని నిత్యనిరత శయానంద శాశ్వత పరమపదమునననుగ్రహించుచున్నవి. ఇదియే ఈక్షేత్రమునకు ఇతరక్షేత్రములపైగల వైశిష్ట్యము.

ఇట్లని పరమశివుడు సురర్షియగు నారదునకు అద్భుతమగు శ్రీనరసింహదేవుని మహత్త్వమును ఖాద్రిక్షేత్రమందలి తీర్థరాజముల యొక్క పరమప్రయోజనసాధనమగు దివ్యచరిత్రనును వివరించెను. ఈచరితమును వినినవారలకు సంసారభయము అనగా ఇహలోకమందు

ఒడుదుడుకులు లేకుండుటయు దేహాంతమున పునర్జన్మము కలుగ కుండు టయు నిశ్చయము. అత్యంతశ్రమసాధ్యములగు యజ్ఞదానతపంబులచే ఆయాయధికారులు మోక్షమును సాధింపయత్నించెదరు. ఫలప్రాప్తి యరుదు. ఖాద్రిక్షేత్రమునకు తీర్థయాత్ర వెడలుట ఖాద్రినిచేరుట తీర్థము లందు స్నానానుష్ఠానదానాదులజేయుట శ్రీనృసింహభగవానుని సేవించి తీర్థప్రసాదములను స్వీకరించుట నను నీకార్యములు యజ్ఞదానతపంబు లంతటి కష్టసాధ్యములు కావు. ఫలము నిశ్చితము.

ఇది శ్రీబ్రహ్మాండపురాణమున రుద్రనారదసంవాదమందు
ఖాదిరీమాహాత్మ్య గ్రంథమునందలి పదిమూడవ అధ్యాయము.

జయత్యాత్మేశ్వరోస్మద్ధ్యానసౌధప్రియాతిథిః
శ్రీమత్పుత్రపురీవాసః శ్రీరామః సీతయాగృహీ॥

శ్రీ నృసింహార్పణమస్తు

శ్రీవిఖనసమహాగురవే నమః

| పుట | పంక్తి | |
|---|---|---|
| 4 | 6 | మునే |
| | 10 | సంశితవ్రతాః |
| | 13 | గన్ధిషు |
| 6 | 4 | కాదంబ |
| | 6 | బదర |
| | 15 | స్వర్ణవర్ణసమావృతాః |
| | 17 | వానరాద్యైశ్చ |
| 8 | 4 | వ్యాఘ్రాఃటిట్టిభైశ్చాప్యనేకశః |
| 10 | 7 | శరచ్చంద్ర |
| | 14 | అదీనాత్మా |
| | 24 | దైవతైః |
| 12 | 7 | తుల్యాః |
| 14 | 16 | అమలత్విషః |
| | 17 | విలసత్ |
| 16 | 14 | ఘర్మాంబు |
| | 23 | లిహద్భిః |
| | 24 | శబలైః |
| 18 | 8 | దివ్యజ్ఞాన |
| | 10 | ముచ్యస్తే |
| | 15 | నిర్మలాత్మా |
| | 19 | అన్వయుంక్త |
| 20 | 16 | భ్రాతృహననాత్ |
| | 0 | నిర్వృత్తిస్తతః |
| 22 | 37 | ఉపవిష్టః |
| 24 | 2 | దైవం |
| | 12 | కించిద్ధరేః |
| | 24 | కల్పాన్తే |
| 26 | 19 | తానేవానుసరన్ |
| | 23 | జగన్నాథం |
| 28 | 22 | భీషణం |
| 32 | 8 | ఖ్యాతం |
| | 11 | పరస్పేతర |
| 34 | 6 | జిష్ణుః_వసవః |
| 36 | 9 | స్తుతిం |
| 40 | 2 | ఉత్సాహసంభః కర్తవ్యః |
| | 17 | ఇంద్రాద్యాశ్చ |
| 42 | 9 | వివస్వతా |
| | 24 | స్వంస్వం |
| 44 | 1 | అగస్త్య |
| | 3 | వైశ్యాః |
| | 7 | ధ్యాననిరతాః |
| | 9 | మర్త్యః |
| 48 | 9 | వాక్యైః |
| 50 | 2 | ఉద్దేశ |
| 58 | 7 | ఖలైః |
| | 16 | సరఃస్వర్గ |
| 60 | 2 | ప్రసీదేతి |
| | 11 | సిద్ధిం |
| | 12 | బహూభిః |
| | 18 | స్వమాశ్రమమ్ |
| | 21 | సమవాప్నోతి |
| 62 | 8 | వార్షికమ్ |
| | 18 | శతసూర్య |
| | 21 | గాంభీర్య |
| 66 | 4 | సాక్షీ |
| | 10 | మునీనాం |
| | 22 | భృగుః |
| 68 | 1 | అర్చయిష్యన్తి |
| | 11 | లక్ష్మ్యై |
| | 15 | జితదర్పణమ్ |
| | 18 | సింహమధ్యం |
| | 19 | విఘ్నం |
| | 24 | అర్ఘ్యాది |
| 70 | 6 | అహాంసి |
| | 21 | లోకేऽస్మిన్ |
| 72 | 1 | పాపాలయోऽస్మ్యహమ్ |
| | 7 | పీతాంబరపరీతాంగః |
| | 11 | ఆనందాంబుధి |
| | 23 | విశుద్ధచేతసః, నిరంతరధ్యానవశాత్రప్తబుద్ధాః |
| 74 | 2 | సమాయుక్తాన్ |
| | 7 | జనాస్తే |
| | 15 | సముత్థాస్య |
| 76 | [illegible] | ప్రోవాచ |

| పుట | పంక్తి | |
|---|---|---|
| | 12 | యస్మాస్మద్భక్తానాం |
| | 22 | జనార్దన: |
| 78 | 14 | శుభై: |
| 84 | 4 | సర్వస్మి౯ |
| | 6 | స్నాయినాం |
| 86 | 7 | తుష్టువు: |
| | 8 | దేవానిదంవచ: |
| 90 | 16 | పరిచచారహ |
| 92 | 3 | దానవా౯ |
| | 9 | యస్యాస్తీరే |
| | 11 | వాపినారీవా |
| | 20 | విశుద్ధాత్మా-స్నాత్వా |
| 94 | 5 | శ్రుతినిచయ |
| 96 | 2 | స్పృహారేర్మనే |
| | 6 | సురమునే |
| | 11 | మునిశార్దూల: |
| | 12 | మందిరంగత్వా |
| | 18 | స్నాహకిరావిర్భూయ - అర్జునమ్ |
| | 19 | పార్థ: |
| | 20 | జనార్దనమ్ |
| 98 | 9 | విద్విమౌద్గల్యస్య |
| | 11 | వినయాన్విత: |
| | 23 | మహాతేజా: |
| | 2 | తటినీ |
| 100 | 14 | సలినోత్పల |
| | 18 | నిల౯జ్జా కాచిదాలింగతి |
| | 24 | క్రీడతి |
| 102 | 6 | ఉన్మీలయ౯ |
| | 18 | గృహ్ణా౯ |
| | 26 | గతాశ్చ |
| 104 | 24 | తరోర్మూలే |
| 106 | 12 | దేవేశ |
| 108 | 18 | అర్జునాఖ్యస్య |
| 110 | 6 | పావనతరం |
| | 16 | విధివత్ |
| 112 | 9 | అస్యార్జుననదీ |
| 114 | 16 | తంవిప్రం |
| 116 | 7 | పులకాంకితాంగక: |
| 118 | 11 | దశసు |
| | 14 | విజయార్థం |
| 120 | 1 | దేవతాయతనాని |
| | 6 | సరోవరైస్సహులివై: |
| | 18 | తత్రాగతా౯ |
| | 26 | భావికోత్పత్తి |
| 124 | 18 | ప్రశశంస |
| 126 | 20 | పరాత్పరమ్ |
| 128 | 1 | దృష్ట్వా |
| 132 | 13 | వనజోద్భవ (పాఠ:) |
| 134 | 17 | దివ్యనామ |
| 136 | 14 | శరదభిఖో |
| | 19 | స్మరణాదేవ |
| 140 | 14 | సర్వపాపాపహం |
| 142 | 3 | అవాప్య |
| 143 | 21 | శుద్ధోద్యత్కర |

## తెనుగు భాగము

| పుట | పంక్తి | |
|---|---|---|
| 13 | 6 | భగవత్కథలనే |
| 17 | 9 | శోభాయమానము |
| 19 | 16 | దోషములను నశించి |
| 23 | 11 | ఆటోపము |
| 27 | 14 | నరసింహ |
| 31 | 21 | మహాపుణ్యాలు |
| 41 | 3 | దివ్యవసంత |
| | 17 | మునిపుంగవులు |
| 59 | 8 | ప్రభృతులు |
| | 16 | శ్వేతముని |
| 61 | 1 | దర్శనమువలన |
| | 10 | స్మృతిపథము |
| 73 | 3 | ఛాయయందు |
| 81 | 15 | గోసహస్ర |
| | 18 | శ్రియ: పతిఐహలౌకిక |
| 91 | 8 | ఉపదేశమును |
| 95 | 4 | సంపత్కాములు |
| 97 | 8 | ఒక్క-అర్జునవృక్షము |
| 99 | 5 | అమోఘము |
| 101 | 8 | భగవానుని |
| | 12 | సర్వేప్సుముగ |
| | 14 | వసియించెడి |
| 103 | 15 | అవిద్యాధర చక్రవర్తినే |
| 127 | 3 | చంద్రవృక్షములుగల |
| 133 | 1 | సుప్రతిష్ఠితుడు |
| 138 | 15 | కల్పవృక్షము |